# PRASANNAMUKHI.

*Historical Novel*



THE BOOK DEPOT,

RAJAHMUNDRY.

# ప్రసన్నముఖి.



(నవ[illegible]

కా్యవధానుల మా[illegible]చే

రచియింపఁబడి




ఈశ్వర బుక్కుడిపోవారిచే

ప్రచురింపఁబడియె.

రాజమండ్రి

రెండవకూర్పు 1000 (Revised.)

శ్రీచింతామణీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె,

రాజమండ్రి.

1927

కాపీరై[illegible]] [వెల రు 1-0-0.

# పీఠిక.

ఇందుఁ బదునేడవశతాబ్దమునాఁటి మధ్యహిందూదేశమునందలి కథాంశము గ్రహింపఁబడినది. ఆకాలంబున క్రీ. శ. 1664 వఱకు నాబుందేలుఖండమునందుఁ బ్రసిద్ధిఁ గాంచిన చంపతిరాయుని పుత్త్రుఁడైన ఛత్రసాలుఁ డనుమహీపాలుఁ డాఖండమునందున్న రాజుల కందఱకు స్వదేశోద్యమమును బోధించి వారలచే ననేకకృత్యములఁ జేయించి తాను ప్రభువై యాకాలంబున దుర్వారపరాక్రముండైన యౌరంగజేబుచక్రవర్తికి దుర్నిరీక్ష్యుఁడై యాతఁడు పంపిన మొగలాయీసరదారులతోఁ నైదుసారులు యుద్ధము చేసి యోడించి యాచక్రవర్తికి వశులగుచున్న సామాన్యతురుష్కరాజులచే చౌతాయీయను పన్నును వసూలు చేసికొని రెండవఛత్రపతి శివాజీమహారాజువలె స్వరాజ్యమును బ్రతిష్ఠించెను. తత్కథాంశమిందు విస్తరింపఁబడినది. ఈగ్రంథరచన 1918 సం॥ జూలయి 4వ తేదీని ప్రారంభింపఁబడి 24వ తేదీకిఁ బూర్తియైనది. మహాశయులీగ్రంథమునందలి లోపములను దెలిపిన ద్వితీయముద్రణమున సవరించికొందుము.

ఇట్లు
గ్రంథకర్త.

# పీఠిక.

ఇందుఁ బదునేడవశతాబ్దమునాఁటి మధ్యహిందూదేశమునందలి కథాంశము గ్రహింపఁబడినది. ఆకాలంబున క్రీ. శ. 1664 వఱకు నాబుందేలుఖండమునందుఁ బ్రసిద్ధిఁ గాంచిన చంపతిరాయుని పుత్త్రుఁడైన ఛత్త్రసాలుఁ డనుమహీపాలుఁ డాఖండమునం దున్నరాజుల కందఱకు స్వదేశోద్యమమును బోధించి వారలచే ననేకకృత్యములఁ జేయించి తాను బ్రభువై యాకాలంబున దుర్వారపరాక్రముండైన యౌరంగజేబుచక్రవర్త్తికి దుర్నిరీక్ష్యుఁడై యాతఁడు పంపిన మొగలాయీసరదారులతోఁ నైదుసారులు యుద్ధము చేసి యోడించి యాచక్రవర్త్తికి వశులయియున్న సామాన్యతురుష్కరాజులచే చౌతాయీయను పన్నును వసూలు చేసికొని రెండవఛత్రపతి శివాజీమహారాజువలె స్వరాజ్యమును బ్రతిష్ఠించెను. తత్కథాంశమిందు విస్తరింపఁబడినది. ఈగ్రంథరచన 1918 సం॥ జూలయి 4వ తేదీని బ్రారంభింపఁబడి 24వ తేదీకిఁ బూర్త్తియైనది. మహాశయులీగ్రంథమునందలి లోపములను దెలిపిన ద్వితీయముద్రణమున సవరించికొందుము.

ఇట్లు

గ్రంథకర్త.

# రెండవకూర్పు పీఠిక.

---

మొదటి కూర్పునఁగల స్ఖాలిత్యములుమాత్రమే దీనిలో సవరింపఁబడియె. కథాభాగమేమియు మార్పు చెందినది కాదు. చదువువారల సౌకర్యార్థము పెద్ద యక్షరములతో నీ కూర్పు ప్రచురింపఁబడియె.

ఇట్లు,

సంపాదకులు.

# విషయసూచిక.

ప్రకరణక్రమము.









శ్రీమత్పరదేవతాయైన మః

# ప్రసన్నముఖి.

## మొదటి ప్రకరణము.

---

### యోగి.

ఉ॥ భారతమాత కేధరణిభాగము భాసురగర్భసీమయో
వీరనృపాలశేఖరుల విశ్రుతకీర్తులఁ గాంచె నేదియో
సారజలప్రవాహతతిసంభవమై యొటఁ బంట లిచ్చునో
ఆరతనాలకుప్ప హృదయంబున నెన్నెద మధ్యమండలిన్॥

ఈశ్వరుని సృష్టివైచిత్ర్యము కడునద్భుతము; దాని విలాసములు గణనాతీతములు. ఆజగన్నేత యగాధజలాశయంబులు గల ప్రదేశములను సంపూర్ణసికతామయంబులుగను, కొలఁది దినంబులకు వానినే వనపర్వతసీమలుగను, మార్చుచు భౌతికపదార్థములు నశ్వరము లనియు, రూపాంతరపరిణామము లనియుఁ జాటుచుండును. శుష్కాటవులే యొక్కా

కవేళఁ గిసలయకుసుమఫలభరితములై యొప్పుచుండును. కాలవైపరీత్యమునం జేసి సకలభాగ్యసంపన్నంబు లయినపట్ట ణంబులే మరుస్థలంబులై దశఁ దొలంగి దారిద్ర్యదేవతకు నిల యంబులై యుండును. అట్టి మరుస్థలంబులే యఖండసామ్రా జ్యలక్ష్మీనివాసంబులై యలరారుచుండును. కాని యప్రా జ్ఞులు భాగ్యలక్ష్మిని శాశ్వతమని తలంచినట్లె దారిద్ర్యముఁ గూడ శాశ్వతమని యూహింతురు. ఆవిధముగ నెప్పుడును దలంపరాదు. తొల్లి యేకచ్ఛత్రాధిపతుల పరిపాలనలో నల రారు మనభారతమాత తరువాత ననేక రాజమార్తాండులచేఁ బరిపాలింపఁబడి వర్తమానంబున శ్రీపంచమజార్జి సార్వభౌముని యధికారమునకు వశవర్తినియై యుండుటలేదా ? కాన రాజ్యవైభవము లతిచంచలములు—మన మిప్పు డొకసారి సింహావలోకన మొనరించి క్రీస్తుశకము పదునేడవశతాబ్దినాటి మధ్యమహిందూదేశమునకుఁ బోవుదము 1628 సంవత్సరము మొదలుకొని ఢిల్లీసామ్రాజ్యలక్ష్మి షహాజహాన్ అను మొగ లాయి చక్రవర్తిని వరించెను. కాని యాసార్వభౌముఁడు తురుష్కకులసంభూతుండైనను హైందవరాజన్యుల సాధు చిత్తములకు వన్నెతేఁజాలినంతటి యంతఃకరణప్రవృత్తి కల వాఁడే కాని క్రూరస్వభావుఁడు కాఁడు. తల్లిదండ్రులు బిడ్డలను బోషించునట్లు ప్రజలను బరిపాలించునట్టి గుణభూషణుఁడు. సర్వజనసమ్మానితుఁ డౌటచేత నే హైందవరాజులు వశవర్తులై సంచరించుచుందురు కాని రాజ్యకాంక్ష రాజులకు సహజధర్మ

మగుటచే నితఁడప్పుడప్పుడు తన్ను సేవించినవారి నోడించు చుఁ గష్టము లనుభవించుచుండువాఁడు. ఇట్లుండఁ బులస్త్యబ్రహ్మకు రావణాసురుఁడైనట్లు, నితనికి నౌరంగజేబు అను పితృహంత పుట్టి సోదరుల మాయఁజేసి తండ్రిని వధించి ఢిల్లీ సింహాసనము నధిష్ఠించెను. అక్కాలమున నుత్తర హిందూదేశము రాజపుత్రులును, మహారాష్ట్రదేశమున గోబ్రాహ్మణ పరిపాలకచ్ఛత్రపతి బిరుదాంకితుఁడైన శివాజియును, మధ్యమ హిందూదేశమున బుందేలు లను రాజన్యులును పారతంత్ర్యమును దొలఁగించుకొని స్వతంత్రసామ్రాజ్యము నభిలషించి యాటవికుల సహాయులఁగఁ జేసికొని కొండల నాశ్రయించి చక్రవర్తితోఁ బోరుచు స్వరాజ్య ప్రతిష్ఠలను జేయుటకుఁ గంకణములను గట్టియుండిరి. అట్టివీరభూములలో నొక్కటి యగు మధ్యహిందూదేశమునందు భారతమాతకుఁ గాంచి వలె వేణుగంగానదియును దక్కాంచీమధ్యమహామణివలె నొక్కపట్టణంబును జీవనోపార్జిత సకల సస్యఫలసమృద్ధిచేతను సమస్తసంపన్నివహముచేతను రెండవ స్వర్గమువలె శోభిల్లుచుండును. దాని పేరు విలాసపుర మని యందురు. దానిని రాజధానిగఁ జేసికొని ఛత్రపాలుఁ డను రాజకుమారకంఠీరవుండు విపక్షులకు దుర్నిరీక్ష్యుఁడై స్వరాజ్యమును సంస్థాపించెను.

ఇట్లుండఁ దత్పూర్వోత్తర భాగ నర్మదాతరంగిణీ తుంగ తరంగసంఘట్టనల సహస్రధా భిన్నములై యణురూపములైన

పయఃకణంబుల సేకరించుకొని కొండగాడ్పులు మెండుగ మాటిమాటికి వీచుచుండెను. కష్టసుఖము లన్యోన్యానుగమ్యమానము లని తెలుపుచు చేయుచున్నవో యనునటులు కొంతసేపు వర్షపుజల్లులును, గొంతసేపెండయు దివాభాగమునందుఁ జెదుగుడి యాడుచుండెను. కించిజ్జలంబుల ధరించిన మేఘములు కొన్ని యాకసంబునఁ గేవలశుద్ధములు కాక కించిన్నైల్యంబున నొప్పుచుండెను. వర్షపుఁజినుకులు పడినప్పు డెంత చల్లగనుండినను వెంటనే కాఁచిన యెండలు భరింప శక్యములు కానివై మిగులఁ దీవ్రములై జనులకుఁ జుఱ్ఱు మనిపించుచుండును. అయ్యది శరత్కాలప్రాదుర్భావము; భగవానుఁ డంబరమణి యుదయించి ప్రాతఃకాలము నతిక్రమించి నభోమధ్యమునకు నడచుచుండెను. వీథులలోని పార్శ్వభాగములఁ జిల్లరవర్తకులు ఫలపత్రబహువిధశాకముల నంగడుల వైచికొని మేడలనీడలె యాధారమ్ముగ నమ్ముకొనుచున్నవారు. ఇట్టు లుండఁ గాషాయాంబరమును ధరించి శిరోజములె యట్టులల్లుకొనెనని తోఁచునట్లు కావిరంగుల జడలను శిరోగ్రభాగమున కెక్కఁగట్టి ముడివైచి, భుజమున (వేలాడుజలకుండికయుఁ గరమున లాతమును బట్టుకొని జేగురురంగుబట్టల ధరించి యొకసాధుజనుఁ డామార్గమునఁ జనుదెంచుచుండెను. ఆసాధువు సహజమైన బవిరిగడ్డముగలవాఁడై యుండెను నల్లని మీసములును, గనుబొమలును, అతని పడుచుఁదనమును వెల్లడిచేయుచుండెను. అతని మోమున గాంభీర్యరసము తాండవ

మాడుచుండెను. జలసంకుల మగునాపురవీథి నతఁడెవ్వఁడో యను నాలోచన వృథమినదికాని యొక్కరును బలుకరించిన వారు కాకపోయిరి క్రమక్రమముగ నాసాధువు వీథుల వైభవము నుపలక్షించుచు, మనమున నేదియో యాలోచించుకొనుచు శిరఃకంపముఁ జేయుచుఁ దుదకు నొక చిల్లర దుకాణమునకుఁ బోయి యావర్తకుని గంజాయిపత్రి యిమ్మని బేరము చేయుచు నీపురమున సాధుమందిర మెచ్చట నున్నదని పృచ్ఛ సేయుచుండెను. అంతలో జనుల కోలాహలము విన వచ్చెను. అదేమని యబ్బురపడుచుండఁగనే వీథుల ప్రక్క నున్న చిల్లరదుకాణపు పండ్లయంగడివాండ్రు కొనుటకు వచ్చిన వారి నుండుఁడని చెప్పి తమదుకాణములను బ్రక్కలకు సర్దుకొనుచుండిరి. పథికులు మార్గమును విడిచి కెలంకులకుఁ దప్పుకొనినంతనే గిటకిటమని తురంగ ఖురములచప్పుడు వినవచ్చెనంతనే గుఱ్ఱపుదళము బైలుదేరి బారులు తీర్చుకొని పోవుచుండెను. ఆయశ్వము లాజానేయములు. పవడపుఁజాయ దులకించుమెరుపులు గలిగి చూడ్కులకు నానందముఁ గొల్పుచుండెను వాని నారోహించిన యాశ్వికులు తెల్లనియుపుల ధరించిన బలిష్ఠకాయములు గలవారు ఆదళమును జూచినవెంటనే యాసాధువు ముఖమండలము వైవర్ణ్యముచే నొప్పెను; పిమ్మటఁ గ్రమక్రమముగా నెఱ్ఱవడఁ జొచ్చెను. కన్ను లని మిషము లయ్యెను. హృదయమున నొకవిధమైన నసూయయు, నాశ్చర్యమును రోషమును జనించెను. కనుబొమ లంతకంతకు

ఫాలమున కెక్కి రెండును గలసి ముడివడుటయు నగుచుం డెను. గుఱ్ఱముల నదలించు హయ కారావంబులు నశ్వాలంకారములయిన కింకిణీ క్రేంకారములతో విద్యుమాది పరివ్రాజకునకు మఱింత యావేశమును గలిగించి మొగము నెఱ్ఱవడఁ జేయుచుండెను చూడఁ జూడఁగ నాయూశ్వికదళము పోకడయావిరాగికి నెఱ్ఱకాలువ ననుసరించి పోవు గంగానదివలెఁ గన్పట్టెను. ఇట్లు తదేకదృష్టితోఁ జూచుచు నిన్వెఱపడియుండఁగా నాయూశ్వికవాహిని యంతరించెను. అప్పుడు యతిశిరంబు కంపించెను అప్పు డాతని మొగముఁ గాంచినవారి కాతని ముఖసీమపై రౌద్రరసము తాండవమాడుచున్నట్లు తోఁచెను అప్పు డీవర్తకుఁడు సాధువుముఖమును జూచి యీతఁ డెవ్వఁడో పరదేశీయుఁ డని తలంచెనుగాని, ముఖమున ననూయాభావమును రౌద్రరేఖయుఁ జూచి యితని కీయూశ్వికదళావలోకమున నిట్టివిలక్షణము లుదయించుటకు హేతువేమియగునో యని యోచించుచునంతలో నాపరివ్రాజకుని దీర్ఘమొననిట్టూరు పెదురెక్కుడు ద్రొక్కఁబాముబుసవలెఁ గర్ణరంధ్రములలోఁ జొరఁబడెను. అందువలన నావర్తకునకు నాతనియెడ మఱింత యనుమానము కలిగి యీతఁడెవ్వఁడై యుండును వీనికీసైనికావలోకమున నింత యావేశ మేల కలుగవలయు నని తనలోఁ దాను మనసులో వితర్కించుచుండ గనే భిక్షుకునకు మరల గంజాయిపత్రి లోకము తెలివికి వచ్చినది అంతట నాజోగికిని గిరాతునకు నీ క్రిందివిధమున సంభాషణము జరిగెను.

సాధు — వర్తకుఁడా! ఈగుఱ్ఱపుబండి యెవ్వరిది. ఈ దినమున నెచ్చటనుండి యిక్కడకు వచ్చినది.

వర్త — అయ్యా! ఇంతకుఁ బూర్వము రూపాయకు నాలుగుతులములు నిచ్చుచుండువాఁడను. ఇప్పుడు రెండుతులములే యిచ్చెదము.

సాధు — ఓయీ! అదేమి నేనొక్కటడిగిన నీవొక్కటి చెప్పెదవేమి? నీవు బధిరుఁడవా? నేను గుఱ్ఱపుబండి యెవరిదని యడుగుచున్నాను.

వర్త — ఆలాగునా. సర్వసంగపరిత్యాగులైయే మోహపాశమును లేక గంజాయిదమ్ము గొట్టు పకీరుల కీ యూశ్వికసైనికుల గొడవ యేల యని నేనట్లు చెప్పితిని.

సాధు — ఓయీ! సాధువును గాంచి పకీరనుచున్నావు యుక్తాయుక్తము లెఱుఁగక మాటలాడుచున్నావు సుమీ.

వర్త — తురకమున సాధువుపేరు పకీరు కాదా? అం దుచే నట్లంటిని గాని నీవు కేవలము తురక వని నే నన లేదు కదా నీ కింతకోపమేల? నిజమైన యతులకుఁ గోప ముండదు కదా? నీవు మిథ్యాయోగివా యేమి?

సాధు — (తనలో) ఈ దేశమున వర్తకులుకూడఁ దమ యంతరంగముల బైలుపఱచి విమర్శించి సత్యాసత్యములను దెలిసికొను శక్తికలవారలు. వీనిని గదిపిన నాగుట్టు బైటఁబ డును. (పైకి) అయ్యా వర్తకుఁడా! జోగులకుఁ గోప ముండఁగూ

డదు పోనిమ్మా ప్రశంస యేలని నాకు గంజాయిపత్రి యిమ్ము నేను పోయెదను.

వర్త—సరే, అటులనే యిచ్చెదను. దాని ధరసంగతి నెఱుంగుదురుకదా. పోనిండు మీ రిదివఱ కేధరకుఁ గొనుచున్నారో చెప్పుఁడు ?

సాధు—నాకు దానిధర తెలియదు నీకుఁ దోఁచినట్లిమ్ము.

వర్త—(తనలో) వీనిమాటలఁబట్టియు లక్షణములఁబట్టియు నాకనుమానముగ నున్నది. కావున వీనిరాజభటుల కప్పగింపవలెను (పైకి) అయ్యా! సాధువా ! నీవు మిక్కిలి యోగ్యుఁడవు. అటులనే యిచ్చెదను. దాని నిక్కడ నమ్మరాదు కావున మాయింటియొద్దనుండి యిపుడే తెప్పించి యిచ్చెదను. ఒక్కక్షణ మాగుఁడు. అని చెప్పి యొకసేవకుని బిలిచి యొకచీటి పరపర వ్రాసి, "ఓరీ, నీ వీచీటిఁ గొంపోయి మనయింటియొద్ద నున్న దేవదాసున కిచ్చిన నాతఁ డొకపొట్లమిచ్చును దానిని దీసికొనిరమ్మని పంపి "అయ్యా! యీసేవకుం డిప్పుడే రాఁగలఁడు. కాని మీరు గుఱ్ఱపుదళము సంగతి కదా కోరితిరి. అయ్యది మాఛత్రసాలమహారాజుగారి దే.

సాధు—ఓయీ! పోనిమ్ము. నీవు చెప్పినట్టు లాగొడవ నా కేల ?

వర్త—అయ్యా! అడిగినఁదప్పా ? మీ రెందులకయిన నడిగియుందురు. నేను చిన్ననాఁటనుండియు వితర్కపు

మనిషిని. ఒక్కొకయంశమును వితర్కింపకుండ విడువ నని పేరుపడియున్నాను. కావున నట్టిరాటిని కోపపడకుండు చెప్పె దను వినుండు.

సాధు — అటులయినఁ జెప్పుము.

వర్తి — అయ్యా ! మాయూరిమహారాజు ఛత్రసా లుఁ డని వినియేయున్నారుకదా ? అతనిసైన్యమునకు నిత్య మును సంగ్రామవిధానమును వారు నేర్పుచుందురు. అతఁడటుల నేర్పి యింటికిఁ బోవుచుండును. ఏమనిచెప్పుదును ? ఇచ్చట నెవ్వరును లేరుకదా? మీరు విదేశీయు లగుటచే మీతో వెఱ పులేక చెప్పుచున్నాను. మామహారాజుతండ్రి యయిన చం పతిరాయుఁడు మిగుల ధర్మాత్ముఁడు. మావర్తకులను బిడ్డల వలెఁ జూచువాఁడు. ఈఛత్రసాలుఁడు బహుదుర్మార్గుఁడు. మాబీదవర్తకుల కండలకుఁ బన్నుకట్టి నెత్తిమొత్తి పుచ్చు కొనుచున్నవాఁడు.

సాధు — ఆద్రవ్యమంతయును బెట్టి సేనలఁ బోగుచే యుచున్నాఁడా యేమి? యెందుల కీతృష్ణ.

వర్త — తనలో రంగులోనికి దిగుచున్నవాఁడని యెంచి పైకి, "ఏమిసేన, ఏమిలోకము? ఇతని యమాత్యులలోఁ గొందఱితో నిష్టమును మఱికొందఱితో ననిష్టమును జూపును. అటులున్నచో రాజ్యము నిర్వహించుట యెంత కష్టము ?

సాధు — మంత్రులెవరు ? అందెవరితో విరోధము.

వర్త—గుణసింధుఁడు, మణిమంతుఁడు అను నిరుపుర తోడను వైరమే. తక్కిన కాళీనాథ గంగాపుత్రులతో స్నేహమే.

సాధు—ఓవర్తకుఁడా ! నీవు మంచివాఁడవు సుమీ. నిన్నుఁజూచిన నాకు దయ కలిగినది. నీకుఁ గొంచెము ద్రవ్యమిచ్చెదను తీసికొనుము. నాకు బంగారముఁ జేయు శక్తి కలదు కావున నీకిచ్చెదను గైకొనుము.

వర్త—మహాప్రభూ, ఇంతకన్నఁగలదా ? కనకాభిషేకము చేయుదునన్న వలదను వెఱ్ఱివాఁడుండునా? మీకింకఁ గావలసిన యంశములను జెప్పెదను.

సాధు—అటులే చెప్పవచ్చును. కాని యాగుణసింధు మణిమంతులు ద్రవ్యాపేక్షగలవారలేనా ? వారల గృహము లెక్కడ నున్నవి ?

వర్త—అయ్యా! మీకీవెఱ్ఱి యేల? „కాంచనం సుమనస్తేయు" మని కదా చెప్పుదురు. దానికి వశీకృతులు కానివారెవ్వరు.

సాధు—ఓవర్తకుఁడా ! నీ వీబంగారు నాణెములఁ దీసికొనుము. అని శిరమునఁ బెట్టిన జటాకలాప శిరోవేష్టనము నుండి యొక కాసుల పొట్లమును దీసి యా వర్తకుని చేతి కిచ్చెను. ఆవర్తకుఁ డద్దాని బహువినయముతో మిథ్యాభయము నభినయించుచు స్వీకరించి దాని భద్రపఱచికొని „అయ్యా ! మీ కింకేమి కావలయు" నని ప్రశ్నించెను.

సాధు — నా కిం కేమియు నక్కఱ లేదు కాని యీ గుణసింధుమణిమంతుల యొద్దు చూపెదవేని వారిని సందర్శించి వారికి మేలు కలుగునటుల నొక వనమూలిక నొసంగి పోయెదను వారి మనంబులు మంచివని చెప్పుటచేత వారిఁ జూడఁదలచితిని కాని వేఱు కాదు సుమీ.

వర్త — అటులే చూపెదను. అదె గంజాయిపత్రికిఁ బోయినవాఁడు వచ్చుచున్నాఁడు.

అని చెప్పునంతలో నలుగురు రాజభటులును సేవకుఁడును సమీపించిరి. వారలఁ జూచినతోడనే యీ సాధువు కీళ్ళన్నియు సడలినవి. మొగమున వైవర్ణ్యముదయించెను ఏమి చేయుటకును దోచక లాతమును కారును చేతఁ బట్టుకొనుచు వర్తకుఁడా ! నన్ను వేగఁబంపుమనెను. తక్షణమే యీ భటులు వచ్చి ఓయీ ! నీ వెవ్వండవు నిజము చెప్పుమని ధట్టించిరి

సాధు — నే నొక భిక్షుకుఁడను.

భటు — నీ వేకులజుఁడవు ? నీ యునికి యెచ్చట?

సాధు — భిక్షుకులకుఁ గులమేమి ? పూర్వాశ్రమసంబంధము దలఁపరాదు. సమస్త తీర్థంబులయందును నేనయుందును.

భటు — ఓయీ ! నీ వేసము మా కనుమానముగఁ దోచుచున్నది. నీ మాటలు చూడ హిందువువలెఁ గన్పట్టవు

అని చెప్పునంతలో నొక భటుఁడు కృత్రిమజటామకుటమును బాణఘాతమున నెగురఁ గొట్టెను. సాధువు సంపూర్ణముండన శిరంబు ప్రత్యక్ష మయ్యెను. అంతట వారు వాని చేతులను గట్టఁ బ్రయత్నించు సమయమునఁ గన్ను లెఱ్ఱ చేసి యొక చేత లాతమును మఱియొక చేత నగ్గికారును ద్రిప్పుచు నా నలువురిని జెంతకు రానీక సాము చేసెను కన్నుల నింగలంపుంగణమ్ముల రాల్చుచుఁ బోటుదినిన త్రాఁచుఁబాము రోఁజినట్లు నిట్టూరుపు ధ్వనిఁ జేయుచుండెను. అప్పుడు వాని మొగము గీసినకందగడ్డవలె నయ్యెను. ఇట్లు విజృంభించుచు వర్తకుఁడు చేసిన మోసమునకు నగ్గికురిపించుచు బలుసారులు భటులతో యుద్ధము సేయుచున్నను వాని మొగమునే చూచుచుఁ దలపంకించుచు నా నలువురు భటులను దప్పించుకొనుచు తన కిఁకఁ బురము నిర్గమించునాస లేదని నిశ్చయపఱచుకొని యాసందడిలోఁ గ్రిందఁ బడిపోయియున్న తన బొంతను కాలితో బిరాన నందుకొని యాకసముపైకి నెగురవైచెను. అది కాంచి కొంచెము దూరమున నున్న మఱియొకఁడు క్రమ క్రమముగా వెనుకకు మరలెను. నడచిన కొలఁది వానిగమన మతిశీఘ్రతను వహించెను. కాని యొక్కఁడే కదా యని యెంచి శృంఖలముల మాత్రమే గొనివచ్చి లాతముతో సాము సేయుచు దరికి రాకుండఁ దఱముచున్న నీ రాజభటుల కాబొంత పై కెగరువేయుట కర్థమేమో తెలియకపోయెను గాని యీ మిథ్యాయోగిఁ గలియఁబడి

పట్టుకొనినప్పుడు భిక్షుకుని చేయి మాత్రము పట్టువడక వెలు పలఁ బడుటచేత లాతముతో నిరువురిభటుల శిరములకు గాయము లగునట్లు కొట్టెను మిగిలిన యిద్దఱును జేతులకును కాళ్ళకును శృంఖలములఁ దగిలించి తీసుకొనిపోయిరి. ఈలా తపు యుద్ధమును జూచుట,కనేకులు జనులు మూఁగిరి కాని యాభిక్షుకు నెందులకుఁ గొట్టుచున్నారని యొక్కఁడును ప్రశ్న వేయఁడయ్యె. ఇందువలన మనము తెలిసికొనవలసిన యంశ మేమనఁగా నాఘతప్రాలుని రాజ్యంబున వర్తకులే కాక యొక్కొక్కఁడును రాజకీయవ్యాపార రహస్యవేదు లని యును, రాజ్యరక్షణమునం దేమఱక యుండవలయు ననియుఁ దద్వ్యాపారము లాత్మకుటుంబములోనివిగఁ దలంపవలయు ననియుఁ బ్రజ లందఱుఁ దోచునట్లు ప్రభువు ప్రవర్తించు చున్నటుల మనము యోచింపవలెను. అదియె రాజ్యాంగ వృద్ధికి హేతుభూతము. తదన్యము వినాశకారణము గుణము పట్టువడుట కష్టము గుణము- అనఁగా నిర్మలాంతఃకరణ ప్రవృత్తి. అట్టివానికి దైవబలము కలదు. సహజక్రూరచిత్తుం డైన యామిథ్యాయోగికి దైవమె ట్లుపకరించును ? సత్ప్ర వర్తన గలవారు కారణాంతరమున గపటవేషములు వేసినను బట్టువడరు. అందుచేతనే పెద్దలు ,,యతో ధర్మ స్తతో జయః'' అని నొక్కి చెప్పుచుందురు.

## రెండవ ప్రకరణము.

విద్వాంసులవలన జ్ఞానపరిబోధమునం జేసి ధూర్తులు తమముఖమండలముల రౌద్రరసము గ్రమముగాఁ దగ్గించినట్లనే కన్యాలగ్నగతుండైన భాస్కరుండు తనవేఁడిమిని జల్లార్చికొని ప్రశాంతవదనుండు గా జొచ్చెను అంతకంతకుఁ బురవీథులు జనుల సందడిచే నొప్పుచుండెను. అప్పటి కైదు గడియల ప్రొద్దు మాత్రము కలదు అట్టివేళ నొకభవనమునకు దక్షిణభాగమున క్షీరసముద్రమునందు శయనించిన మహాలక్ష్మియో యనునట్లు తెల్లఁగ నున్నపుగచ్చు చేసిన వసారామీఁదఁ జిత్రితమగు చాఁపపై నొక లతాంగి తన మేని లావణ్యమున నిరుగెలంకులకు నపూర్వశోభ గల్పించుచు శయనించి దీర్ఘాలోచన మొనరించుచు నింటివాసముల లెక్క వెట్టుచుండెను. ఆమె దీర్ఘాలోచనాన్విత యయ్యు నామె నెమ్మొగంబు సంపూర్ణముగ వికసించిన సహస్రదళకమలము వలె మిక్కిలి రమణీయమై యొప్పారుచుఁ గలకల లాడుచుండెను. ఆమెపేరు ప్రసన్నముఖి ఆమె రామసింగను వీరాగ్రేసరుని యేకపుత్రిక శత్రువులలోఁ జేరి తనపై కుట్రలు చేయుచుండె నని యౌరంగజేబు చక్రవర్తి యాతనిని నిర్బంధావాసమున నుంచెను. ఇట్టు లాలోచనాన్వితమగు నామె ముఖ మంతకంతకుఁ గోపఘూర్ణితమై బాలభాస్కర మండలమువలె నెఱ్ఱనై కవోష్ణ మయ్యెను. మంచునఁ దడిసిన

తామర రేకులట్లు కన్నులు శోకబాష్పపరిప్లుతము లయ్యెను. అప్పుడు చేలాంచలముతోఁ గన్నులఁదుడిచికొనుచు నాయమ తనలోఁ దానిట్లు దలపోయఁ దొడంగెను "ఆహా! నావ్యర్థమైన జన్మమెందులకు ? నా దేహ మేల? నా యీసౌందర్యమేల? ఎన్నటికైన నామనోరథము పూర్ణమగునా ? ఈ యాపత్సముద్రమును దాఁటుదునా ? ఆశావధిని గనుగొందునా ? అక్కటా హృదయమా! ఆకసమునకు నిచ్చెన వేయుచుంటివి. నీ కాఫల మందను సుమా. యెందులకీ ప్రయత్నంబులు. ఎక్కడ విలాసపురము; ఎక్కడ నీయునికి ? ఆరాజమార్తాండుఁడేడ ? నీ వేడ ? ఇదంతయు నీ యాసకొలఁది నీవు వలచి పలవరించుచున్నావు. ఎవ్వఁడో యొకసిద్ధుఁడు చేయి చూచి 'అమ్మా! దేశోద్ధారకుండైన ఛత్రసాల రాజచంద్రుఁడు పతి కాఁగలఁ'డని చెప్పినంత నే మురియుచు నామహాభాగుఁ జెట్టినట్లు నువ్విళులూరుచున్నావు. ఆ రాజకంఠీరవుండిప్పుడు స్వరాజ్య స్థాపనమునకుఁ గంకణము కట్టుకొని యాత్మీయ మండలములోని వారల వశపఱచుకొని కొండల సంచరించు నాటవికుల లోఁగొని యుత్తర దిఙ్మండలజయాభిలాషియై వీరరసావతారుఁడై యున్నవాఁడఁట. అట్టి వీరమహోత్సవసమయమున వివాహ మనుమాటనైన దలఁచుట కవకాశము చిక్కదుకదా ? ఒకవేళఁ దలఁతుగాక. నీవే యను మాటయేమి? నీయంతటి సౌందర్య నిలయులు వారికి దొరకరా? నాపుణ్యవశమున లేకపోవుదురుగాక. ఆ క్షత్రియావతంసుని

నా కెఱింగించినటులే, నన్నాతని కెఱింగించు పుణ్యశాలి యుండునా? హుం. ఎట్లుండును? అదృష్టరేఖ దమయంతీ దేవిది, నాకెట్లు కలుగును. తనచేఁ బట్టుపడిన రాజహంసము తనకు నలు నెఱింగించినటులే, తన్ను నా నళచక్రవర్తి కెఱిం గించి యిరువురకు నుట్టూఁటు లూరఁజేసి తుదకుఁ బరిణయ కార్యమును నెఱవెను. అంతయే కాదు. రుక్మిణీదేవి తన్ను శిశుపాలున కీయఁ దలంచినారని విని యాతనియం దిష్టము లేక చిఱుతనాఁటినుండియు వలచి యొక బ్రాహ్మణుని చేత శ్రీకృష్ణునకు వర్తమాన మంపుటచే నాభగవంతుండు వేవేగ సుముహూర్త సమయమునకు వచ్చి, రుక్మిణీదేవిని గొంపోయి వివాహమాడినాఁడు. అట్టిభాగ్య మీదురదృష్టు రాలికిఁగలుగునా యని తలపోయుచు నశ్రుధారలచే నురోంశుకంబును దడుపుచు, వేఁడినిట్టూర్పుచేత నధరబింబ మును గమలింపుచు నేమియుఁ దోఁచక చాఁపపైఁ బొరలు చున్న సమయంబున నొక్క తరుణివచ్చి వెనుకవైపున నిలిచి యాజలజాక్షి పడుచున్న పరివేదన నెఱింగి యెదుట నిలఁ బడియె. అంత నా ప్రసన్న యెఱుఁగనటుల పైఁటచెఱఁగుతో నున్న బాహువును మొగమున కడ్డువెట్టుకొని యధోముఖి యై శయనించె. అదికాంచి యామె ప్రక్కలోఁ గూరు చుండి వీపునఁ జేయి వైచి, అమ్మా! ప్రసన్నా! యని పిలిచె. అంతనామె నిరుత్తరురాలయ్యెఁగాని చెలిని గాంచుట తోడనే ద్విగుణీకృతఖేదయై యేడ్చుచున్నదని నిశ్వాసముల

రవళిని బట్టి కనుగొనెను. ఆమెచరిత్రము సర్వము నెఱింగి యా చేటిక—అమ్మా! యూఱడిల్లుము. నీమనోగత విషాదమును నే నెఱుంగుదును. ఊరక దుఃఖిల్లుట యప్రాజ్ఞుల మార్గమని మనోబలంబుచేత సకలమును వశముగఁ జేసికొని సుఖించిన వారి సచ్చరిత్రముల నెన్నిటిని జదివియుండ లేదు? ప్రయత్నించిన చో దుర్ఘటమైన వస్తువునైనను సమకూర్చుకొనవచ్చును; నీపాణిపల్లవమును జూచి నీ కాతని నెఱిఁగించినటు లేపుణ్యాత్ముఁడైన నాతండు నిన్నారాజసింహుని కెఱింగింపకుండునా? అతనికి నీమీఁద సవ్యాజప్రేమ కలుగఁగూడదా? యేలయిట్లు వ్యాకులపడెదవు? కావున నూఱడిల్లుము'' అని యోదార్చెను.

అంతట నాపూర్ణేందువదన చెలికత్తె యోదార్పుటచే సగము పరితాపముఁ బాసి, కన్ను దుడిచికొని, యవతనవదన యై, ఓసీ మిత్రవిందా! నీప్రాణసఖికి సంతాపముగాక సంతోష మెన్నఁటికైనఁ గలుఁగునే? నన్నేల యిట్టి మృషావాక్యముల చే నూఱడిల్లఁబల్కెదవు? నే నిఁక జీవ—అని ధరణిపై సోలిన నాతరుణిం గాంచి మిత్రవింద యాబాలిక లేనెత్తి "అమ్మా! యిటు వినుము. నీధైర్యముచే దేనిని బొందలేవు. ధైర్యమున ను మనోబలముననను, వైకుంఠమందలి విష్ణువునైన సాధింప వచ్చును. ఇట్లు వాపోయెదవేల? ధైర్య మవలంభింపుము" అని వీపు చఱచి శాంతిపఱచు నాతలిరాకుబోఁడిఁ గాంచి, అమ్మా! తండ్రి నాని ర్బంధావాసమున నుంచి కోరలూడ్చిన త్రాఁచువలెఁ జేసి కూర్చుండఁబెట్టెరి. నాకు సోదరులా లేరు.

నామాట వినుటకైన నీ వొక్కతెవుకదా? అందు స్త్రీవి, నీవేమి చేసెదవు? ఇట్టియసహాయురాలను, దురదృష్టరాలను, నేనెట్టు లాశకు సంపూర్ణ ఫలమును బొందఁగలను జెప్పుమా. నాతండ్రివంశమునఁ బుత్రులు లేకున్నను, నేనే పుత్రుఁడ ననియు, నావలన దౌహిత్రలాభమును గాంచిన వంశమున కుదకక్రియలు జరుగునని యెంచి నన్నెంతో గారాబముగఁ బెంచుకొనుచుఁ దగిన క్షత్రియుని కిచ్చి వెండ్లిసేయ దలంపు నుండ, చక్రవర్తి బలంబునం జేసి రణదుల్లాఖానుఁడు తనకిమ్మని వర్తమాన మంపుటయు, అందునకు మాతండ్రి కోపోద్దీపితుఁడై "నాప్రాణమున్నంత వఱకు నట్టిమాటలు చెవిఁ బెట్టితివేని ఖడ్గమున కెర యగుదువని చెప్పిపుచ్చుటయు, నీ వెఱింగినదే కదా? ఎట్టులైన మాతండ్రిని మోసము చేసియో, చంపియో, నన్నుఁ బరిగ్రహింపఁ బ్రయత్నించుచున్నాఁడఁట. ఔరంగజేబు చక్రవర్తి యట్లు చేయుటకు నాపుణ్యవశంబున సమ్మతింపకున్నవాఁడు కాని, యంతఁ బ్రయత్నము నతఁడు చేసియే యుండును. ఒకవేళ చక్రవర్తిని సమ్మతింపఁ జేయుఁగాక. ఈప్రసన్న జీవితాశ వదలుకొని వానిని బరిమార్చి తాను జావకుండునా? నాపౌరుష మట్టిదనియే తలఁపోసి భీతిజెంది యారణదుల్లాఖానుఁడు చొరవఁ జేయ వెఱచుచు, యుక్తిచేత సాధింపవలయునని చూచుచున్నవాఁడు. ఆఖానుని భయము నాకు లేదుకాని' నామనోరథ మీడేరుమార్గ మెట్టిదని పరితపించుచున్నాను" అనుడు నామిత్రివింద ప్రసన్నను గాంచి, "అమ్మా! పౌరుషమున నీకు నేను చెల్లెనని తలంపు

ము. అదిమాత్రమె గాక నిత్యమును రణవ్యాపారరహస్యోపదేశము లను మాయింటి వెనుక నున్న నిర్మలప్రదేశంబుననే యీ చక్రవర్తి సైనికులకు నేర్పించువాఁడు నా కాయంశ మందిం చుక ప్రవేశముకలదు నే నావిలాసపురమునకుఁ బోయి యె ట్టులో నీమనోరథ మీడేరునట్లు చేసెదను" అని మిత్రవింద పలుకఁగనే యాప్రసన్న సార్థకనామధేయ యయ్యెను. ఏనుఁగునకు వచ్చినంత బలము వచ్చెను. చెలిని గట్టిగఁ గౌఁగి లించుకొని, "అమ్మా! నీవు చేసినను జేయకున్నను, నా కీట్టి చల్లనిమాట చెప్పి శ్రవణానంద మొనర్చు పుణ్యాత్మురా లొక్కతెయు నింతవఱకుఁ గనఁబడలేదు కాదా యని గడ్డమును పుణికి ముద్దుపెట్టుకొనెను పిమ్మట నిరువుర కిట్టిసంభాషణ జరిగెను.

మిత్ర—అమ్మా! ప్రసన్నా! చేయకున్నను—అని హంసపాదిడకోఁ బనిలేదు సుమీ. నీవంటి ప్రాణస్నేహితురాలి మనోరథమును దీర్చుటకన్న నాకు వేఱొండు కలదా? కావున నేను నేఁడే పయనమై యావిలాసపుర మార్గమును బట్టి పోయెదను.

ప్రస—చెలీ! మిత్రవిందా! మధ్యేమార్గమునఁ గొం డలు నదులు భయంకరారణ్యములు గడచి పోవుట బహుదు ర్ఘటమని, నాగుండెలు కొట్టుకొనుచున్నవి. ఈవిషయమున నా కార్యసాఫల్య మగునని యెడి సంతోషమును నిక్కముగ నీప్ర యాణ కష్టములవలని భయం బడఁచివేసినదిసుమా.

నవ్వి తిరిగి వానిని రైక జేబులో భద్రపఱచి "ప్రసన్నా, పోయి వచ్చెదను. నీవు స్వస్థముగ నుండుము." అని చెప్పిమిత్ర వింద యరిగెను ప్రసన్నముఖి యామిత్రవింద కనుచూపువఱకు వెళ్ళువఱకు తెప్పవాల్పక చూచుచుండఁగనె మిత్ర దృష్టిపథమును దాఁటెను. ప్రసన్న యు గృహములోనికిఁ బోయెను

---

## మూఁడవ ప్రకరణము.

### లేఖాపహారణము

కార్యములయందు గాఢతరమైన పట్టుదల కలవారికి కష్టములు సుఖములు నిద్రయు నాహారమును తోఁచదు. మహానదులు గోష్పదీకృతములగును. దుర్గమదుర్గములు సులభగమ్యము లగును అరణ్యములు సుగమములగును. క్రూర సత్త్వములు ప్రేమఁ జూపుచు సహాయకారులగును. ఒక్కనాఁడు పవలెల్ల భీకరారణ్యముల దాఁటి కొండలను నదుల నతిక్రమించి యొక్కపురుషుఁడు ఢిల్లీనుండి మధ్యహిందూస్థానమునకుఁ బోవుమార్గమునఁ బ్రయాణము సేయుచుండెను. సాయంకాలము కాకమునుపు పల్లె యొకయిసఁ గనఁబడిన నందు నా రాత్రి గడపనెంచి మార్గము కలుకురాళ్ళచేత నిబిడమైనను పారుష్యమును సహించి వెస వెస నడచుచుండెను సదాగతి చల్లఁగవీచుచు మన పథికునకు గమనశ్రమము నపనయించుచుండెను. ముందున్న గ్రామమును జేరుకొనుటకీ పాంథుని గ

మనము శీఘ్రత వహించినట్టులే యామినీకామినీ సంసర్గమున కై భాస్కరుండును దనగమనమునకు వేగముకలుగఁజేసి దక్షిణాభిముఖుఁడైనపాంథుని ముఖమండలమునఁ గుశివైపుఁ గపోలమునకు వింతకాంతిని గలుగఁజేసెను పశ్చిమదిగాకాశమున నక్కడక్కడ నిశ్చలములై యున్న చిన్నచిన్న వెలిమబ్బుపింజలు తరణిమరీచుల సోఁకుటచే గగనమండలమునఁ బుటము నుండి తీసి చల్లాఱ జేసినయపరంజి రేకులవలెనొప్పుచుండెను. క్రమముగ నాచరమదిగ్రమణిని సమీపించువఱకుఁ దనసవతియైన దినలక్ష్మితో నింతవఱకుఁ గాలక్షేపముఁ జేసిన భర్తపై నిశాకాంత కోపించినదో యనునట్టు లపరదిశ యరుణిమ వహించెను. అంతట విహంగము లాకసంబున బారులు దీర్చుకొని నివాసకోటరంబులకుఁ జనుచుండెను. భర్తృసమాగమ సంతోషంబు పట్టఁజాలక రజనీతరుణీమణి విశ్వమెల్లఁ దానయై వ్యాపింపఁదొడంగెను. పంచబాణుని యర్ధచంద్రబాణ మన నపరదిగంతరాళమున బాలచంద్రుఁడు ప్రకాశింపఁ జొచ్చెను. లేఁతవెన్నెల గాయుచున్నను నేపల్లెయైనఁ జేరలేకపోతి నని క్రమముగఁ బ్రపంచమున వెలుతురు జాఱినటులె మార్గస్థుని హృదయమున ధైర్యమును జాఱఁజొచ్చెను ఎప్పుడెప్పుడు ముందటనున్న యూరు చేరుదునా యని యాతురతచే మనవాఁడు మార్గమును దప్పి యరణ్యమునందలి చిట్టిచిట్టి పొదలఁ దప్పించుకొనుచుఁ దీగల నొదిఁగించుకొనుచు, దిశ దప్పి యెచ్చటికో పోవుచుండెను. త్రోవఁదప్పితి నని కళవళపడుచు నాగుచు యో

చించుచు, కానీ యన్నిటికిని పరమేశ్వరుఁడున్నవాఁడని ధైర్య సుు పూనుచు,నటులె నడవఁజొచ్చెను. క్రూరజంతువు లెడనెడ భీకరారావముఁ జేయుచు, దమలోఁదాము గోరాడుచు స్వేచ్ఛగ సంచరించుచుండెను. అంతట నంధకారాతి యనతంస్యమైన బాలశశాంకు డస్తమించుటయు పథికుని మనోధైర్య మస్తమించుటయు నొక్కసారి జరిగెను. ఆదిన మాశ్వీయుజ శుద్ధచతుర్థి. అపు డాతని హృదయమునకుఁ బెక్కుమార్గములు దొరకిన వికాని నడచిపోవుటకుఁ గన్నులకొక్కమార్గమయినఁ గానరాలేదు. అటులే మొండికెత్తి దైవముమీఁద భారమువైచి పొదలఁ దూఱుచుఁ గొండల నెక్కుచుఁ, బోవుచుండ దైవవశంబున నొకకాలిబాట చిక్కెను కాని దిశమాత్రము గుర్తింపలేక యాబాట ననుసరించి యెక్కడకో పోవుచుండెను. ఇట్లు పోవుచుండ వెనుకనుండి యెవ్వరో వచ్చుచున్నట్లు కాలిచప్పుడు వినవచ్చెను. ఇంతరాత్రి యీ యరణ్యమార్గమున నావలె వచ్చువాఁ డెవ్వఁడై యుండునో యని యోచించునంతలో నొకపురుషుఁడు వచ్చి కలసికొని. "ఎవ్వరాముందు నడచువారు" అని పలుకరించెను. పథికునకుఁ గొంచెము మనోధైర్యము కలిగి "అయ్యా ! నేనొకబాటసారిని" అనెను.

పురు—నీ వెందు పోవుచుంటివి ? నీ యూ రెయ్యది? పేరెయ్యది?

పథి—అయ్యా! నేను ఢిల్లీపట్టణవాసుఁడను. తమిలాగ్రహారంబున నాబంధుగులయింటికిఁ బోవుచున్నాను. నీ వెవ్వఁ

డవు? యెందుఁ బోయెదవు?

పురు—నామాట కేమి గాని నీ నివాసము ఢిల్లీ యని చెప్పుచుఁ దమిలాగ్రహారమునకుఁ బోయెద నని ఢిల్లీకిఁ బోవు మార్గమునఁ బోయెద వేమి?

పథి — ఏమి? ఈమార్గము తమిలాగ్రహారమునకుఁ బోవదా? ఢిల్లీకే పోవునా? అక్కటా! నేనొకనాల్గుగడియలుగా దారి తప్పి యరణ్యపుఁ బొదల దూఱుచు; నెట్టకేల కీపథమును గాంచి దిశ తప్పి తిరిగి ఢిల్లీకే పోవుచుంటినా? సరియేకాని జాలందరపుర మెచ్చట నున్నది.

పురు—ఇక్కడకుఁ గొంచెము దూరముననే కలదు, వెనుక విడిచి వచ్చితివి. నేనచ్చటికే పోవుచున్నాను.

పథి—సరియే అటులయిన నేను వెనుకకే వచ్చియీరాత్రి యచ్చట గడపి పోయెదను రమ్ము నీ వెక్కడనుంచి వచ్చెదవు? ఎటకుఁ బోయెదవు?

పురు—నేను చెందేరీనుండి వచ్చుచున్నాను ఢిల్లీకి పోయెదను.

పథి—నీనివాస మెక్కడ?

పురు—నా నివాసము ఢిల్లీపురమే కాని నీ వెవ్వఁడవు? ఇంత రాత్రమునఁ బ్రయాణముఁ జేయునవసర మేమి?

పథి—నేను శూద్రుఁడను. మార్గమును దప్పి గమ్యస్థానముఁ జేరలేక పోవుటచే రాత్రి యయ్యెను. కాని వేళకాదు. బంధువుల యిండ్లకుఁ బోవుట మిక్కిలి యవసర మేను.

పురు—సరే,నడువుము జాలంధపురము సమీపించితిమి

పథి—అయ్యా! చెందేరీ మన చక్రవర్తిగారి పాలన లోనిదేనా?

పురు—కాదు కాదు. ఛత్రసాలుఁ డనురాజొకఁడు స్వాధీనము చేసికొని యేలుచున్నాఁడు

పథి—యేమేమీ! అట శివాజీమహారాజే కాక ఛత్రసాలుఁ డనువాఁడొకఁడుకూడ బైలు దేరెఁగా? ఓహో! అతనికిఁ బుత్రబలమును సేనాబలమును మిక్కిలి కలదు కాఁబోలును.

పురు—అతనికిఁ బెండ్లియే లేదు పుత్రులుకూడనా!

పథి—ఓహో! అటులయిన ప్రథమయౌవనదశావేశము కాఁబోలును.

పురు—అదెన్నిదినము లుండును. మూఁడనాళ్ళ పట్టపగలు

పథి—అంతయె కానచ్చును గాని మన చక్రవర్తిగారికి నోళ్లఁజీరినఁ బోవునది గొడ్డండ్లఁజీరవలసి వచ్చునుగదా?

పురు—ఏదయినఁ దప్పదు. మనచక్రవర్తియొక్కసారి కన్నువిప్పిన ఛత్రసాలుఁడేకాక. వానివృద్ధప్రపితామహుఁడును స్వర్గమునుండిదిగి రావలసినదే.

పథి—ఔనౌను. ఈయిండ్లు జాలంధరపురములోని వేనా?

పురు—ఆ. అగును ఇందొక వైశ్యులగృహమున్నది. వారియరుగుమీఁద శయనింతము రమ్ము.

అని యుద్ధమును నడచుచుండ నొకగృహము కానవచ్చినది. ఆయింటికి వీథివైపు వసారాయును దగుమాత్రములయిన యరుగులును గలవు. గోడ నున్నయొకగూటిలో మిణుకుమిణుకుమని యిప్పనూనె దీపము వెలుఁగుచున్నది ఈయిరువురు పాంథులును బోయి యాయరుగుమీఁద దమపైవస్త్రము చేదులుపుకొని, చెరియొక వేదికమీఁదను గూర్చుండి, తమమూటలలోనిరొట్టెను విప్పుచుకొని భక్షించి,యూరంతయు మాటుమణఁగుటచే జలము దొరకమింజేసి యూరివెలుపట నున్న నీటిగుంటకడకుంబోయి, యందలి జలము మితముగఁ బానముచేసి, తిరిగివచ్చి యథాప్రకారముగా నైశ్యులవీథియరుగులమీఁద శయనించిరి. పండుకొనుటతోడనే యాపథికుఁడు గుఱ్ఱుపెట్టి నిద్రించెను. పురుషుఁడు పండుకొనుటతోడనే యీపథికుఁడెవ్వఁడు చెప్పుమాయని యాలోచనలోఁబడెను. నిర్మలమయిన యంతఃకరణ కలవారికి సుఖముగ నిద్రపట్టునుగాని పాపవ్యవసాయపరాయణులకు నిద్దుర యెట్లుపట్టును? “వీఁడెవ్వఁడు చెప్పుమా, వీని చెంత నేమైన ద్రవ్యముండకుండునా; వీని మాటలపొందికఁ జూడ మిక్కిలి నాగరికజనునివలెఁ గనబ్బుచున్నాఁడు. నేను ఢిల్లీచక్రవర్తియొక్క ప్రభావము గ్గడించుట తోడనే యందులకు సహాయుఁడై చక్రవర్తిని ద్విగుణీకృతముగఁ బొగడవలెనుగాని నేను పొగడినవెంటనే “యూరిదియేనా” అని మాఱుపుంత ద్రొక్కినాఁడు అందువలన వీఁడు చక్రవర్తి శ్రేయస్సును గోరినవాఁడుగఁ గనఁబ

డఁడు. సరే యెవ్వరైన నేమి? నన్ను ఛత్రిసాలుని భటులు వెను వెంటనే పరువులిడి వచ్చిపట్టుకొనకుండ నేను వీనికంటె ముందు రాత్రియుండఁగనే లేచి ఢిల్లీకిఁ బ్రయాణమై పోవలయును గదా? కావున వీని చెంత నేమయిన ద్రవ్యమున్న గ్రహించెదను గాక. వీఁడు నన్నెఱింగియుండువాఁడు కాని హేతువుచేత నాకు భయము లేదని మెల్లఁగ లేచి పథికుని దీర్ఘనిశ్వాసములవలన గాఢముగ నిద్రించినాఁడని తెలిసికొని వానిని సమీపించువఱకుఁ గాళ్ళు తడఁబడఁజొచ్చెను. పాంథునకు మెలఁకువ వచ్చు నేమో యని భీతిచేతఁ దన నిశ్వాసములు బిగఁబట్టి విడచుటచేత మఱింత ధ్వని గలిగెను అంతరాత్మ "ఓరీ; యిది చెడుఁగుపని సుమా వలదు వలదు" అని మొందలింపఁ జొచ్చెను. అయినను వాని నాశాపిశాచము పట్టి బలాత్కారముగా నాపథికుని సన్నిధిఁ జేర్చెను. ఆసమయంబున దైవికముగ బథికుఁ డరణ్యమార్గమున నడ్డువచ్చిన దుష్టులను "ఛీ. ఛీ" యని యదలించినవాఁ డగుటచేఁ దిరిగి యవియే స్వప్నగతము లౌటచే కలయందు నైతము "ఛీ ఛీ" యని పలవరించెను. అంతట పురుషుఁ డదరిపడి, తిరిగి పోవుచో నాతురమునఁ గ్రిందఁబడి లేచి యథాప్రకారముగఁ దనపక్క దరికిఁ జేరి కూర్చుండెను. కాని యాదుర్వ్యసనమేల నిద్దుర పట్టనిచ్చును? కొంత సేపటికి కూర్చుండి లేచి తిరిగి యాపథికుని సమీపించి, యాతని చొక్కాజేబులో చేయి పెట్టి తడవఁగా నొక లేఖమాత్రము కనఁబడినది. కాని ద్రవ్యము దొరక లేదు.

కాని మిస్నాలేఖ యేమో చూచెదనుగాక యని దానిని గొంపోయి యామినుకు మినుకుమను దీపికను బెద్దదిగఁ జేసి దానిపై విలాసమును జదువఁగనే ఛత్రసాలమహీపతి కని స్పష్టమయ్యెను. ఓహో యిది మనకు ముఖ్యమే కదా యని దానిని భద్రపఱచుకొని తానప్పుడె మఱియొక చిన్న యింటిపంచకుఁ బోయి పరుండి, మిక్కిలి రాత్రియుండఁగనె పురుషుఁడు ఢిల్లీకిఁ బోయెను. అంతట రాత్రిగడచి ప్రభాతము కాఁజొచ్చెను. కాకులు గూయుచుండెను. పథికుఁడు లేచి తనజేబులోని లేఖను జూచుకొనకయే తాఁ నరుగవలసిన త్రోవను దా ననుసరించెను.

## నాల్గవ ప్రకరణము.

### ఔరంగజేబు.

పావనసలిలమైన గంగానది దుర్గమపర్వతముల జనించి వక్రగతులచే సాధ్యముపాలఁబడినను, సేవ్యమై దర్శనీయమై మహాపాతకజాలంబులఁ బటాపంచలు చేయునట్లు పూర్వము యుధిష్ఠిరాది రాజసింహులు పరిపాలించుటచే నఘహారంబైన హాస్తినాపురప్రాంతభూమి వర్తమానకాలంబునఁ దురుష్క పరిపాలనంబునం జేసి యపవిత్రమయినను తొల్లింటి భక్తిచే మన మక్కడకుఁ బోవలసి యున్నది. అది యక్కాలంబున ఢిల్లీ యనుపేరఁ బ్రసిద్ధము. అయ్యది ఔరంగజేబను మొగ

లాయి ప్రభువుచేఁ బరిపాలింపఁబడుచుండెను. ఆచక్రవర్తి గుణగణంబు లిట్టివని లిఖించియు నిట్టివని వాక్రుచ్చియు హస్తమును నోటిని బాడుచేసికొనుటకంటె యవాచ్యుఁడని చెప్పుట మేలు అతనికి రాజ్యతృష్ణ యను దియె భూషణము ఒకనాఁటిదివాభాగంబున నపరాహ్ణకాలమునఁ జరమదశ జరుగుచుండెను. మొగలాయీచక్రవర్తి యొక్క ప్రతాప మీవిధమున దఱిగిపోవునని సూచనఁజేయుచున్నాఁడో యనునటులఁ బ్రభాకరుండు క్రమక్రమముగఁ దన తేజమును దొలఁగుచున్నవాఁడు. అట్టియెడ నొక సౌధస్థలంబున నవరత్నస్థగితమైన పర్యంకమున నొక్క పురుషుఁడు బాలీసునకుఁ జేరి కూర్చుండి సేవకుఁ డందిచ్చు నుపహారంబుల భుజించి తాంబూల చర్వణముఁ జేసి హుక్కాపీల్చుచు ధూమమును నలుకెలంకులకు వదలుచుఁ దత్సుగంధము మారుతున కందిచ్చుచున్నవాఁడు ఆతఁడె యౌరంగజేబు చక్రవర్తి. ఆతని మొగ మగ్నిస్పర్శమువలన నెఱ్ఱవడిన బంగారు పళ్ళెరమువలె నొప్పియుండెను. కన్నులాకర్ణాంతములు. కర్ణములు మిక్కిలి పొడవు బవిరిగడ్డము గాంభీర్యరసమున సాకరంబైన ముఖలక్షణము. అట్టిసమయంబున నడుగులచప్పుడు వినఁబడెను. చక్రవర్తి యావైపునకు మొగము ద్రిప్పి యాలకించెను. సేవకుం డెవఁడని పలుకరించెను. ఒకఁడు మహమ్మద్ ఖాసిమని బదులుచెప్పెను సార్వభౌముఁడు తలయూఁచి ప్రవేశపెట్టుమని సైగఁజేసెను. ఒక తురుష్కుఁడు ప్రవేశిం

చి సలాముచేసి చేతులు కట్టుకొని నిలఁబడెను. అంతట వారి కీక్రిందివిధమున సంభాషణము జరిగెను

చక్ర—ఏమివార్తలు! ఎప్పుడు వచ్చితివి ?

మహ—స్వామీ! నేను దేవచ్చుట. తమ యాజ్ఞాప్రకారము మధ్యహిందూస్థానమునకుఁ బోయి సర్వమును గనుగొనివచ్చితిని. ఆబుందేలుఖండములోని రాజులందఱును, చంపతిరాజపుత్రుఁడైన ఛత్రసాలునకు వశపర్తులై మెలంగుచున్నవారు. ఆఖండములో నొక్కఁడును దేవరవారికిఁ గప్పము గట్టఁదలచు కోలేనట్టు స్పష్టపడినది. వారందఱు స్వరాజ్యస్థాపనమును రక్షించుకొనుటయో లేక సంగ్రామమున జచ్చుటయో కాని పారతంత్ర్యమున నుండఁదలంచుకొనలేదని యేర్పాటులు చేసికొనినారఁట. అందుచేత ఛత్రసాలుఁడత్యుత్సాహముతో సమరప్రయత్నము లమితముగఁ జేయుచున్నవాఁడు. వేయేల; ఆఖండములో సాంగ్రామికశాస్త్రాభ్యాసము చేయనివాఁ డొక్కఁడును లేఁడు. నేను వారియాశ్వికసైన్యమును గన్నులారఁ జూచి కన్నులనుండి రక్తముఁగురిసి నిట్టూర్పుచ్చి కడుపుమంటతో దేవరవారి కీవార్త విని పించి తత్ప్రయత్నభంగము గావింపఁదలంచి వచ్చితిని. ఆసేనాసమాహారణము, ఆసమరోత్సాహము, ఆజనులయైకమత్యము నూడంజూడఁ క్రమముగా ఢిల్లీ నాక్రమించుటకు సందియము లేదని తోచెడిని.”

అని విన్నవింపఁగాఁ జక్రవర్తి మొగము పొంగరించుకొని గీఁచినకందగడ్డవలె నెఱ్ఱవడెను. కన్నులు నింగలంపుం గణములవలె దుర్నిరీక్ష్యము లయ్యెను. పగపట్టిన త్రాఁచువలె దీర్ఘమైన నిశ్వాస మొకటి బయలువెడలెను.

మహమ్మదుఖాసిం—స్వామీ! మఱొక్క యప్రియముఁ జెప్పవలసి వచ్చినది. నాకంటె ముందుగ దేశవార్తల నెఱుంగఁబోయి ఖాతర్ఖాన్ సాధువేషమున నాకు నర్మదానదీతీరంబునఁ గలసెను. నే నతని గుర్తించి యిరువుర మొక కార్యాన్వేషణమునకుఁగదా యని మాలో మేము ప్రస్తావనఁజేసికొని యిద్దఱమును గలసి విలాసపురమును బ్రవేశించుటలో ఖాతర్ఖాన్ ముందును నతనికే బది గజముల దూరములో నే నుండుటకు నేర్పాటు చేసికొని యట్లు ప్రవేశించితిమి. ముందతఁడు వర్తకుని దుకాణముపైకిఁ బోయి యున్నంతలో నపరిమితాశ్వికసేన యామార్గమునఁ బోయినది. తరువాత ఖాతరచ్చట నే కొంతసే పున్నవాఁడు. మఱికొంతసేపటికిఁ గొందఱు భటులు వచ్చి యాతని ముట్టడించిరి. వారికిని నితనికిని గొంతవఱకుఁ బోరు జరిగినది. అంతలో నన్నుఁ బామ్మని గుర్తుగ నొక కాషాయపుబొంతను మింటి కెగురవైచెను. నేనది యానవాలుగ గ్రహించి వారికిఁ జిక్కకుండఁ బురము నిర్గమించి యలజడిఁబడి వచ్చితిని,

చక్ర—ఔరా! ఛత్రసాలుని దుర్నయము. అరచేతికిఁ బండ్లువచ్చినవిగా, తనతండ్రియైన చంపతిరాయఁడు

సైతము మనకు లోఁబడి యుండఁగాఁ దానా స్వరాజ్యమును స్థాపించువాఁడు? ఉత్తరహిందూదేశమున రాజపుత్రులును మహారాష్ట్ర దేశమున శివాజియుఁ బ్రయత్నములఁ జేసినార ని పులినిజూచి నక్క వాత వేసికొన్నటులు తానును స్వరాజ్య మునకుఁ గంకణము గట్టెనా! ఈహిందువు లందఱకు నిదియొ క్క యేలము వెట్టినలెన్నదే. ఈయూరంగజేబు హైందవరా జన్యకాంతార దావానలుం డని వారెఱుంగరు కాఁబోలును? మధ్యమహిందూదేశమున ఛత్రసాలాది రాజు లేలుటకా దు కాని భూతప్రేతాది పిశాచములచే సేవింపించెదనుగాక. మంచిది. ఓరీ సేవకా! నీవు పోయి పిదాయీఖానును దీసికొని రమ్ము పొమ్ము ఓయీఖాసిం, మన పితన్ఖానుఁడు శత్రువు లకుఁ జిక్కుట నిశ్చయమేనా?

మహ.—మహాప్రభూ! కన్నులారఁ జూచి వచ్చితిని. వాని నెట్లు గుర్తించిరో యేమి ప్రస్తావన జరిగినదో మాత్ర ము నాకుఁ దెలియదు.

చక్ర—సరే నీవును నీనిలయమునకుఁబొమ్ము.

అని చెప్పి పంపి యనంతరమున దీర్ఘాలోచన మొనరించుచు గనుబొమలు ముడివైచుచు,దనలోఁ దానిట్లుపలుకఁజొచ్చెను. "ఔరా!రోగములమీఁద రోగములు పుట్టినట్లె శత్రువులమీఁద శత్రువులు విజృంభించుటచేత హృదయము కవ్వముతో మ థించి నట్టులు సంక్షుభితంబగునుగదా?"

అనునంతలోఁ దలుపుదెఱచుకొని పిదాయీఖానుఁడు ప్రవేశించి జోహారుచేసి నిలఁబడెను. చక్రవర్తి కూర్చుండు మని కనుబొమ్మ విసరెను ఫిదాయీఖా నొకచిత్రకంబళము మీఁదఁ గూరుచుండెను. చక్రవర్తి యిట్లు భాషింపఁదొ డంగెను.

చక్ర—ఓయీ ! ఉత్తరదేశమున రాజపుత్రులును, మహారాష్ట్రదేశంబున శివాజియుఁ బ్రబలి ప్రాణమును విసిగిం చుచుండిరి. ఇప్పుడు మధ్యహిందూస్థానమునఁ జంపతిరాయని కుమారుఁడైన ఛత్రసాలుఁ డొకఁడు బైలుదేరి క్రమక్రమ ముగా మనకు వశులయి యున్న రాజమండలినెల్లఁ దిరుగదీసి తాను వశపఱచుకొని స్వరాజ్యమును స్థాపించినాఁడట. సాధు వేషముతోఁ బోయిన ఖాతర్ఖానుచు బట్టికొని పోయినాఁడఁ ట. మనమిపు డుపేక్ష చేసినచోఁ గ్రమముగ ఢిల్లీసామ్రాజ్య ముపైఁ గూడ గత్తికట్టును; కావున నీకుఁ గావలసిన సైన్య మును దీసికొని మధ్యమహిందూదేశముమీఁద యుద్ధమునకు బైలుదేరుము. వానిని వానిసహకారులను బరిమార్చి మధ్య హిందూదేశమునం దెల్ల మొగలాయిరాజ్యకేతనమును స్థాపిం చి రమ్ము.

ఫిదా—మహాప్రభూ! అటులనే చేసెదను.

చక్ర—నీవట్లు చేయువఱకు నాకు నిద్దురపట్టదు. నీ వట్లుచేసి ఖాతర్ఖానుని విడిపించి యారాష్ట్రమునకు నాతనిఁ బ్రభువుగాఁ జేసిరమ్ము.

ఫితా మహాప్రసాదము.

అని వెడలి పోయెను. చక్రవర్తి యుద్యానవనవిహార మునకుఁ బోయెను.

## ఐదవ ప్రకరణము.

### పిచ్చివాఁడు.

ఢిల్లీ పురవీథులన్నియుఁ గలకలలాడుచు జనులచే నొప్పారుచుండెను. చల్లగాలి ననుభవించుటకై కొందఱు విహారమునకు బైలుదేరుచుండిరి. అట్టి సాయంకాల సమయమున నొక్క పిచ్చివాఁడు తాఁటియాకుల గొడుగును చేతఁబట్టుకొని తాటి జీబులకట్ట చంకనుబెట్టుకొని పురవీథుల బైలుదేరి వెఱ్ఱి వెఱ్ఱి కేకలు వేయుచు నిటు నటు పరుగు లెత్తుచు బూడిద మేనికిఁ బూసికొనుచు, నుమియుచు, నల్లరి చేయుచుఁ, దన చుట్టుఁ జేరిన బాలకులతో నిట్లు సంభాషించు చుండెను. "అదిగో అదిగో. రండి రండి, రండంటే రండి కాదు, పొండంటే పోండి కాదు. నిన్ను చూస్తే నే నేడుస్తాను. నన్ను చూస్తే మీ రేడుస్తారు. నీకు నీవే, నాకు నేనే, ఎవరికివారే యమునా తీరే ఇదిగో తమాసా. ఇది సోద్దెం. ఇది మంత్రం, ఇదిగో తంత్రం తంత్రాల తాళ్ళన్నీ కోటిపల్లి రేవులో పుట్టుకొన తెగుతాయి. మంత్రాల తాళ్ళన్నీ మంచా లెక్కుతాయి. యెంత

యేడిస్తేనేమి? యెంత మొత్తుకుంటేనేమి? రా యిరాయె. మట్టి మట్టె. ఎరిగితే దుమ్మొంతా గుట్టలు గుట్టలు మూస్తాయి. ఒక్కగాలేస్తే యెక్కడిది దక్కడె. అదిగో అదిగో పుల్లియాకు లెగురు చున్నాయి యెగురు చున్నాయి. యెగరనీ యెగరనీ, తలదాటాయి గోడలుదాటాయి. కొంపలు దాటాయి, యెంత సేపు అదిగో గాలి చల్లారింది అన్నీ తొంగున్నాయి. ఇదిగో చూడండి. యొక్క బెడ్డ పడేస్తాను చచ్చినట్టు పడి యుంటుంది. ఇదిగో చూడండి నేగోసాయీ నాతాను సిపాయి నొతాను, గోసాయి నవడానికి యిదిగో తాటిజీబు గడ్డం కింద కట్టుకుంటాను. ఇదిగో చూచారా నేనిప్పుడు అచ్చాంగా గోసాయి లాగున్నాను. గోసాయి నైతే సీసాయి కావలా, సీసాయి తగిలిస్తే దాసీలు కావాల, దాసీలుతగిలిస్తే మోసాలు కావాల, మోసాలుతలిస్తే వాసాలు కావాల, వాసాలుతగిస్తే, వల్లకాడే, వల్ల కాడంటె సామాన్యమా వైకుంఠ మే ఛీఛీ. ఆ వెధవ వైకుంఠము నాకెందుకు? మామతమా మాపేరా? యూరా? అయ్యో! అయ్యో! మా యూరు పేరు లేకుండా చేసినది యీతాటిజీబు ఛీ ఛీ. నాకెందుకీ తాటిజీబు. అయ్యో! అయ్యో. ఎంతపని చేసినావే నిన్ను వేళ వేళలు కింద లాగి యెక్కదాని కొకటి చేరకుండా పారవేస్తాను అయ్యో. అయ్యో. పారేస్తే యేలాగు? గాడుకూ జీబుకు పోట్లాట పెడతా. ఇదిగో యీజీబుకట్ట తీసుకుని యీగాడుగును ముక్కలుచేస్తాను. చాపుగాడుగా. చాపుగాడుగా. ఓసిగాడుగా ఆసిగాడు

గా, యెంత దానవే కొట్టినకొద్ది "ధంధం" మ్మని వాగుచున్నా
వు. ఔను నీవెట్లాగయినా జీబుపై దానవే నీవే గెలిచావులే.
అయ్యబాబో! మరచిపోయినాను, నిన్ను బెద్దలు కొడితే నాన
త్రిమీఁద కేడీ. నీవు కొట్టానని కోపంపడకు. నీకు దండంపెడ
తా. పాపము వాన కురనీయవు కదా! యెండకు తలకాయ
బద్దలవకుండా కాపాడుతావుకదా. నీవు మాబాగా రక్షిస్తా
వు. అయినా కుర్రవెధవ లూరుకోందురా. అదిగో అదిగో
అప్పుడే రాళ్ళు విసరుచున్నారు. విసరకండి విసరకండి వెధ
వల్లారా. మీచేతులు నొప్పులుపెట్టి మీరే యూరుకొంటారు.
నాతలమాత్రం పగలకొట్టారంటే చస్తాను. దయ్యమయిపట్టు
కుంటాను. పీక్కుతింటాను. యేమనుకున్నారో కొట్టండి కొట్టం
డి. యీతాటిజీబు కిందవేసుకొని కూర్చుంటాను. కొట్టారు
కొట్టారు. చేతులుపడ్డాయి. గొడుగు చివర చిరగలేదుకదా?
అదిగో యేమున్నది. మీయేడుపే కాని యిది చిరుగుతుందా.
మాపశస్తమయిన గొడుగు. ఇదిగో మీకాంతా వేదాంతం
నేరపుతా వినరూ. పోనింపు మీపాత్రబ్రమంతే. ఇదిగో జీబు
చూచితిరా మంత్రిం చేస్తాను. ఒక్కొక యేశా వూడదీస్తాను.
సంబంధం లేకుండా పారేస్తాను. యేమి యిపుడెక్కడ నయి
నా తాటిజీబు పేరు కనబడుచున్నదా? లేదు లేదు. యిదిగో
గొడుగు చూడండి దీని ముక్కలు ముక్కలు చేసి పారేస్తా
ను. యిదిగో చూచినారా గొడుగు రూప మెక్కడ నయిన
యున్నదా? లేదు గొడుగెక్కడ నాశనమయింది. అన్నీ

నాశనమయిపోయాయి. నేను ఆడిన విద్దేషపాత్రం జ్ఞాపకం వుంచుకోండి అదిగో అదిగో చూడండి. యీతాటిజీబు. యీతాటి గొడుగు నాకోపం యెదురు చూస్తున్నాయి. యెందుకు యేడవకండి మీకు బుద్ధిలేదు నన్ను జేరడానికిఁ మీ రెవరు. నేనెవరిని. మీరిట్టే చచ్చి పోయినారు. నేనాలాగున చావను, నాకోర కేడవకండి. యిదిగో నానోరు నొప్పెట్టినా మీ చెప్ప లాలాగే యుంటున్నాయి. నేనుండను అంతర్ధానమయిపోతున్నాను " అని వెఱ్ఱికేకలు వేయుచు నెక్కడికో పోయెను ఫీని యుపన్యాస మంతయు వినుటకు జను లనేకులు మూగినారు. కాని వానిమాటల కొక్కండును భావ మెఱుఁగరయిరి.



ఆఱవ ప్రకరణము.



ఫకీరు ప్రశ్న.

ఒక్కనాఁటి రాత్రి పట్టణమంతయు మాటు మణఁగినది. ఇంటి వెనుకటిభాగమున నొక గదిలో చిన్న దీపము నొద్ద నొక లేఖను విప్పి యొక పురుషుఁడు చదువుచుఁ దనలోఁ దా నిట్లు వితర్కించు చున్నాఁడు. "ఔరా! స్వాతంత్ర్యము మితిమించినదే; హుం. ఇందులకే దూరపుఁ గొండ నునుపని యనుకొందురు. నాకంటె ఛత్రసాలుఁడు

ఘనుఁడా ? చిరకాలమునుండి నిర్బంధావాసమున నలయుచు, నింకను బుద్ధివచ్చినది కాదు. కానిమ్ము." అనుకొనునంతలో నడుగుల చప్పుడు వినవచ్చెను. అతఁడాలకించుచుండఁగనే మఱియొక పురుషుఁడు ప్రవేశించెను. అంతట వారి కిరువురకు నీ క్రింది సంభాషణము జరిగెను.

రణదుల్లాఖానుఁడు— "ఓయీ నజరుద్దీన్ ! యీ లేఖ నొక్కసారి చూడుము " అని చేతికిచ్చెను. నజరుద్దీను దానిని జూచి; ఆహా! సాహసము. నేనుండఁగఁ దాను రణదుల్లాఖానునకుఁ జిక్కక, అన్య పురుషునిఁ జెట్టఁ బట్టునుగా. కానిమ్ము. ఓయీ మిత్రుఁడా: యీ లేఖ నీ కెట్లు చిక్కినది ?

రణ—మన మహమ్మదుఖాసిమున కొక పురుషుని చెంతఁ దమిలాగ్రహారమునఁ జిక్కినదఁట. దానిని దెచ్చి నా కిచ్చినాఁడు

నజ—సరె, చిక్కఁగాక. ఇంతవఱకు శాంతపద్ధతిని వశమగునేమో యని తలంచితిమి. ఇఁక ముందు మనము దండనోపాయము నుపయోగింపవలెను.

రణ—రామసింగసహాయశూరుఁడు. వాఁడు పురమున నున్నంతవఱకు మన మెన్నివిధములఁ బ్రయత్నించినను బ్రసన్న మనకుఁ జిక్కునని తోఁచదు. అయ్యది క్షత్రియకాంత, అసహాయశూరురాలు. ఈయంశ మిసుమంత మొఱింగిన వాయుసహాయుఁడైన వైశ్వానరుని విధంబున రామసింగు మనల మండఁబెట్టును. అందులకే మన చక్ర

వర్తియు, రామసింగును నిర్బంధావాసమున నుంచియు, నెప్పుడు శత్రుమండలితోఁ దంత్రములఁ బన్ని, యాంతరంగిక విషయములఁ దెలియఁబఱచి, సామ్రాజ్యమునకు ముప్పు దెచ్చునో యని జాగును, గౌరవముఁ గనఁబఱచుచు, నతని నొక కంట గాచియున్నవాఁడు.

నజ—ఓయీ! అందులకిప్పుడు మంచి సమయము దొరకినది. ఏమందు నేని, ఫిదాయీఖానుని ఛత్రసాలుని మీఁదికి చక్రవర్తి రణమునకుఁ బంపుచున్నవాఁడు. మన మిపుడు వానికి సహాయముగఁ జక్రవర్తితోఁ జెప్పి రామ సింగును గూడఁ బాపున ట్లేర్పాటుచేసెదము

రణ—మిత్రుఁడా! చక్కని యూహ చేసితివి ఈ తంత్రమును నీవే యేర్పాటు చేయవలసి యున్నది. ఈ యం శము నుంతయైనఁ దెలిసిన చక్రవర్తి సమ్మతింపఁడు.

నజ—ఆ రామసింగును ఫీదాయీఖానునితోఁ బంపుటకు నేను దగిన ప్రయత్నముచేసి తీరెదను అందులకు సందియము లేదు. అతఁడు వెడలిన మరునాటి రాత్రిఁ దప్పక రామసింగు గృహమునకుఁ గొందఱు బంటులగాండ్రను బంపి ప్రసన్నను దస్కరింపవలెను. కావునఁ దస్కరుల సిద్ధపఱపుము.

రణ—అటులే చేసెదను కాని యీ యంశమును బహురహస్యముగఁ గాపాడవలెను.

నజ—సరె. నేను పోయెదను,

అని చెప్పి వెడలి పోయెను. రణదుల్లాఖాను నీ జాబును గొంపోయినవాఁ డెవ్వఁడని యాలోచించుచున్నంతలో ఫకీరు లనమాజుచేయు నొక కేక విన వచ్చెను. వినినంత నే "ఆహా! ఫకీరులు భావికాలజ్ఞులుకదా? వారలఁ బ్రశ్న యడిగినచో మనకుఁ బ్రసన్న దక్కునో లేదో యని చెప్పుదు రనునాస హృదయమునకు స్ఫురించెను. అంతట నాకాంక్ష తీఱువరకు నీళ్లబిందెలోఁ బడిన యెలుకపిల్లకొట్టుకొనునట్లు వానిహృదయముకొట్టుకొనసాగెను. దుర్వ్యసనపరాయణుల చిత్తమునకు స్వస్థత కలుగునా? పండుకొనినను నిద్దురపట్టదుకదా? పోయి యడిగిచూతు నని తలంచి లోపలికిఁ బోయి యొక దానిమ్మపండును గొంత గంజాయిపత్రియుఁ దీసికొని బయలుదేరి తలుపుపైన గొళ్లెము పెట్టి తాళమువేసి, వీథినుండి పోవఁజొచ్చెను. అర్ధరాత్రమున వీథులలోని దీపికలన్నియు నాఱిపోయినవి. ప్రసన్న నీకు దొరకుమార్గము లేదుసుమీ యని సూచనఁ జేయుచున్నదో యనునటుల వీథులలో మార్గమే కనుపట్టుట లేదు. ఇట్లు పోయి పోయి ఫకీరులు వసించిన ముసాఫర్ ఖానాలోనికిఁ బోయెను. అందు ఫకీరులు నమాజులు చేయుచున్నారు. ఆఫకీరు లున్న ప్రదేశములు వేఱువేఱై యుండెను. వారినమాజు లగువఱకు వేచియుండి, పూర్తియయిన తోడనే వారల కందఱ కొక్క సలాము చేసి మిక్కిలి యాడంబరము గల ఫకీరును సమీపించి తెచ్చిన దానిమ్మపండును గంజాయి పత్రిని సన్నిధినుంచి జోహారుచేసి చేతులు కట్టుకొని నిలిచెను అంత నాఫకీరు వాని

ముఖలక్షణ ముపలక్షించి, యున్నతోద్యోగము గలవానిగ నెఱింగి కూర్చుండు మని సైఁగఁజేసి ధ్యానము నభినయించి, నీవు తలఁచిన కార్య మగునా కాదా యని మనంబులో శంకించి యడుగ వచ్చినావు. నీ పట్ల నల్లా ప్రసన్నుఁడై కను పట్టుచున్నాఁడు అను నంతలో ,,ఏఖిస్వామి! యిపుడు చెప్పి న మాట దయయుంచి తిరిగి చెప్పవలయును" అని వేగిరపాటు తోఁ బలుకవలెను, "ఫకీరు—ఓహో! యీతఁడు ప్రసన్న యనుటచేత నభిలాషతో నామాటఁ దిరిగి చెప్పు మనుచున్నాఁ డు'' అనియుఁ ,,బ్రసన్నముఖి విషయమై కాంక్షించి యుండు నేమో'' యనియు నూహచేసి, "అల్లా నీకుఁ బ్రసన్నుఁ డగును. నీకుఁ బ్రసన్నను బ్రసన్నను జేయును'' అని చెప్పె ను. ,,స్వామి! అది యెంత కాలములో నగు" నని రణదుల్లా ఖానుఁడు ప్రశ్నించెను. ఫకీరు—ఆలోచన నభినయించి,,కొలఁది దినములలో.—అనఁగా నేఁడో రేపో మిక్కిలి సమీపము'' అని చెప్పవలెను రణదుల్లా మహాప్రసాద మని, ఫకీరునకు సలాముచేసి ద్వారమును దాఁటి త్రోవలో నిలచి కొంచె మటు నిటు తిరిగి, యెట్టకేలకు మఱియొక మార్గమును బట్టె ను. తక్కిన ఫకీరులు నిమరించిరి. ప్రశ్న చెప్పిన ఫకీరు వీని పోకడ గాంచి, ,,కానీ వీఁ డెక్కడకుఁ బోవుచుండెనో యని తానును లేచి మాఱువేషము వేసికొని వ్యాఘ్రము ననుస రించు క్రూరనారాచముపలె దానిని వెంబడించెను. అట్లు రణదుల్లా పోయి పోయి యూరివెలుపట నున్నయొక మాల

గూడెమునకుఁ బోయెను. వీని యఱుకుడునకు శ్వానము లఱ వఁ జొచ్చెను. అందుచేత నంతకు మున్ను గడిచువఱకుఁ జేలకుఁ బందులకాపును గాచి వచ్చి యప్పుడె పండుకొనిన యాగూడెము వాండ్రకుఁ మెలఁకువ గలిగి, కుక్కల మొఱ్ఱఁత కేమికారణమో, వన సూకర మే మేఱి వచ్చిన దేమో యని యీటె నొక దానిని గైకొని వెలుపలకు వచ్చెను ఎవ్వఁడో యొకఁడు లేచి వచ్చినాఁ డని యెంచి ‹‹ఓరీ యెవ్వరావచ్చినది? నీవ్వొకసారి యిటురమ్మని చెప్పెను. వాఁడు సమీపించెను. ఇరువురు నేమో మాటలాడుకొనిరి. మాలవాఁడు తిరిగి గూడెమునకుఁ బోయెను. ఫకీరు వచ్చి వచ్చి యొకపొదచాటున డాఁగియుండెను. మఱికొందఱు మనుష్యులు వచ్చి ఖానుతో మాట్లాడుచుండిరి. వారిమాట లొక్కటైన ఫకీరునకు వినఁబడ లేదు కాని, రామసింగు అనుమాట మాత్రము వినఁబడెను. తరువాతఁ గొంతసేపటికి ‹‹చిత్తంబాబు" అను మాట వినఁబడెను అంతట ఫకీరు వెనుకకు మరలెను. పిమ్మట ఖాను సాహేబు తిరిగి వచ్చెను. ఫకీరు కొంతవఱకు వచ్చి యొక చోఁట డాఁగెను ఖాను వడి వడిఁ బోవుచుండెను ఫకీరు వారి వెనుకఁ బోయి యాతని గృహమును గుర్తించి, వెనుకకు మరలి పోయి పండుకొని యేదియో యాలోచించుచుఁ దెల్లవాఱుటకు నిరీక్షించుచుండెను.

---

## ఏడవ ప్రకరణము.

### తస్కరవధ.

పదిగడియల ప్రొద్దెక్కినది. ఒక పురుషుఁడు తనభవన మున చావడిలోఁ గురిచీపైఁ గూరుచుండి యొక లేఖను చేతఁ బట్టుకొని, తనలోఁ దా నేదియో యాలోచించు చుండెను. ఆతని మొగమున విచారము తోఁచుచున్నది. నిశ్వాసము లరుదై యోగసాధనముఁ జేయుసిద్ధుని హంస నిశ్వాసమువలె గడియ కొకండుగ వెడలుచుండెను. ఇట్లుండ లోపలనుండి యొక కన్యారత్నము వచ్చి యాతని లక్షణము లు పరీక్షించి, అయ్యా ! యేమి యి ట్లున్నా రని యడిగెను. పురుషుఁ డాలేఖ నామె కందిచ్చెను. ఆమె దానినిఁ జూచి తండ్రీ ! యేమిచేసెదము. పారతంత్ర్యమున నవయుచుండుట చే నిట్టివి మూఁడుచుండును. యిన్ని యేల. నీవు పోయి భార్య కంఠము నఱికి రమ్మనిన నఱకవలసిన దే. నఱకకున్న దమప్రాణములకు జలాంజలి యీయవలసిన దె.. అందు యవ న పారతంత్ర్యము కడుదుర్భరము. నరకమయిన ననుభవింప వచ్చును గాని, యట్టిదాసియందుఁ బడి జీవింపరాదు. ఇట్టి మ హాపత్సముద్రనిర్మగ్నులయిన వారికి ధైర్యమే సహాయము కావున ధృతిని విడువరాదు.'' అని సమాశ్వాసవచనము పలికె ను. చదువరులారా! యీపురుషుఁడే రామసింగను క్షత్రియు

కులావతంసుఁడు. ఆమె యాతనిపుత్రిక ప్రసన్నముఖి. అంత నారామసింగు ,,అమ్మా! తురుష్కులు మహాక్రూరులు, నేఁటికి నిన్ను నింట నొంటరిగా విడిచి సమరమునకుఁ బోవలసిన సమయము తటస్థించినది. నే నింట లేనని యేదుర్మార్గులేమిసేయుదురో తెలియదు. మన మింతవఱకు మహాభీకరక్రూరజంతుసంచయముల నడుమఁ గురంగంబులకరణి జీవనము సేయుచున్నాము. కావున నీవు వంశమునకుఁ జిహ్నమైనయా ప్రపితామహార్జిత పౌరుషమును నిలుపుము నీ శక్తి మాన రక్షణమునకే యని యూహింపుము. శరీరమున -ఐహిక సౌఖ్యములును-అల్పకాలభోగములును దుచ్ఛము లనితలపోయుము. క్రూర చిత్తములను సంహరించుటకే మనజీవయాత్ర యనుకొని ప్రవర్తింపుము. నానారత్నమయస్వర్ణభూషణాంబరములు సర్వకాలశృంగారము లని యనూహింపుము. సుగుణసత్ప్రవర్తనాదులె యాచంద్రార్క ప్రకాశమాన లయినసమ యనర్ఘభూషణము లని యెంచుము. అధైర్య మను మృగమును నీహృదయకందరమునుండి తఱిమి వేయుము. అది క్రూరుల పాలిటి మృత్యుదేవతగాననుకొనుము. నాకుఁ దండ్రి కలఁడు-అను పితృప్రేమ పూర్తిగ మఱచి పొమ్ము నాదురదృష్టము చేత నిన్నొక రాజపుత్రుని హస్తమునందుఁ బెట్టి నీభారమును నాతలనుండి దింపుకొనలేకపోయిన నిర్భాగ్యుఁడ నైతిని. స్వప్నము నందైనను నన్నుఁ దలంపకుము. రణప్రయాణము మృత్యుభీకరకరాళదంష్ట్రాంతరప్రవేశము వంటిది. మరలివచ్చు

టదుస్తరము. అందీ ప్రయాణ మెచ్చటికో యెవనితో యుద్ధ
ము చేయవలయునో యగోచరము. కావునఁ దల్లీ! నిన్నిదె కడ
సారి చూచుట. పోయి వచ్చెదను. ఆజ్ఞాపత్రమును జూచిన
రెండు గడియలలోఁ బోవలయునఁట. పోవకున్న దండింతురఁ
ట. ఈగోఘ్నుల చేతులలోఁ జచ్చుటకంటె సమరముననే
చచ్చుట స్వర్గప్రాప్తి కావున, నే నిదె పోయెదను." అని
కన్నుల నీరు వెట్టుకొని యామెమూర్ధమును నాఘ్రాణము చే
సి, కరకిసలయమును ముద్దువెట్టుకొని పోవుచుండ "తండ్రీ
మీరు చెప్పిన చొప్పునఁ బ్రవర్తించుదానను. శౌర్యమును
బ్రదర్శించుటలో రామసింగు పుత్రిక ననిపించుకొనెదను.
కాని నన్నుఁ జేరి చూడ నీ యవనులకే కాదు ఘోరా
త్మునకయిన వశము కాదు. ప్రాణవిసర్జనమైనఁ గావింతును
గాని మానహీనతకు నవకాశ మీయను. నీ దర్శనము స్వల్ప
కాలముననె సంభవింపఁ గలదు. మీ ప్రయాణము సుఖప్రద
మగును గాక, పోయి రండు, అన్నిటికిని దల్లి పరాశక్తియే
కలదు." అని చెప్పెను. రామసింగ క్షణముననే బయలుదే
రి వెడలిపోయెను. ప్రసన్నయు నది మొదలు శౌర్యాలంకృత
యై శాత్రవదుర్జన్యము నెదురు చూచుచు లోపలికిఁ బో
యి గదితలుపుఁ దీయునంత, వసారాప్రదేశమున నొక్క
యపూర్వపుష్పగుచ్ఛము పడియుండెను. ఆశ్చర్యముతో
దానిని స్వీకరించి వాసనఁ జూచి "యిది యిక్కడి కెట్లు వచ్చి
నది?" అని యబ్బురపడుచు, దాని నటు నిటు ద్రిప్పి చూచు

టలో నందొక లేఖ యున్నట్లు తోచి దానిని సడలించి యా లేఖను జదువఁజొచ్చెను. "కల్యాణీ! ప్రసన్నా! నీతండ్రి యింటఁలేఁ డని బందిపోటు దొంగలు నీయింట నీరేయి పడ నున్నవారు. కావున నీవు నేఁటిరాత్రి మిక్కిలిజాగరూకతతో వర్తింపుము. భగవంతునకు నీమీఁద జాలదయ గలదు నీమనో భీష్టము నెరవేరును గాని, దుర్జనుల యౌద్ధత్యము కొంతవఱకునిన్న లయించును దానికి నీవు జడియక పౌరుషముతోఁ బ్రతిఘ టించి గౌరవరక్షణము చేసికొమ్ము చైద్యపరాభూత కానున్న రుక్మిణీదేవిని శ్రీకృష్ణుఁడు రక్షించినట్లు నిన్ను నీ మనోనా థుఁడు స్వీకరించును." అని చదివి "ఆహా యేమిది? నామనో నాథుఁడా నన్ను శ్రీకృష్ణునివలె రక్షించువాఁడు. ఆహా! ఎంతవింత! యీ వ్రాసిన వారెవ్వరు? నామనోనాథుఁ డెవ్వడో యాతఁ డెట్లెఱుఁగును? ఈ యంశము నాచేటి కయు నేను దప్ప మఱెవ్వరు నెఱుఁగరె. పోనిమ్ము యెఱుఁ గుదురు కాక. నా కిట్టి నీతి బోధించునట్టి మహానుభావుఁ డెవ్వఁడు? ఆయన మాయింట నేఁడు బందిపోటుపడు నని యేమెఱుంగును? ఆయంశము నాకుఁ దెలుపవలసినంత యవసర మాసుగుఁణి కేల? ఆహా! వింతగ నున్నది పోనిమ్ము ఎవఁడో నాయందు వాత్సల్యము గల మహానుభావుఁడు;— సరియె నా తండ్రిని రణమునకుఁ బంపుటయు నాయింట దొం గలు పడుటయు నన్నియు బాగుగనే యున్నవి. అటులే యా లోచించుకొనుచు భావిప్రయత్నములను జేసికొను దానను."

ఎప్పుడు సూర్యాస్తమయ మగునాయని తస్కరివలె నెదురు చూచుచుండఁగనే చోరులు పాపవ్యవసాయముఁ జొచ్చు నట్లు పరిభాకరుండు నిశాకాంతాలోలుండై యస్తమించి నాఁడు. ప్రసన్నయు భోజనాదికృత్యములఁ దీర్చికొని భండాసురవధోత్సాహమున నొప్పు మహాకాళివలెఁ బుట్టంబును వెనుకకు బిగించికట్టి వీథితలుపునకు జేనెడుదూరమున వరుసగ మూఁడు గునపములను దిగవేసి యొకమనిషిమాత్రము లోపలికివచ్చునంతటి యవకాశము గలుగు నటుకుఁ దలుపువచ్చునటు తేర్పఱచి, చిన్నగడియ వేసి, యొకఖడ్గమును జేతఁ బట్టుకొని సర్వసిద్ధముగాఁ గూరుచుండెను. అప్పటికి రాత్రి 12 గడియలైనది. పట్టణమున సందడులు తగ్గినవి. అప్పుడు కొందఱు బందెపోటు దొంగలు వచ్చి వీథితలుపులు గట్టిగఁ ద్రోయునంతకుఁ జిన్నగడియ యూఁడిపోయినది తలుపుమాత్ర మొక్కమనుష్యుఁడు వెళ్ళుటకుఁ దగిన సందిచ్చెను. ఆసందునుండియె యొక్కఁ డొక్కఁడుగఁ బ్రవేశించుచుండిరి. లోపలఁ దల పెట్టినవాని నెల్ల నఱకుచు నవ్వల కీడ్చుచుండెను. ఇట్లిరువది మంది జనులు ప్రవేశించి యందఱును మడిసినారు. తరువాతఁ గొంతసేపటివఱకుఁ జూచి యెట్లయిన మనలఁ బరిభవించునేమో యని భీతిచేఁ బెరటిత్రోవ ననుసంధించెను. ఆతుక పోయినవా రెప్పుడు వత్తురో, ప్రసన్న యెప్పుడు తెచ్చి తన కర్పింతురో యని పేరాసచేఁ గొంతదూరమున నిరీక్షించుచుఁ జివరకు నా గృహసమీపమునకుఁ బోయెను. సందడి . నుం

తయుఁ గానరాలేదు. ఆశ్చర్యముతో గుమ్మము చెంతకుఁ బోయి చూడఁ దలుపుతీసి యుండెను. దీపము లేదు. అంతట గుండె జల్లుమనెను. ఆలోచన మేమియు దోచలేదు. కొంచెము ధైర్యమును దెచ్చుకొని చెకుముకి వెలిఁగించి, చూచువఱకు నెత్తురుకాలువయుఁ గళేబరములు నున్నట్టుఁ గనఁబడెను అది చూచి యడలి, యేదోప్రమాదము జరిగినది. ప్రసన్న యేమయినదో యను చింతతోఁ దిరిగి యింటికి వచ్చెను.



ఎనిమిదవ ప్రకరణము.



శ్రీప్రాణనాథయోగి.

ఘనకార్యాలోచనాపరతంత్రుల హృదయములు సర్వదా కాలచక్రమువలెఁ బరిభ్రమించుచుండును. ముఖమండల మెప్పుడును గార్యాకార్యవిచారోన్ముఖమై గాంభీర్యమును సూచించుచుండును. ఒకనాఁటి యుదయమునఁ గాల్యకృత్యములను దీర్చికొని యొకపురుషుఁడు కచేరీ చేయు మహాలునకుఁ, గ్రిందుగ నున్న వసారాపై నడచుచు నేదియో యాలోచించుచుండఁగ నొక్క యోగీంద్రుఁడు, శ్రీహరిని సందర్శింప

వచ్చు నాది భిక్షువు ననుకరించుచు ద్వారము లన్నియుఁ గడచి వచ్చుచుండ ద్వారపాలకు లెవ్వరును నామహాత్ముని నిరోధింపరైరి. అట్లు వచ్చుచున్న మహాత్మునిఁ జూచిన తోడనే భానూదయ సమయమునఁ దమస్సంఘమును బాసి విమలమైన పౌరందరదిఙ్ముఖంబువలెఁ బురుషుని ముఖము నిర్వికార గంభీరమై ప్రసన్నమై కనుపట్టెను. ఈ పురుషుఁ డెవ్వఁడని మీ రూహింతురు? ఏమహాపురుషుఁడు పారతంత్ర్యమును బటాపంచలుగఁ జేసి, బుందేలుఖండములోని క్షత్రియావతంసులకు, నాత్మధర్మమును బోధించి వారి వీరరసావతారమూర్తులుగఁ జేసెనో, శాత్రవభంజనుఁడైన నర్జునునకుఁ బ్రతిరూపులుగఁ జేసెనో యెవ్వాఁడు సర్వక్షత్రియుల హృదయములను, సమరోత్సాహపూరితములుగఁ జేసెనో, యే రాజకంఠీరవుండు బుందేలుఖండములోని నానాభూపాల సంతానమునకు శస్త్రదేశికుండై, రక్షకుండై, దైవమై, యొప్పారెనో, యట్టి ఛత్రసాల మహీపతి యావచ్చినయోగిచంద్రునకెదురేగి సాష్టాంగనమస్కారము లాచరించి, యానందాశ్రువులతోఁ బాద్య మొసంగి, తోడి తెచ్చి యొకపూజ్యమైనసింహాసమున నధిష్ఠింపఁజేసి, చేతులు కట్టుకొని యవనతవదనుండయ్యెను. ఆయోగికులతిలకుఁ డెవ్వం డని మీ రూహింతురు. ఢిల్లీపట్టణమున వాఁడు తాఁటిజేబునకును దాఁటియాకుల గొడుగునకును బోరు పెట్టిన పిచ్చివాఁడు, ఫకీరులతో నమాజు చేసి, రణదుల్లాఖానునకుఁ బ్రశ్న చెప్పి, యాతని వెనువెంటఁ బోయి

రామసింగు గృహము దోఁపింపఁ జేయుటకుఁ జేసిన యేర్పాటు ను దెలిసికొనిన బుద్ధిశాలి. తరువాత నాపత్సూచక లేఖను బుష్పగుచ్ఛమున నమర్చి రామసింగుగృహములోఁ బొఱవైచిన పుణ్యపురుషుఁ డైన శ్రీప్రాణనాథుఁ డను యోగిచంద్రుఁడు. ఇట్లు భక్తివినయములతో నెదురు నిలచిన యాఛత్రసాలుని తో నిట్లు సంభాషించెను "వత్సా! ఛత్రసాలమహీపాల ! నీ యుద్యమమునకు సమస్త భూతములును నానందించుచున్నవి. ఏమందువేని ,,మలయాచల సంసర్గాన్న వేణుశ్చందనాయతే" మలయ పర్వతమున జనించి నంత మాత్రమున వెదుళ్ళు చం దనవృక్షములు కావు. మనుష్యులయి పుట్టినంత మాత్రమున మనుష్యులు కారు. ఏమందువేని యాత్మధర్మము నెఱింగి తమ పూర్వుల సుప్రసిద్ధము లయిన ప్రతిష్ఠలకు వన్నెఁ దెచ్చు పౌరుషమును, శౌర్యమును బ్రదర్శించి యాత్మీయధర్మముల నెఱింగి, దయ, సత్యము, శౌచమును గలిగి వర్తించు వాఁడె మనుష్యుఁడు కాని స్వార్థపరులై తమయు నన్యులయు కష్టసు ఖములఁ దలంపక కాలుఁగదలుపనైన నధికారము లేక యాలా నమునఁ దిరుగులాడు మాతంగములవలె నన్నిట వ్యర్థు లయి నవారు ద్విపాదపశువులుగ గణింపఁబడుదురు. నీవు మహాపురు షులలోని వాఁడవు. మహారాష్ట్ర దేశమాత గర్భకోశము ం మాణిక్యమువలెఁ బుట్టిన ఛత్రపతిశివాజీ యెట్టివాఁడో నీవు ను నట్టిమహాపురుషుఁడవు ఇప్పుడు భారతమాత యనాచారప రాయణులై దయావిరహితులై, గోబ్రాహ్మణ హింసాపరులై

సాధ్వీలోకమానభంగకారకు లైన క్రూరతురుష్క రాజుల నిరంకుశాధికారశూలముస గ్రుచ్చఁబడి కంటికి మంటికి నేకధారగా నేడ్చుచున్నది. భారతమాత ధర్మశుల్కయేకాని యధర్మశుల్క కాదు. తన పుత్రులందఱు నిర్వీర్యులై తన్నుఁ గ్రూరుల కర్పించినారని హృదయ తాపముతోఁ బొగులుచున్నది. అందు నీజన్మమునకుగర్భసీమ. ఆమాట నిన్ను దగులఁబెట్టును. నీవు శక్తి కలవాఁడవై యామంటను జల్లార్చుము. తన పుత్రికలు మానభంగ దశచేత, నగ్నిలో నఱుకుచున్నా రనియుఁ బవిత్రధేనుసంతానము లాక్రవ్యాదులకు మాంసపుఁగూడగుచున్నవనియుఁ బట్టరానిదుఃఖముచేఁ బరితపించుచున్నది. ఇట్టి సంక్షోభము నడఁచు పుత్త్రుఁడు కలుగునా దుఃఖాగ్ని యెన్నఁడైనఁ జల్లాఱునా యని తపస్సుచేయుచుండ శివాజి యనునన ఘనశక్తి యుదయించి కొంతవఱకు దుష్టసంహార మొనరించి మాతృదేవతకుఁ గల సంతాపమును బాపినది. అతనికి రామదాస యోగిపుంగవుఁడు, శ్రీకృష్ణుఁ డర్జునునకుఁ గర్మయోగ ముపదేశించి నటులె కర్మయోగము గఱపినాఁడు. నీయందు నానరాంశము గలదని యెఱింగి నీకుఁ గర్మయోగ ముపదేశింపవచ్చితి. మానవునిజన్మము కర్మకొఱకుఁగాని వేఱొండు కాదు. ఏకర్మచేత జనించితిమో యాకర్మచే మోక్షము నందవలయును. ఆత్మసుఖము సుఖము గాదు. ఒక్కసుఖమే యన నేల? తనదేహమే యన్యుల కొఱకేఁ గాని తనకొఱకేఁ గాదు. ఏవాఁడు తన జీవితమును దనదేశముకొఱకుఁ బ్రజలకొఱకును వినియో

గపఱచునో వాఁడె మహాపురుషుఁడు. శ్రీరాముఁ డుదయించి బాలప్రాయమునప్పుడె రాక్షససంహారమునకయి విశ్వామిత్రున కర్పింపఁబడి సుబాహు ప్రముఖుల వధించి, మునికులరక్షణ మొనరించినాఁడు. పిత్రాజ్ఞచే భార్యానుజులతో నరణ్యావాసమునకుఁ బోయి యనేక రాక్షసుల సంహరించి, భార్యను గోల్పోయి, సకల కష్టములఁ బడి, పౌలస్త్యాదుల వధించి, ధర్మమును నిలవఁ బెట్టుట విశ్వక్షేమమునకుఁ గాని తన కొఱకుఁ గాదు. అంతయే కాదు. ద్వాపరంబునఁ బూతన తృణావర్త ఘటక శకటాది రాక్షసులను బరిమార్చి లోక కంటకుఁడైన కంసుని వధించి దేశము నిష్కంటకముగఁ జేసి స్వదేశమున సుఖమును బ్రతిష్ఠాపన చేయుటకుఁ గాని పదార్వేల గోపికా స్త్రీలతో నానందించుటకుఁ గాదు శ్రీకృష్ణుఁ డుదయించినది పామరజను లట్లు తలంతురు కాని ప్రాజ్ఞు లాచందమునఁ దలంపరు. రామావతారమున సీతాకాంతుని దివ్యమంగళ విగ్రహమును జూచి, మును లెల్లరు మోహించుటచేఁ గృష్ణావతారమున మీ కానందమును గూర్చెద నని వర మిచ్చుటచేఁ గోపికావతారములఁ దాల్చిన ఋషులకు నానందముఁ గొల్పెను. కాని వేఱొండు కాదు. మహాపురుషు లీశ్వరాంశసంభూతులు. నీవు నట్టివాఁడవే కావున, జన్మదేశపు సుఖమునకై పాటుపడుము. నీరక్తము నాత్మదేశమునకై ధారవిడువుము. అట్లు గాక దేశకష్టముల నాలోచింపక, తుచ్ఛములయినప్రాణములకాసించి, మూలమూలల డాఁగితివేని ఘోరమైన నర

కమునం బడుదువు అప్పుడు నిన్నుఁ గాంచి దేశమాత నాక డుపున నిర్భాగ్యులు నిస్తేజులు కలిగినా రని దుఃఖించును. పరావమానదుఃఖమునకంటె నీదుఃఖమె మిక్కిలి బాధించును. దేశము భగవంతుని స్వరూపము. దేశక్షోభము భగవంతుని సంక్షోభముగా నెఱుంగునది. అట్టి సంక్షోభమును మాన్పుటకు భగవంతుని యంశమువలన మహాపురుషు లుద్భవింతురు. అట్టివారు మోహావివశులై బుద్బుదప్రాయములైన శరీరముల కాసించి తటస్థులైనచో వారు జీవన్మృతులుగఁ బరిగణింపఁబడుదురు. అదియె రామదాసు శివాజీకిఁ జేసిన యాత్మబోధము. అర్జునునకు శ్రీకృష్ణుఁడు చేసిన బోధయు నిదియె. కావున నీవు స్వరాజ్యమునకుఁ గంకణము గట్టినవాఁడవు "సోహం బ్రహ్మ" అను సూక్తిని మఱవక ప్రవర్తించి నీకీర్తిని హరిదంతముల వ్యాపింపఁజేయుము. నీ వొకసారి ఛత్రపతి శివాజీని దర్శించి సమర వ్యాపార రహస్యముల నెఱుంగుము. నీవు పదిదినములలో భీమానదియొడ్డున నాదేశభక్తుని గలిసికొనఁగలవు. నీకొఱకొక్క మహాపతివ్రతాతిలకము తపంబు సేయుచున్నది. ఆమె ఢిల్లీపురంబున రామసింగు పుత్త్రిక ప్రసన్నముఖి. తొల్లి రావణునిచే బాధింపఁబడు జానకీదేవివలె రణదుల్లాఖానునిచేతఁ గాంక్షింపఁబడి, బలాత్కరింపఁబడుచున్నది. ఆమెయు శౌర్యధైర్యములలో నీకు సమానురాలు నీకుఁ దగినయర్ధాంగి యామెయె కాని యితరులు నీకుఁ దగరు. మీ కీరుపురకుఁ గొలఁది దినములలో సమావేశ ము

గును. నీవు “మహమ్మదుఖాసిం” అను తురుష్కునందేశహ సనిఁ బట్టుకొని చెఱఁబెట్టినందులకు నౌరంగజేబు చక్రవర్తి నీపై యుద్ధమునకు ఫిదాయీఖానునిఁ బంపుచున్నాఁడు. వారిని రాజధాని సమీపింపకుండఁగనే యెదుర్కొని యోడించుటకుఁ దగినవారిని నియోగింపుము. నీవహర్నిశము స్వదేశసంరక్షణమునే జపించుచుండుము. నీ విది మొదలుకొని యేమఱి యుండరాదు. నీమీఁదికిఁ బలుసార్లు మొగలాయీలు దాడివత్తురు. అని చెప్పువఱకు నానందాశ్రువుల రాల్చి “మహాత్మా! ధన్యుఁడనైతిని, నాజన్మము సఫలమైనది. మీయానతి శిరసావహించి మీరు చెప్పినరీతి నాచరింతును. కాని మీపాదసేవకునకుఁ బునఃపునర్దర్శనలాభము గలుగఁజేసి విజయమును సమకూర్చుభారము మీయదియె. ఈభక్తుని మాత్రము మఱవవలదు.” అని ఛత్రసాలుఁడు ప్రార్థింప వల్లెయని, మహాత్ముఁడు శ్రీప్రాణనాథయోగీంద్రుఁ డరిగెను. అంతట నామునిచంద్రుని సింహద్వారమువఱకు సాగనంపి తిరిగివచ్చి సింహాసనముమీఁదఁ గూరుచుండి, యేదియో యాలోచించునంత, గణపతిసింహుఁడు ప్రవేశించి నమస్కరించెను ఛత్రసాలుడు, “ఓయీ, మొగలుసైన్యము మనమీఁద దాడివెడలి వచ్చుచున్నదఁట. నీవు తగినసైన్యముం దీసికొని యెదురుగఁ బోయి, మధ్యేమార్గంబుననే యోడించిరమ్ము. వేయేల వారిని జయించికాని నామొగమును జూడరాదు.” అని చెప్పెను.

గణపతిసింహుఁడది విని "మహాత్మా! అట్లులే నేచేసి వచ్చెదను. నే నీసమయముననే సెలవుగైకొని పోయెదను." అని వెడలెను. అంతట ఛత్రసాలుఁడును గోదనాదిశ్వర్త్యము లోనికి వెడలెను.



## తొమ్మిదవ ప్రకరణము.



### శిదాయీఖానుని యోటమి.

పూర్వ యుగమున మహాభుజుఁడగు కార్తవీర్యుఁ డేన నీతరంగములఁ దనప్రియురాండ్ర జలకేళీలాలసత్వమునకై వేయుబాహువులతో నడ్డకట్టి తన రహస్యవిలాసములఁ గేవలకైలాసోద్ధరణదర్పమున సిగ్గులేక యంతరాయము గల్పింప వచ్చిన పంక్తికంఠుననొక కేలఁ బట్టి విసరివైచెనో యట్టి పాపహారిణియైన నర్మదానది వార్షికసమయము దాఁటినదగుటచే నిర్మలజలపూరితమై వేగము తగ్గి ప్రవహించుచుండెను. అట్టి నది నుత్తరించి ఛత్రసాలమహీరమణుని సేనలు హుటాహుటిగ నుత్తరదిక్కునకుఁ బోవుచు శంబరపురమును దాఁటి కొంతవఱకు ప్రయాణము సేయుచుండెను దుర్గమారణ్యసీమలగుటచేఁ బ్రయాణము దుర్భరమయినను, ఢిల్లీచక్రవర్తి సేనలు చొచ్చి వచ్చి దేశముపైఁ బడకుండ నతి త్వరతో హుటాహుటిగఁ బోవుచుండెను. వింధ్యారణ్యము మిక్కిలి

మహామహీరుహములవలె నాంధ్రయోధులుచే నెదురుగా వచ్చు తురుష్కసేనలు సమీపమునకు వచ్చుచుండ నొకరికొకరు కనంబడకుండునటుల రేగు ఛత్రసాలుని ధవళమగు బుందేలు ఖండమునందలి సవారులలో నుండుటచేతం దురుష్కసైనికు లేమూలనుండి యెవ్వరు వచ్చి తమపైఁబడుదురో యని భీతి చేత గుండెలు చేతఁ బట్టుకొని చాల నెమ్మదిగఁ బ్రయాణముఁ జేయుచు, రామపురమునకు సమీపారణ్యమునం దొక విశాలస్థలంబున నిలిచిరి. గణపతిసింహుఁడును, సంగ్రామసింహుఁడును, మరికొందరు యోధులు సర్వసేనల నధిష్ఠించి ముందుగఁ బోవుచున్నారు. ఇట్లు సమయమునఁ సందిగ్ధారంబునఁ దురంగముల హేషారవములు కర్ణపుటములఁ జొచ్చెను. శత్రుకులము గుఱ్ఱముల నాపి యాసక్తితో నాలకించిరి. అంతట సాంద్రముగ హేషారవములే కాక, గుఱ్ఱపు టడుగుల చప్పుడులును గిటుకిటు మని వినవచ్చెను. సంగ్రామసింహుఁడు తమసేనలకు రణమునకు సంసిద్ధులు కండని చేరుమాలు విసరి సైగఁ చేసెను. అంతట ఛత్రసాలుని సేనికులు కత్తులు దూసికొని సిద్ధపడియుండిరి. గణపతిసింహుఁడు వేగ రండని సైఁగ చేసి, తమ వాజుల వాయువేగమున నడిపించెను. తురుష్కసేనలును సమీపించి యనతిదూరమున వచ్చు సేనలఁ గని పెట్టి వారును సంగ్రామసిద్ధులయిరి. శాత్రవసేనలఁ జూచుట తోడనే యుభయసేనలలోని తురంగములు నొక్కసారి సకిలించెను. అంతట "రండు రండు" తలఁపడుఁడని పెద్దయెలి

వుభయసేనల నుండియు నొక్కుపెట్టు సెగసి హేషారవములకుం దోడయ్యెను. అట్టియెడం బోరు ఘోరంబై మేను తెలియంగక, యన్యోన్యవిజయాభిలాషులై తమ కృపాణముల నొకరి నొకరు ఖండించుకొనుచుండిరి. కొంతవఱకు సప్పరపేథ తళతళ మెఱయుచున్న కరవాలదీధితులచేత ననేకసహస్ర విద్యుల్లతలచేం బ్రకాశించి తిరిగి వర్షాకాలము ప్రాపించినదన్నటులం జూపఱకు విభ్రాంతిం గలుగం జేయుచుండెను. వెంటనే ఖడ్గములు రక్తసిక్తములయి యరుణమరీచుల నీనుచు శోణితవర్షము గురియం జొచ్చెను. తురంగములు ఖండీభూతములై మార్గనిరోధకములయ్యె. తురుష్కబలంబున మువ్వంతుసేన మడిసెను. తక్కిన సేనను బురికొల్పుచు, ఫిదాయీఖాను తలపడెను. రామసింగుజాడయే కనంబడలేదు. అతండును జచ్చినాండని తలంచి, తా నొక్కండనే కదా యని కొంతవఱకుం బోరెను గాని, యాత్మీయసేన యత్యల్పమగుట నెఱింగి, తన గుఱ్ఱమును వెనుకకుం బట్టించెను. కొలందిపాటిసైనికులును క్షతదేహులయి ఫిదాయీఖానుని వెంటం బరువిడం జొచ్చిరి. గణపతిసింహుని సైన్యములు వారలను సమర భూమి నతిక్రమించి కొంతదూరమువఱకుం దఱిమి యక్కడనె విశాలవటచ్ఛాయ నాశ్రయించి యలసటం దీర్చుకొని నంతలో నొకపురుషుండు రక్తసిక్తాంగుండై, వచ్చి యెదుట నిలచెను. ఆకారమును జూచి శత్రుసేనలోని వాండని యెఱింగియు, నిరాయుధుండై, పాదచారియై, వినయముతో వచ్చుచున్నాండని తలంచి

సైనికు లెవ్వరును వాని నదలింపరైరి. ఆపురుషుఁడు వచ్చి గణపతిసింహునకు మ్రొక్కి నిలచెను. అంతట వారికిట్లు సంభాషణము జరిగెను.

గణ—ఓయీ! నీ వెవ్వఁడవు?

పురు—అయ్యా! నేను క్షత్రియుఁడను. రామసింగను నామధేయముఁ గలవాఁడను. నేను శత్రువులలోఁ జేరి తన విషయమయి కుట్రల నన్నుచున్నవాఁడ నని తలంచి, యౌరంగజేబు చక్రవర్తి నన్నుఁ బనపట్టణంబున నిర్బంధ వాసమున నుంచినాఁడు. నా కొక్క పుత్త్రిక కలదు. ఆమె పే రు పరిసన్నముఖి. గణదుల్లాఖా నను చక్రవర్తి సేనాధికారి యామె నతనకు సమర్పింపు మని, నింద్యమయిన యభిప్రాయము ను జెప్పి యంప నేనును నాపుత్త్రికయుఁ, బ్రాణములకు నిరాశ చేసికొని నిరాకరించితిని. ఇట్లు లుండ నకస్మాత్తుగ యుద్ధము నకు రమ్మనియు, నట్లు రాకున్న నిన్ను బలాత్కారముగఁ జంపుదుననియు, శాసనపత్త్రమును బంపువరకు పుత్త్రిక భార ము దైవముమీఁదఁ బెట్టి, నీరిం కోడ నచ్చి, దేశోద్ధారకు లైన మీకోఁ బోరు సలుప నొల్లక, చచ్చినట్లు లోకతురంగక శిబ రములో దేహము దాఁచుకొని, వారు పాఱిపోయిన పిమ్మట బయలువెడలి, మి మ్మాశ్రయింప వచ్చితి" నని కంటఁ దడి పెట్టుకొనెను.

గణపతి—ఆహా! నీవా రామసింగవు? అక్కటా! చిరకాలము తురుష్కనిరంకుశాధికారాగ్నిచేఁ దపించుచుంటి

వే. మిత్రినూ దుఃఖింపకుము. పాక్తనకర్మచే నట్లు బాధ నందితివి. నీ కిపుడు విడుదల యయ్యె. కాని యామహాసాధ్విని బ్రసన్నముఖీదేవి నాతురుష్కు లేమి సేయుదురో కదా? నరే నీకు భయము లేదు. నీవు నూతో వెంట రమ్ము. దేవిని దోడ్కొని వచ్చుమార్గ మాలోచింతము. నీ వాజలాశయంబునం గ్రొత్త స్నానుండవై రమ్ము. మేము ను స్నాన మొనరించి, ధౌతవస్త్రములఁ ధరించి తిరిగి పురమునకుఁ బోవుదము. తురుష్కులు ఢిల్లీకిఁ బోయియే తిరిగి చూతురా, లేక మరలివత్తురా?

రామ—ఇఁకను వారి జన్మమునందు యుద్ధమునకు రారు. మన మిఁక మరలవచ్చును.

అందఱును స్నానార్థమై పోదురు.

పదియవ ప్రకరణము.

మిథ్యాపురుషుఁడు.

చింతకొంతెడుఁ దఱుచైన చెట్లతోఁ బులచే నిండి ప్రవేశించుటకు నుంతయు వీలులేక క్రూరమృగముల కాకరమైన విద్యారణ్యమున నొక్క పురుషుఁడు చిక్కుపడి యెందుఁ బోవుటకును వీలులేక బరిభ్రమించుచుండెను. అత్యధిక తత్కాలమగుటచేత యాకులసందున నుండి వెన్నెలలు ప్రసరించుట చేత కొంచెము ధైర్యముతో నతులే తిరుగుచు, సియాలు దారకునా యాను నానతో నడయాడుచుండఁ గష్టపడినవారికిఁ దు

నొకసారి బలవంతముగ ముడుచుకొనుచు, తిరిగి సాచుచుఁ చరణంబులఁ గ్రుచ్చుకొనిన కంటకంబులను వ్రేళ్ళతోఁ దడవి లాగికొనుచు, మంట లెక్కుటచేఁ జరణసీమఁ బొడమిన శోణితలంబు న రాచికొనుచు, గనుఁదమ్ముల నశ్రుకణంబులఁ జిటికెనవ్రేలితో నగోటఁ జిమ్ముచుఁ జేలాంచలమున ముఖముఁ దుడిచికొనుచు నుండియుండి యొక్కొకసారి వేఁడినిట్టూర్పు పుచ్చుచుఁ గొంతవడికు విశ్రాంతిఁగాంచి తనలోఁ దా నిట్లు తలపోయఁజొచ్చెను. «అక్కటా! నావంటియదృష్టహీను లెందైన నుందురా? హా! దైవమా! నే నెట్టిపాప మొనరించిన నన్నిట్టిసిలుగులం బెట్టుచున్నావు? వయసు వచ్చినది మొదలు నిర్బంధవాసమున నవయఁజేయుచు, మనసు దీఱ నొకమాట నెవ్వరితోడను జెప్పుకొనుటకు నోరుకట్టఁబడెను. మఱియొకచోటికిఁ బోవుటకుఁ గాళ్ళుకట్టఁబడెను. అన్నా! నాయవయవములు నాకే స్వాధీనము లేకుండఁ జేసితివే నాకేల యీయవయవములను గల్పనఁజేసి పుట్టించితివి? స్వేచ్ఛగఁ బలుకుటకుఁ బోవుటకు ననువుపడని యీ వ్యర్థపుబ్రతుకు నాకేలఁ గల్పించితివి? మూగతనముఁ గల్పింపలేక పోతివా? చరణముల సృష్టించినపుడె యీడ్చివేయ లేకపోతివా. ఇన్ని యేల? అజాగళస్తనమువలె నన్నిటను వ్యర్థమైన నాజీవనముతోఁ బ్రపంచమునకు నేమి యుపయోగ మని సృష్టిఁజేసితివి? పుట్టింపుమని యెవ్వఁ డడిగెను. సృష్టింపకయుండిన నెంతబాగుండును? హుం. అందుకే నీకుఁ బూజార్హత లేకపోయినది. ఇసీ! ఎంత

మాట పలికితిని. తప్పుడు మాటలాడుచున్నాను. నేను బూర్వ జన్మంబున నేదియో దుష్కర్మము చేసినానఁబట్టి, క్షత్రియుల యింటఁ బుట్టుటయుఁ, దుష్కులపాంసుల నిర్బంధావాసమున నవయుటయుఁ దటస్థమయినది కాఁబోలు! తమకులస్థునే వరింపవలయునఁట. తమ పురము విడిచి యితరస్థలంబులకుఁ దాము వెంట లేక పోరాదఁట. ఇదేమిదారుణము? ఇదేమి శాసనము? ఇదేమి నిరంకుశాధికారము? అహా! విధాతా, నీపనులన్నియు వంకరపనులే. సాధువులఁ బుట్టింపనేల? పుట్టించితివి కాక, వారల హింసింపుమని వారివెంటనే క్రూరులఁ బుట్టింపనేల? ఇదేటి ప్రాజ్ఞకార్యము? అల్పజ్ఞుఁడైన నొకబాలుఁడు మట్టిచేత నొకబొమ్మను జేయుచు తిరిగి దానినిఁ జెఱుపుచు, మరలఁ జేయుచు, మరలఁ జేయుచు, నిదేవిధముగ నాటలాడువానికంటె నీజ్ఞానమేమి మించిపోయినది. ఛీ! నీవంటి చపలుఁడు లేఁడు. నీకంటె నాయల్పజ్ఞుఁడే మేలు. ఏమందువా? వాఁడు బొమ్మను జేసి జీవమును బోయకయే చెఱుపుచున్నాఁడు. నీవా జీవమును బోసి సకలసంపన్నునిం జేసి నిష్కారణ మొక్కక్రూరునిచేతఁ జంపించియున్నావు. నీవంటి దయావిహీనుఁ డెందైనఁ గలఁడా? అంతయే కాదు. ప్రేమ యనుమాట కలదా. లేదు. ఉండెనేని నీవు చేచేతఁ బుట్టించిన వానిని జంపుచుండ, అయ్యో! నిష్కారణము క్రూరులచేత నాసృష్టిచేసిన మనుజుఁడు హింసింపఁ బడుచున్నాఁడే యను చింత నీహృదయమునకు లేశమయిన నుం

డవా ? ఓహో! నేను తప్పుటూహలఁ జేయుచున్నాను. జిఘాంసువులు కూడ నీసృష్టిలోని వారలే కావున, నీకు హింసయందు మిక్కిలి ప్రేమయుండుటచేతనే వారిచేత హింసింపఁ జేయించి, మరియుచుందువు లేకున్న నిజముగా సృష్టించుటయందే నీకుఁ బ్రీతియున్న సృష్టించి సకల కళ్యాణసమృద్ధులుగఁ జేసి వారలఁ జూచి నాబిడ్డలిట్లులున్నారుకదా యని సంతోషించుచునే యుందువు. కావున నీకు సృష్టికంటె లయమునందే యాస యెక్కుడని తేలినది. కాని నీకిది తగదు సుమీ ! ఏమందువా ? సకలకళాస్వరూపిణి నీ భార్య భారతి. ఆమె సనుకూలము సుఖమునందుఁ బెట్టుకొని తత్కళాసారమును సంపూర్ణముగ నట్టెటఁ గలపి నీ విట్టు లనార్యమైన హింసఁ జేయించుట నీవంటివానికిఁ బరువుతక్కువ. విద్యలేని వాఁడు వివేకపుఁబనులఁ జేసినచో వాఁడు శుంఠనుక నట్లు చేసె నని నిందింతురు. నీవు విద్యావంతుఁడవై, నీవు పుట్టించిన వారిని హింసచేయించుట నీ కెక్కువగౌరవము కాదు, నీ వొకవేళ యంత్యదశకు నేతలనొప్పిచేతనో, యేజ్వరము వచ్చియో, యేపాము కఱచియో, చచ్చినాఁ డన్నమాటను బుట్టఁజేసి చంపుచుంటిఁ గదా ; నా కాదోషము లేదని యర్థముచేసికొని సంతసించుచున్నావేమొ. అప్రాజ్ఞు లట్లు తలంతురు కాని, ప్రాజ్ఞు లెప్పుడు నట్లు తలంపరు. జ్ఞానులమాట పాటియే కాని యజ్ఞానుల మాటబోలె మమ్ము నీతురుష్క సార్వభౌముఁడై నయారంగజేబు బాధించుచున్నను,నీవే కారకుఁడవని నిన్ను నిందింప

సమానము. ఒకవేళ మీప్రారబ్ధకర్మయే మీకష్టసుఖములకుఁ గారణము కాని నేను గాదని వాదింతునేమో, మాకర్మమైన నీవు చేయించుటచేత మాకుఁ గలిగినది కాని వేఱొండు కాదు. మాచేత సత్కర్మలనే చేయింపలేకపోయితివా? నేను సత్కర్మలనే చేయుమని వేదముల రూపముగఁ దెలిసియుంటి ని. మీరు కామక్రోధాది శత్రుషట్కమునకు బశులై పాప కర్మములఁ జేసినారు కావున, మీదే యపోటని యందు వా? అఖిలేశుఁడవు సృష్టికర్తవు. నిర్ణయములను, కాముఁడను, క్రోధుఁడను లోభుఁడను మొదలగు నాయువ్వరు దుర్వృత్తులతిక్రమించుచుండ, నీకర్తృత్వము నీప్రభావము, నీ మహత్వము, నీ శక్తి, నీ విజ్ఞాతృత్వము నేమై పోయినవి. కావున నీవు మాత్రము హింసావిషయమునఁ దటస్థుఁడ నని బొంకిన నెవ్వరును నమ్మరు. కానిమ్ము. కానిమ్ము నీయిచ్చ వచ్చినట్లు బాములఁ బెట్టుచున్నావు. సుగుణయు నేఁగక యింటనున్న నొక బైరాగిచేఁ జెప్పించి పెద్దయాసను గలిగించినావు. నన్నే మఱియొక క్రూరునిచేత నభిలషింపఁ జేసినావు. సమరమిషమునఁ దండ్రి నల్లు పాపినావు. బందె పోటు వేయించినావు. నాచేత నాక్రూరులఁ జంపించినావు. అర్ధరాత్రిమున నడవులపాలుఁ జేసి, మార్గములఁ దప్పించి, కొండల నెక్కించి, నదుల నీదించి, పొదల దూరించి, తుద కీభయంకరారణ్య మధ్యమున, నీపర్వతప్రదేశముపైఁ గూరు చుండఁ బెట్టితివి. క్రింద మంటపెట్టి, తలమీఁద నీళ్లు చల్లిన

ట్టులు నీశ శాంకుచేత శీతలోపచారముల నేల చేయించెదవు. అమావాస్యచీకటిఁ జేయ లేకపోయితివా ? ఇదియే కాఁబోలు నొకకంట నేడుపు రెండవకంట సంతోషము నని చెప్పుదురు. నేను నిన్ను గుఱించి యెంత వాగిన నరణ్యరోదనమే కాని ఫలము లేదు. అతిపరుషము లయిన యీకొండరాళ్లైన సుధా కరకరస్పర్శచేఁ గరఁగి దయారసమును వెలువరించు చున్నవో యనునట్టుల పయఃకణముల వెడలఁ గ్రక్కుచున్నవి. నీవు కఠిన తముఁడవు; కాకున్న నీవు దయతలఁచినచో నన్నీసమ యమున హతాత్ముఁగఁ గొంపోయి, దేనిని నాసాగ్రిణపద మని తలంచితినో, యేది దేశభక్తి స్వరూపమై, దేశహింసకుల నిర్మూలింపఁ గంకణము కట్టుకొనియున్నదో, దేనిప్రతాపము భారతమాతకు గర్భసీమ యైన మధ్యమ హిందూదేశమెల్లఁ బ్రశయార్కమండల కాంతి సాదృశ్యమై క్రూరరాజకాంతార ములఁ గాల్చుచు నప్రతిహతమయి ప్రకాశించుచున్నదో, యట్టి ఛత్రసాల మహీపాలపరిశుద్ధతత్వమునకు సమీపమునఁ బడవేయరాదా ? అటు లేల చేర్చెదవు ? పెద్దపులి పేరంటాం డ్రకుఁ బెట్టునా ?" అని విధిని దూఱుచుఁ గ్రూరతురుష్కుల కుఁ జిక్కి యవమానంబుఁ జూడకుండ మనఃపూర్వకముగ స్వీకరించిన ఛత్రసాలుని హృదయమునం దలంచుచున్న నాకు, ఛత్రసాలుని భౌతికశరీరస్పర్శము లేకున్నను, మనస్స్ర్శము కలిగినది కదా ? ఇఁకఁ గ్రూర సత్వములచేతఁ జచ్చిన ను, నాజన్మము సార్థకమే యని తలంచుచు, నాఁటికి నుంతయు

యిన భీతిల్లక యధికాయాసంబునం జేసి దాహ మగుటచే నీ రెంతైన దొరకునా యని తలంచి దృష్టి నిగిడించువఱకు ననతిదూరంబున నాకొండయందే కొంతభాగము పరిశుద్ధజలా శయముగఁ దెల్లఁగఁ దోఁచువఱకు, పిపాసఁ దీర్చుకొందమని బిగియఁబాఱినకాళ్లను, మెల్లఁగ వంచుకొని మెట్టకేలకు లేచి కుంటుచుఁ జేత నున్న ఖడ్గము నానుకొని క్రమముగ నాజ లాంతికమును జేరి చూడ నది వెన్నెలబయల నీరువలెఁ గనఁ బడినది కాని, యిది సుద్దగడ్డయై కన్పట్టుటతోడనే యొక్క చిఱునవ్వు నవ్వి, హా! దైవమా! తుదకుఁ బిపాసచేఁ బ్రాణ ములు పోవునా యని తలఁచుచుండఁగనే యొక మండ్రగబ్బ యొకండు వచ్చి పాదమునఁ గుట్టెను, కుట్టుటతోడనే హా; ఛత్రసాలమహీపాలా యని మూర్ఛపడెను. చేతిఖడ్గము క్రిం దఁబడెను. అయ్యో! తిరిగి యావృశ్చికమే కుట్టునేమో యని భీతికలుగుటకుఁ గూడ స్మృతి దెలియక వాయువశమున భూతలమునకు రాలిన కల్పశాఖవలె మూర్ఛిల్లెను. విషము తో డలవఱకె కాళ శరీరమెల్ల వ్యాపించెను దేహము నల్లపడెను అట్టియెడ దిక్కెవరును లేరు. ఆరాత్రి మూఁడవయామము జరుగుచున్నది. "హా! ఛత్రిసాలమహీపాలా!" యను టచే మనుజుల ధ్వనిగాఁ దలంచి క్రూరమృగంబులు వచ్చి వానసఁజూచి తొలఁగిపోవుచున్నవి. అట్టులుండఁ గ్రమక్రమ ముగ నాపదలు పోయి సుఖములు వచ్చునన్నటుల తెల్లవా ఱునట్టి సూచనలు కన్పట్టుచుండెను. చుక్క పొడిచెను. చం

ద్రమండలము కళాయిదూసిన యిద్దపుఁబిళ్ళవలె శోభావిహీన మయ్యెను. "మన పద్మిన కాపద కెటిస్థించినది, వేగవచ్చిపోరి వరే కరుణాస్వాంతులారా" యనుపట్లును కాకములు కూయఁ జొచ్చెను. విహంగములు తోట్లలనుండి మేఁతకొఱకయి వృక్ష శిఖరాగ్రముల నధిష్ఠించి, పదములఁ గుప్పించి యెగిరిపోవు చుం డెను. భర్తృసమాగమ మగుచున్న దని యానందము కొలఁ ది పౌరందరదిగంగనామణి ముఖమునకు, వికాస ముదయించె ను. మన పురుషునిమోమునకు వికాసముకలిగి కన్నులు విచ్చు భాగ్యము కలుగునని తెలుపుడు చేయుచున్నవో యనునటు లు పద్మినుల ముఖముల విప్పనండుండి తుమ్మెదలు వెలువడ జొచ్చెను. అరుణపురస్సరుండైన సవితృం డుదయించి క్రమ ముగఁ జెట్లనీడల హ్రస్వముఁ జేయఁ దొడఁగెను ఇట్లుండఁ బరిసరమున నున్న చెంచుగూడెమునుండి, యిద్దఱు చెంచువాం డ్రు శిఖాబంధముల నెమలికన్నుల కట్టెలను నలంకారముగా ధరించి, బండిగురివెందపూసల పేరులు ధరించి, యలుగులపొ ది వీఁపున వ్రేలుచుండ, నారిసడలించిన విండ్లబద్దలఁ గైకొని, వేఁటకయి బయలుదేరి యానడుమ నున్న విశాలప్రదేశము గలకొండమీఁదఁ గొంచెముసేపు విహరించుతలంపున నచ్చట కు వచ్చుచుండిరి. కొంతదూరము వచ్చునప్పటికిఁ బాలసంద్రము న నొంటిమై నవతరించిన విష్ణుమూర్తివలె, తెల్లనైన యాను ద్దకొండ రాతినేలమీఁద జాంబూనదచ్ఛాయనుదలంపించు శరీ రచ్ఛాయ కలవాఁడైనను వృశ్చికవిషము శరీరమందెల్ల వ్యాపిం

చుటచేత నీలవర్ణము గలిగిన మనపురుషుఁడు కన్నులకు గోచరుఁడయ్యెను. చూచుటతోడనే యాశ్చర్యము నొందఁగొన సతి వేగముగ నామూర్ఛితునిఁ జేరి సౌందర్యమున కచ్చెరువంది శ్వాసము బరీక్షించి, బ్రతికియున్నట్లు స్పష్టపఱచుకొనిరి. చెంతనున్న ఖడ్గమును, ఆఖడ్గహతిచేఁ జచ్చిన వృశ్చికమును గాంచి, వృశ్చికదష్టమై మూర్ఛిల్లినవాఁడని తెలిసికొని తమలోఁ దాము". ఓరీ! నీ పీమహానుభావునిఁ జూచుచుండుము. వీనికిఁ దేలుకుట్టుటచే నిట్లు మూర్ఛిల్లినవాఁడు. నేఁబోయి కొంచెము నీరమును దేలుమందును దెచ్చెదనని వెడలిపోయి వెంటనే యొక చెట్టుపట్టను ఱాతిమీఁద నూఱి తేలుకుట్టిన చోట స్పష్టముగఁ గములిపోయి, కొంచెము రక్తము చిమ్ముటచేఁ గని పెట్టి, యానూఱినముద్ద నాప్రదేశమున రాచి మంత్రములు వేసెను. కొంతసేపటికిఁ జైతన్యము కలిగినది. మఱికొంతసేపటికిఁ గన్నులు విప్పి యటునిటుఁ జూచుచుండెను. పిలిచిన "ఊఁ" యనెను. నీళ్ళు తాపిన నోరు కొంచెము విప్పెను. ఉదకమును బోయఁగనె కొంచెము కొంచెముగ నానీళ్ళన్నియుఁ ద్రావెను. మఱికొంతసేపటికి లేచి కూర్చుండి వారలకు నమస్కరించి కన్నుల నీరు పెట్టుకొనెను.

చెంచు—బాబూ! మేము సీమలము. చెంచువాండ్రము, మీ బానిసలము, ప్రభువులకు సేవచేయుట మాపని కావున, మాకు దండనములు పెట్టవలదు. మీకు భయము లేదు. మా సామర్థ్యము మీకుఁ దెలియదు. మీరు మాపల్లెలో దే

హాముఁ గుశుర్చుకొని సుఖంబునఁ బోవచ్చును. మీ కేయాప దలు రాకుండ మీకు మాప్రాణముల సర్పించెదము.

పురు—మిత్రులారా! మీరు నాపాలిటి దేవతలు కాని మనుష్యులు గారు. ఈ నిర్జనారణ్యమధ్యంబున మీరు పోషించుటచేత బ్రతికితిని గాని లేకున్న మరణదేవతపాలగుదును. నా జన్మము కంతవఱకు మీ మేలు మఱువను. ఇట్టి యుపకారమును జేసిన మిమ్ముల ననుసరించి మీపల్లె నుండుట కంటె, నాకు వేఱొండు గతి గలదా? కావున నే మీ వెంట వచ్చి మీపల్లె నుండెదను. మీతో సఖ్యముఁ జేసెదను. మీరు నన్ను సోదరునివలె భావింపుఁడు."

అని చెప్పినతోడనే యా చెంచువాండ్రు పరమానందమును బొంది "మహాప్రభూ! అటులే దయ సేయుఁడు." అని వెంటఁబెట్టుకొని తమపల్లెకుఁ గొనిపోయిరి. ఇట్లుండఁ గ్రమక్రమముగఁ దేహవిషము హరించిపోవుటచే శరీరమున కెప్పటి కాంతి చేకూరినది. ఆతని సౌందర్యమును జూచి మహారాజును జూచినట్టులు చూచుచుఁ, బల్లెలోని వారు దంపతులు నతిభక్తి వినయంబులఁ జూపుచుందురు. ఆ చెంచులతోఁ గూడి యలుగులఁ దొడిగి నారిఁ దగుల్చుటయు, నమ్ములు సలక్ష్యముగ విడుచుటయు, దూరాపాతము, శబ్దవేధి మొదలగు శరప్రయోగ రహస్యముల నేర్పుచుండెను. ఆపల్లెలోని వారంద ఱాపురుషుని "మన్నె ఱేఁడా" యని పిలుచుచుందురు.



# పదునొకండవ ప్రకరణము.

## ఛత్రపాలుఁడు

విలాసపురశుద్ధాంతంబునకుఁ బ్రక్క నున్న గచ్చుచే యఁబడిన వేదికపై నొక్కఁడు గూరుచుండి తనలోఁ దా నిట్లాలోచించుకొనుచుండెను. "అన్నా! నేను వచ్చి యెన్నో దినము లయ్యెఁగదా! నా కార్యమునకు ముఖ్య మూలమును గానరాకున్నది. ఎట్టెటులో యంతఃపురపరిచారకునకుఁ గొంత ద్రవ్య మిచ్చి వాని నిటఁ గూరుచుండఁబెట్టి వానిపనికి నేను సిద్ధపడివచ్చితిని. ప్రభువుగారితో నీ యంశము మాటలాడినఁ దప్పక మోసము వాటిల్లును. మాటలాడకున్న నా పని నీళ్ళలోమూటయే. అదియుఁగాక, ఢిల్లీచక్రవర్తి కత్తులుకట్టి పలుసారులు దాడి వెడలుచున్నాఁడు. ఈ మహాహవదినంబు లలో నీ వార్తాశ్రవణము మహారాజునకు లంకణములలోని మనుగుడుపువలె నసహ్యాకరమై యుండును. అక్కటా యేమి యును దోచదుకదా? నాకొఱకై యా ప్రసన్న పుట్టెడాస తో నుండును, నే నిక్కడ సుఖభోజనములఁ జేయుచుఁ గార్య గతికిఁ గడంగక వ్యర్థముగాఁ గాలముఁ గడపుచుంటిని. నా కిక్కడ నెవ్వరు సహాయపడుదురు" అని పరిపరి విధములఁ దనలోఁ దా నాలోచించుచున్న సమయమున, మనంబునకు "సాహసే లక్ష్మి" అని గొప్పవాండ్రు చెప్పుట స్ఫురింపఁగా

,,నేనును సాహసించిన నాయభీష్టము నెఱవేఱునేమో యని, తలఁచి ,,సాహస మన నేమి చేయుదును? ఎదుటఁబడి యడుగుటతప్ప నింకేమి సాహస ముపయోగఁ బఱతును ? కాదు కాదు. ఎదుటఁబడిన నేమి ముప్పు చేకూరునో? రాజులచిత్తములు క్షణక్షణ చంచలములు. దురదృష్టవశముచేత నామె వ్రాసియిచ్చిన లేఖను బోఁగొట్టికొంటిని. ఆప్రసన్న వ్రాసిన ట్టుల నేనే యొకలేఖను సృష్టించెదను. అందలిమాటలు జ్ఞాపక మున్నవికదా? ఆ మాటలనే వ్రాసెదను.'' అని అప్పుడ లేచి లోపలికిఁ బోయి చూచునప్పుడు, నందఱును భోజనానంతరమునఁ గ్రమ్మినమైకముచే నిద్రరకుఁ బ్రారంభించినారు. ఇది సమయము కదా యని యొకలేఖ లిఖించి యందుఁ బ్రసన్న వ్రాలు తానే చేసి, పైపేరు వ్రాసి, ముద్రవైచి చెంత దాఁచికొని, ,,ఇది యెట్లు మహారాజునకందిత్తును'' అని యోచించి, సరే యని నిశ్చయపఱచుకొని, మహారాజుగారు లేచువఱకు వేచియుండి యుపహారమును భుజించి తాంబూలచర్వణము సేయుచున్న సమయంబున సమీపించి నమస్కరించెను. ,,ఓరీ ఏమిరా ! యేదో చెప్పదలచినట్లు వచ్చితి వేమికారణ'' మని రాజు పృచ్ఛ చేసెను. ,,స్వామీ దేవర కిమ్మని సింహద్వారమువద్ద నేను వచ్చుచుండఁగ నెవ్వఁడో యీ లేఖను నా చేతి కిచ్చి యటులే పోయెను. తరువాత ,,నీ వెవ్వడవు ? నీ పేరే రెయ్యది'' అని పృచ్ఛసేయనైతిని గదా యని చింత పడితిని గాని వెనుకఁ జింతించుట వెఱ్ఱిపని యనియు, నీ మా

త్రిపు దోషమును దేవర మన్నింతురని సాహసము చేసి యీ జాబును సమర్పించితిని" అని బదులు చెప్పి వాఁడు సకుఁ బోయెను. అంత నారాజేంద్రుఁ డాలేఖను విప్పిచూచి హర్షపరిప్లుతమానసుఁడై చెదరిన చిత్తముతో మరల నదువ నారంభించెను.

"శ్రీమన్మధ్యమధురామండల సామ్రాజ్యలక్ష్మి విరాజితు లైన ఛత్రసాల మహీపాల సార్వభౌములకుఁ బ్రభాకరుఁడు విష్ణుపదవర్తి యైనను దనకరప్రకరములచేతఁ బద్మినీహృదయముల కాహ్లాదము చేసినటులు భవదీయానమాన దయాప్రతాపాతిశయము సమస్తదిక్కుల వ్యాపించి మదీయ చిత్తంబు స్వాయత్తముఁ జేసికొనెను. రాజహంసి స్వర్ణమృణాళములనే భక్షించునుగాని యన్యమున కిచ్చగింపదు. రామసింహుని యాత్మజాతను. పేరు "ప్రసన్నముఖి" యందురు, తండ్రితోఁ దురుష్కుల నిర్బంధాలయమున నవయుచుంటిని. ఇచ్చటఁ గ్రూరుఁడై నరణదుల్లాఖానుఁ డనువాఁడు నన్నుఁ దస్కరింపఁ జూచుచున్నాఁడు కృపాసాగరుండవై, శ్రీకృష్ణుండు చైద్యునిబారిఁ బడకుండ రుక్మిణీదేవిఁ గాఁచినట్టులు నన్నుద్ధరింపవేఁడుచున్నాను. దేశోద్ధరణమునకై కంకణముఁ గట్టుకొన్న దేవర కధికముగ వ్రాయరాదు. అనేక రాజకార్య పరతంత్రులరగు దేవర కీలేఖను వ్రాసికొని శ్రమ గలుగఁజేసినందులకు భవదీయ పాదపంకజ సేవాపరాయణను క్షమింతురుగాక.",

అంతట శిరము పై కెత్తి యూర్ధ్వదృష్టి ప్రసారించి యాలోచన నభినయించెను. "ఆనాఁడు శ్రీప్రాణనాథయోగిపుంగవునిచేఁ జెప్పఁబడిన మహిళారత్న మీయామెయే, సందేహము లేదు. ఆహా! యేమి యీ లేఖన సామర్థ్యము. ఈ భావగాంభీర్యము. ఈ వినయోచితభక్తి ప్రాధాన్యము. ఈ వాక్యప్రౌఢిమ, ఈ రసపోషణము. ఆహా! దీనికి నిక్కముగా నల్లరాళ్ళే కరఁగవలెను. నాహృదయము కరఁగుట లెక్కలోనిదా? చంద్రకాంతశిలలు హిమాంశునికరములచేఁ జెమర్చిన ట్లుల, నాహృదయము దయామయమై యెప్పు డాసాధ్విని రక్షించి చేకొందును" అని పరిపరివిధములఁ బురోలంఘనములఁ జేయుచున్నది. ఆమునితిలకుఁడు చెప్పినదాదిగా నామె యెట్టిదో యని తపించుచుంటిని. నాపుణ్యవశమున నామెయే యమృతకల్పములైన భాషణములచేత నభిప్రాయగర్భితమైన లేఖ వ్రాసినది. ఇఁక నాకుఁ గొఱంత లేదు. కాని శాస్త్రవపట్టణంబున నుంటచే నేమియాపదలపా లగుచున్నదో యని, నాహృదయకోశము తటతటఁ గొట్టుకొనుచున్నది. సరే తగినవారిని పంపించి—కాదు కాదు- మఱొకరిఁ బంపుటకు సరిపడదు. ఆశ్రీప్రాణనాథయోగీంద్రులనే పంపి యామెను రప్పింపవలయును, లేకున్న నితరులు వెడలుటకుఁ దగిన పట్టణము కాదు కదా? యని తలంచి, ఓరీ యిటురా! యని సేవకునిఁ బిలిచి యీలేఖ నిచ్చినవానిఁ గనుఁగొని తోడ్కొని రాఁగలవా?

సేవ — మహాప్రభూ! ఆమాటలకు నే నేమని యుత్తరం బిత్తును? నే నీ లేఖను దమ కిచ్చినది మొదలుకొని వానిని దోడ్కొని రాకపోతిని గదా యని బెదరుచునే యుంటిని. అంతకుం దప్ప నే నేదియు నకార్యముం జేసి యుండ లేదుకదా? స్వామీ! మీకు హితమైనదే కదా? అపకారము కాదుకదా? ప్రభూ! చెప్పి నాయులమటం దీర్పుడు" అని భయముతోం బలుకువఱకుం గించిద్ధాసమును గండయుగళమును స్ఫురింపం జేసి ఓరీ! నీవు భీతిల్ల వలదు. నీవు మాకుం గొద్దియో గొప్పయో సంతోషమునే కలుగం జేసితివి కాని యపకారము సేయ లేదు.

సేవ — మహాప్రభూ! అట్లనుగ్రహించుటచేత నాశరీరములోం దిరిగి ప్రాణము లిప్పుడే చేరినవి. ఏనుంగునకుం గలిగినంతబలము వచ్చినది. మహారాజా! మీ సేవకుం డిప్పుడే కొండపిండి సేయుటకును, ఎట్టిపని సేయుటకును సమర్థుండే. దేవరకరుణయే ప్రాధాన్యము.

ఛత్ర — ఓరీ! నీ వేమిచేయం గలుగుదువురా! అట్లు పరితాపములం గొట్టుచున్నావు?

సేవ — మహారాజా! మీపూర్వపుసేవకునిగం దలంచుచున్నారు కాంబోలును. నన్ను నేం బాగుగఁ గోట తప్పవి వెనుదీయుచున్నానుగాని, దేవర కరుణాకటాక్షము పూర్తిగా నాయెడల నున్నచో గగనములోని వస్తువునైన నగ్నిమధ్యమున నున్న పదార్థమునైనను, పాతాళమున నున్న వస్తువునైనను గొనితెచ్చెదను. నేను గొ్రత్తవాండ నగుటచే

నా యంతరము నెఱుఁగకుందురు గాక. వేయేల! ఖడ్గమును బట్టుకొని రణమునకుఁ బోవుచున్నఁ బోయి రణ మొనర్తును. మహారాజా! క్రియకుఁ జెప్పెదను వినుఁడు. అన్నిటికిని మూలము మీకరుణ యున్నచో దేనినైనను బ్రసన్నునిగాఁ జేసెదను.

భర్త్రి—ఏమిరా! ఏదేవిని ప్రసన్నను జేసెదవురా!

సేవ—స్వామి! నాకు దేవి యని యొక్క పేరే తెలియునుగాని, ఆశక్తుల కన్నిపేళ్ళున్న నాకుఁ దెలియవు.

భర్త్రి—ఓరీ! అటులయిన ఢిల్లీకిఁ బోయెదవా?

సేవ—మహాప్రభూ! అదెంతపని చిటికలోనిదే.

భర్త్రి—పోయి యేమి చేసెదవు?

సేవ—దేవర యేమి సెలవిచ్చిన దానిని జేసెదను.

భర్త్రి—ఓరీ! అక్కడ నొకయింట నొకస్త్రీ యున్నది. ఆమె శత్రువులచేత బాధపడుచున్నదఁట

సేవ—కటకటా! దేవా! ఆమాటవినుటతోడనే నాకు గుండెలు బ్రద్దలైనవి మీవంటివారి హృదయము లెంత పరితపించుచుండెనో? ఆదుష్టతురుష్కుల మధ్యమున నాదేవి రాక్షసులనడుమ సీతవలె నెన్నియిడుములు పడుచున్నదో. మహాప్రభూ! ఆక్షణమే రక్షణము దేవరవారి కవశ్యాచరణీయము. తమయాజ్ఞ యైనచో మారువేషము వేసి మొట్టమొదట, శత్రుమండలిని గొండలనరణ్యములను దాఁటించి తోడ్తెచ్చెదను.

భర్త్రి—ఓరీ! నీ వాదేశ మెఱిఁగి యుంటివా?

సేవ—మహారాజా! నా కాదేశము కొట్టినపిండివం టిది. నే నెఱుఁగని రహస్యప్రదేశములు లేవు నే నాస్థలమందు నదృష్టహీనుఁడనై తురుష్కులనిరంకుశాధికారమునఁ గ్రుస్సుచు నొకరామసింగను క్షత్రియకులజుఁడు కలఁడు, వానిచెంతఁ గొన్నిదినములు సేవకుఁ గుదిరి యుండి, వారు తురుష్కభీతి చేతఁ దల్లడిల్లుచుండ—అక్కటా ! దేవా! నా కాసంగతుల న్నియుఁ దలఁపునకు వచ్చుచున్నవి పట్టరాని దుఃఖము కలుగుచున్నది చెప్పలేకుంటిని. మాట తడఁబడుచున్నది. స్వామీ! యేమి చెప్పుదును. వారియనుజ్ఞ లేకుండ నెవ్వరికిని ధనము భాగింపరాదఁట. ఎందులకును బోరాదఁట. ఇట్టియిక్కట్టులలోఁ బడి కట్టుకట్టకుఁ గట్టఁబడిన యేనుగుగున్నవలె నవయుచున్న నాతనిపాటులు చూచి సహింపలేక, యిఁక నిందుండరా దని లేచి యీదేశము వచ్చి సేవకవృత్తికి నేర్పైన నేమి యని, మీ సన్నిధానంబున నున్న నాగేంద్రునికిఁ బరిచయుండగుటచేతఁ, వానియమ్ముకొడుపు చల్లగనుండ—ఆపనికి నన్ను నియమించి ప్రభువుగారితో మనవిచేసెను.

ఛత్ర—ఓరీ ! నీవు రామసింగు నింట నేనా యున్నది.

సేవ—దేవా ! చిత్తము.

ఛత్ర—ఓరీ ! ఆరామసింగునకు సంతానము కలదా!

సేవ—స్వామి ! ఒక్క పుత్రికమాత్రము కలదు. ఆమె చక్కఁదనమున వర్ణింప శేషాహికైనను నలవి గాదు. ఆ మెముఖ మెప్పుడును శరత్కాల చంద్రబింబమును మఱపించు

నట్లుండుటచే నామెను ప్రసన్నముఖి యని చెప్పుదురు అమె సుగుణసంపదఁ గాంచి యనసూయాది మహాపతివ్రత లైనఁ దమగుణములను దిద్దుకొనవలయును. ఆమె చతుర్దశభువనమం దరి. అట్టి దయాస్వరూపవతి నే నెందుల గానను ఆమె లక్ష్మీదేవి యవతార మనుటకు సందేహము లేదు. నే నామెను విడిచి వచ్చి రెండు సంవత్సరము లైనది నాకుఁ దక్కిన వంతగాఁ దెలియదు గాని, యామె యొకచోటనుండి మఱియొకచోటునకు గదలినప్పుడు ఘుమ్మని తామరపువ్వుల వాసన కొట్టినది నా కాశ్చర్య మగునది. ఆబిడ యేమహారాజును జేపట్టునో కాని యాయన భూచక్రమెల్లఁ దా నే యేలఁగలుగును సందేహము లేదు.

భర్త—ఓరీ ! నీవు పోయి యామెను దీసికొనిరాఁగలవా ?

సేవ—మహాప్రభూ! ఆతల్లి యగ్నిహోత్రమువంటిది. నాబోటి యల్పులు పోయిన రాఁజాల దని నాతలంపు నే నొక్కఁడనే పోయి ప్రభువుగారి సెలవైన దని చెప్పిన, నామె కాగ్రహ మే యొదవినచో మాడిపోవుదును ”

అనునంతలోఁ గవాటము చెంత నొకఁడు నిలిచి“దేవా! జయము. జయము.” అనిసంతోషమున నఱచెను. ఆపల్కు లాకర్ణించి ప్రభువు వానికిఁ దలుపుఁ దీయు మని సంజ్ఞ చేసెను. సేవకుఁడు పోయి తలుపుఁదీయ నొక్కభటుఁడు ప్రవేశించి“మహారాజా ! ఢిల్లీనుండి వచ్చిన ఫిదాయీఖాను మనగణపతిసిం

హాదియోధవీరుల తీవ్రాగ్నికి మాడిపోయి, చావఁగ మిగిలిన వారినిఁదీసికొని తమపిక్కబలమును జూపించి ఢిల్లీకిఁబాఱిపోయి నాఁడు.

ఛత్ర—ఓరీ ! సంతోషముం జెప్పితివి. ఈవార్తఁ బురంబునఁ జాటఁబంపుము. గణపతిసింహుఁ డెక్కడ ?

భటు—మహారాజా ! వారందఱు సుఖులై వచ్చుచున్నారు.

అని చెప్పఁగవిని మహారాజు సరే పొమ్మని భటునిఁ బంపి ఓరీసేవక ! మరల మాటలాడవచ్చును. పొమ్మని చెప్పి తన సభాభవనమునకు దుస్తుల ధరించి వెడలెను.



## పండ్రెండవ ప్రకరణము.

### విలువిద్యాప్రభావము.

అభ్యాసనవశమున నలవడని విద్యలు లేవు. తొల్లి యేకలవ్యుఁ డనుయెఱుకలవాఁడు ద్రోణాచార్యునివంటి విగ్రహమును మృత్తికతోఁ జేసి, యొక్కచో నునిచికొని యాబొమ్మకు నిత్యము పూవులతో గురుభావముతోఁ బూజించుచు, ధనుర్విద్యాపారంగతుం డైనవాఁ డని పురాణములోఁ జెప్పఁగా మనము చదివియేయున్నాము. కాని యట్టి పట్టుదలతో భక్తితో మరల నాచరించి యస్త్రప్రయోగాది

మహావిద్యల నందినవారిని గుఱించి చదివి విని యుండ లేదు. అందువలన మన చదువులన్నియు రసనాగ్రగతములై హృదయము ననుసరించి సార్థకత్వమును బొందక గాలికిఁ బోయినవని తలంపవలసి యున్నది. ఒక్కనాఁడు వింధ్యారణ్యములో మువ్వురు చెంచువాండ్రు విల్లునమ్ములును ధరించి యొక వృక్షాగ్రశాఖాపత్రమున లక్ష్యముంచి బాణమును సంధించి మరలఁ గన్నుల మూసికొని యాపత్రమును నిమిషమాత్రమునఁ దుంచుచు, శబ్దము ననుసరించి కొట్టుచు, నిట్లనేక ప్రకారముల శరవిద్యానైపుణ్యమును జూపుచుండ నందొక్క చెంచువానికిఁ బక్కన యిద్దఱును నమస్కరించి "యన్నా! మేము గోచిపెట్టినదాది విలువిద్య నేరిచియుంటిమి. నీవు మా ప్రయోగముల నొక్కసారి చూచి నేరిచికొని మాకు గురువవైతివి. నీయట్టి బుద్ధికుశలత మాపల్లెలోని వారలకేకాక యీ వింధ్యారణ్యవాసులలోని యేజాతివారలకును లేదు. అన్నా! నీవు మాపుణ్యవశమునఁ జెలికాఁడవైతివి గురువవైతివి దైవమవైతివి. కావున మమ్ముల నేలికొనుచు, మమ్ములఁ బాయక యరణ్యప్రాంతములవారికెల్ల రాజవైయుండుము" అని చేతులు మొగిడ్చిరి. అంత నాకృత్రిమపుఁ జెంచునాయకుఁ డొక్కసారి ముఖమండలమునఁ జిఱునవ్వు నొలికించి "సోదరులారా! మీ రట్లనవలదు. మీరు నాకుఁ బ్రాణదాతలు మీ మేలు నా మేనం బ్రాణము లున్నంతవఱకు మఱవఁజాలను. మీ రెల్లరు నేను చెప్పినట్లు వినుచు, నే

నెక్కడకుఁ బోయిన నక్కడకు నచ్చుచుండెను. తొల్లి శ్రీరాముఁడు రావణవధార్థమై పవిత్రములచేత సముద్రమును బంధించినప్పు డొక్కయుడుత దేశక్షేమం బెంచి యుడయించిన శ్రీరామచంద్రునకు సహాయముగ సముద్రోదకమున మునిఁగి మరల నిసుకలోఁ బొరలి యామీఁద నంటిన యిసుకను వారిధిలోఁ దులిపి, పెక్కుసారు లిట్లు చేసి; వారిధిగట్టుటకు సహాయము చేసి ముక్తిఁ గాంచినది. అటులే మనము జన్మించినందులకు దేశమం దున్నక్రూరులసంహరించి, దేశోద్ధరణము సేయఁగలగంకణమును గట్టుకొని; రాజచక్రమునకు సహాయమొనర్పవలయును. ఇప్పుడు ప్రస్తుతము మహాసంగ్రామసమయము. ఢిల్లీచక్రవర్తియైన యౌరంగజేబను మొగలాయిప్రభువు మధ్యహిందూదేశమును బాలించు ఛత్రపాలుఁడను రాజపూత్రాండునితో రణము సేయుటకు సంకల్పమును జేసి ప్రారంభించినాఁడు. అనుటతోడనే యాందొకఁడు "అన్నా! అన్నా! నీమాట కడ్డువచ్చితి, నించుక తాళుము కొలఁది దినములక్రిందట నీసమీపముననే తురుష్కులకును రాజులకును గొప్పయుద్ధము "జరిగినది" అని చెప్పవఱకు—ఏమి! ఈ సమీపమున నేనా'' యని యాతురతతో నడిగెను.

చెంచులు—ఆ యిక్కడనే చూడవచ్చును రమ్మని చెప్పి కొంపోయిరి. మువ్వురు నారణభూమి కనతిదూరమునకుఁ బోవఁగనే రణనిహతులైనవారి కళేబర మాంసభక్షణము

నక్కై మూఁగిన నానాజంతువులయార్భటములను మఱియు గ్రామబంధుముఃఖాది పక్షికుల కోలాహలమునను, బట్టరానిదుర్వాసనల చేతను జేర శక్యముగాక సమీపమునకుఁ బోవక దుర్దర్శసంబాటచే మరలి యక్కడ నున్న కొండవాగునకుఁ బోయిరి. అచట నొకరక్తసిక్తమయిన కవచమును జూచి, పరీక్షిలించుచుండఁగ నది తనతండ్రిగారి దని స్పష్టమయ్యెను. కన్నులనుండి బొటబొట నశ్రువులు ముత్యములట్లు రాల, "అన్నా!" యిదేమని చెంచువాండ్రు నివ్వెఱపడఁ జొచ్చిరి. అంతకంతకీచెంచులజేని కన్నీరు కాల్వలై కాఱఁజొచ్చెను. "అన్నా! నీవేడువకుము. మాకు నేడ్పు వచ్చుచున్నది కాని మేము నిన్నోదార్పఁజాలము. నీయట్టి ధైర్యశాలియే యిట్లు శోకమునకెడ మిచ్చిన మేమేమి సేయఁగలము?" అని యోదార్చుచుండ నెట్టకేలకు ధైర్యముఁ దెచ్చుకొని "సోదరులారా! ఈయుంగవేష్టనము నాజనకునిదిగఁ గన్పట్టుచున్నది. ఇంతవఱకు ఢిల్లీశుని యనుబంధమున నుండి వారి యాజ్ఞచేత క్షత్రియుల పైకి రణమునకు వచ్చియున్నాఁడు ఆయాహవంబున నాజనకుండును వీరస్వర్గమునకుఁ బోయియుండును. లేకున్న నీ చొక్కా యిట్లు రక్తసిక్తమయి పడియుండ నేల ? హా ! దైవగతి! అని చెప్పుచు నేడువఁదొడఁగె.

చెంచు—అన్నా ! నీకేమి వెఱ్ఱియెత్తినదా ? కళేబరము కనఁబడకుండ మరణించిన ట్లెట్లూహింతువు ? ఇంతకు నది నీతండ్రిదే యని నిశ్చయింప నేల ? దానిఁ బోలుకవచ

ములు వేఱుగ నుండఁగూడదా? నీవు తండ్రిమీఁది ప్రేమాధిక్యమునం జేసి యాపదను శంకించుచున్నావు కాని యుద్ధమం దు రక్తనుయమగుట చేత నీవి నిట విసర్జించి పోయియుండును. అదిగో! అదిగో! చిలుకలు కూయుచున్నవి నామాట నిశ్చయ మని నమ్ముము. నీతండ్రి సజీవిగా సుఖిగానై యున్నవాఁడు. ఆ తోట మాఁటఁ చిలుకలు కూయుచున్నవి. అదిగో! చూచితిరా! మరల చిలుకలు నుశకునమును జెప్పుచున్నవి

అంత నాచెంచులతేనికి నెడమకన్నదరఁ జొచ్చెను. అందువలన దుఃఖమును విడిచి మనసు స్వస్థపఱచుకొనెను. అన్నా! లెమ్ము పోవుదమని మిత్రులు ప్రబోధించిరి. అంతటఁ దండ్రి నిక్కముగ సజీవిగానె యున్నవాఁడని కృతనిశ్చయుఁడై వారితోఁ గలసి పోవుచుండెను కొంతవఱకుఁ బోవు వఱకు గుఱ్ఱముల సకిలింపులు వినవచ్చెను. అంత నాచెంచుల తేఁ డాలకించి, "తాళుఁడు తాళుఁడు. ఆశ్వికసైన్య మేదో వచ్చుచున్నది. మన మెదుటఁబడరాదు" అనునంతలోఁ దురంగఖురముల చప్పుడు చెవులఁబడెను. అంత నాతేఁ డాతురతతో "అన్నలారా! రండు రండు. మన మాసమీపమునకుఁ బోయి దట్టముగ బైలువెడలి నీరంధ్రమయిన యాపపొటిచెట్ల తోఁపులో నడఁగి వీరల మచ్చమాపుద మని ముప్పురును మఱుఁగునఁ బోయి మార్గమునకు నేఁబదిగజములదూరములో నున్న పొదలో నడఁగిరి. అంతటఁ బదుగురాశ్వికులు తమ

గుఱ్ఱముల నడపించుకొనుచు నతిత్వరితముగఁ బోవుచుండిరి. వారలఁ దుష్కృతులుగ భావించి కొంచెము ముందుకుఁ బోవ నిచ్చి తమ్ములారా! యిప్పుడు మీశక్తిని జూపవలయును. ముందుగ నశ్వముల కాళ్ళు తెగునట్లు లర్ధచంద్రనామకోలలను బ్రయోగింపుఁడు. అంత వా రాశ్చర్యపడి క్రిందఁబడి వెనుకకుఁ జూతురు. పిమ్మట వారల కర్ణరంధ్రములకును నోటికిని గుఱిచేసి తక్కిన యులుగుల వదలుఁడు. త్వరపడుఁడు" అనుట తోడనే "రింగురుని" కంఠదీగలధ్వని వెడలినట్లు ఝుంకార మొక్కటి కర్ణరంధ్రములఁ జొచ్చినది. ఇదేమి యాశ్చర్యమని యాపదువురును వెనుకకు మొగములఁ ద్రిప్పి చూచిరి. అంతటఁ బదిగుఱ్ఱములు నొక్కసారి కృత్తచరణములై ధరను ద్రొగ్గతిలఁబడెను. వానిమీఁదనుండి దౌతులుతికిసలు కెలంకులఁ జూచుచున్నంతలోఁ గొందఱు కంఠములు తెగి నేలపాలైరి. తక్కినవారు ఖడ్గహస్తులై బాణములు వచ్చు మార్గమును గని పెట్టి పరుగెత్తుకొని వచ్చుచుండఁ దిరిగి యులుగులవాన కురిసెను. వారును మొదటఁ గూలినవారితోఁ బాటే మృత్యువును వరింపఁబోయిరి. అనంతరమునఁ జెంచులు వారిని సమీపించి ఖడ్గములఁ గైకొని ద్రవ్యమును వేసికొని యాతురంగ తురుష్క కళేబరములను దత్ప్రాంత నిర్ఝరిణిలోఁ బాఱవైచి స్నానముఁ జేసి తమపల్లెకుఁ బోయిరి.



ర్పు రేవున నొకపురుషుఁడు స్నానం బాచరించి, సూర్యునకర్ఘ్య ప్రదాన మొనరించి సంధ్య వార్చి వెంట వచ్చిన సేవకుని చెంత నున్న ధౌతవస్త్రముల ధరించి, నావ నారోహించి యావలి యొడ్డునకు దాఁటెను. అచ్చటఁ దత్పూర్వమే స్నానాదికృత్యముల నెరవేర్చి యొకయశ్వత్థవృక్షమున క్రింద దేవీధ్యానపరాయణుఁడై నిమీలితనేత్రుండై బవిరిగడ్డముఁ గల యొకమహానుభావుఁడు గూర్చుండెను ఆయన ముఖము భయంకరమైనది. పొడుగైన నాసికయును బలిష్ఠములైన కండలు దేహ గాంభీర్యరసమును వెదఁజల్లుచుండెను, ఎఱ్ఱతామరరేకులవలె నొప్పారు కన్నుఁగవయుఁ గలవాఁడు. ఆచిహ్నములను బట్టియు, చెంత నున్నవారివలనఁ దెలిసికొనియు నాయనను శివాజీ ప్రభువుగ నెఱింగి యూవచ్చిన ఛత్రసాలమహీపాలుఁడు సాష్టాంగ ప్రణామము చేసి చేతులు కట్టుకొని నిలిచెను. కొంతసేపునకు దేవీధ్యానము చాలించి కన్నులు విప్పిచూచెను. మరల ఛత్రసాలుఁడు నమస్కారము జేసెను

శివా—ఓయీ ! నీ వెవ్వఁడవు ?

ఛత్ర—స్వామీ! నేను చంపతిరాయుని పుత్త్రుఁడను.

శివా—ఓహో ! ఛత్త్రసాలుఁడవా ! వత్సా! సంతత దేశభక్తి పరాయణో భవ! ఛత్రసాలమహీపాల! నీయుద్యమమును నే నెఱుంగుదును అయ్యది సర్వజన సమ్మతము. భవసాగర తారకము. సకల సౌఖ్యప్రదము. సంతతాహ్లాదకారణము. అసామాన్యమైనది. అట్టిబుద్ధి యీశ్వరాంశ కల వారల

కుఁ గాని కేవలమానవులకుఁ గలుగనేరదు. మహావృక్షము విపులశీతలచ్ఛాయలచేతఁ బెక్కుజీవకోటులకాశ్రయమైనట్లు నీ వనేకసరసాలురకు మనుష్యకోటికి నిగుపేదలైన యాటవికు లను నబలలకుఁ దురుష్కావమానాగ్నిచేతఁ బరితపించు స్త్రీ లకు, సాధువులకు, నీవే యాశ్రయమవు. సంపూర్ణమైన మనో ధర్మము, నఖండమైన బుద్ధివైభవము, నోజశ్శక్తియుఁ గలిగి, "అహం బ్రహ్మేతి" న్యాయమున నీ వీశ్వరుఁడవై, యజ్ఞానా ధకారనిమగ్నులైనవారికి బోధించి, యజ్ఞానధ్వాంతమును దొలఁగించి, వారలను దివ్యచక్షువుల నొసంగి, సమస్తజనులను మోక్షమార్గావలంబులుగఁ జేసి, స్వధర్మప్రతిష్ఠాపన మొన రించి, "నాబిడ్డలు మూఢులు, అజ్ఞానులు, అప్రయోజకులు, పారతంత్ర్యనిబద్ధులు, ద్విపాదపశువులు--అని నిరంతరము శో కించుచున్న భారతమాతకును శోకమును జల్లార్పుము. ప్రా ణభీతియు నస్థైర్యము ననునది స్వప్నమందుఁ దలంపకుము. ఝంఝూమారుతమునకు జీమూతసంఘములు విచ్చునట్లు నీమం డలమున నీవిజ్ఞానతేజఃపుంజముచేత, సర్వత్ర వ్యాపించియు న్న యస్థైర్యమును గాల్చివేయుము. సకలజనుల నీశ్వరతత్వము కలవారినిగఁ జేయుము. మనజన్మములు మనము సకలవిధభ త్యాన్నములభుజించుటకని తలంపకుము. దేశక్షేమమున కని తలంపుము. ఆనందము భగవత్స్వరూపము. దేశమునం దానందము తాండవమాడుచుండ, భగవంతుఁడు దేశమంత ట నిండియుండు నని తలంపుము. పారతంత్ర్యము శోకకారణ

ము. అట్టిశోకము మృత్యురూపము గావున శోకాకరమైన పారతంత్ర్యము నీప్రభావమునఁ బటాపంచలుగఁ జేయుము. మనము జన్మించుట తల్లిదండ్రుల కానందము గొల్పుటకే కాదు. తల్లినిగన్నతల్లియైన భారతమాత కానందముఁ గొల్పుటకుఁగాఁ దలపోయుము. మాతృదేశతాతృప్తికిఁ జాలినధర్మము దేహికి మఱొక్కటి లేదు భవరోగలతావిచ్ఛేదనమునకు మాతృసేవయే తగిన లవిత్రము. వేయేల ? మాతృదేశసేవకుఁ దగిన తరుణోపాయము మఱొండులేదు కావున నోక్షత్రియకుమార ! నే ననుభవముచేతఁ జెప్పుచున్నాను; వినుము. నేను బ్రథమున స్వదేశోద్యమమున కారంభించునప్పటికి నాచెంత నొక్క కాసైన లేదు తల్లిడియా వ్యతిరేకము నా కొక్కతల్లియే గురునైనను దైవమయినను దల్లియైన నామెపరిబోధముచేత నే యీయుద్యమమునకుఁ గడంగితిని. నాకుఁ దొలుత వళ్లెలను కొండవాండ్రు సహాయులైనారు. క్రమముగ వారలతోసూతఁ జేత నే తొలుత తోరణఖిల్లాను స్వాధీనముఁ జేసికొని స్వరాజ్యప్రారంభమునకుఁ బ్రథమతోరణముఁ గట్టితిని. అది బాగు చేయుచుండఁగ నే భవానీదేవికృపవలన నాభూమిలోపల నమితమైన ద్రవ్యము దొరకినది. క్రమముగ దుష్టతురుష్కమండలి నోడించి సుమారేఁబదికోటలవఱకుఁ గట్టి గోవధమును మాని స్త్రీలఁ జెఱపట్టు దురాచారమును మాన్పించి, యట్టి దురాచారములకుఁ గడంగిన శివాజీ యెప్పుడు వచ్చి యేయపాయమును జేయునో యనుభీతి ప్రతితురుష్కుని హృదయమున గాఢ

ముగా నల్లుకొనునట్లు చేసితిని గావున నీవు నట్లే ప్రవర్తింపుము. ప్రభాకరుని తేజము వృక్షచ్ఛాయలయందును, హృదయకుహరాంతరాళములను బ్రవేశింపదు. నీ తేజము ప్రతిచోటను, ప్రతిమనుజుని హృదయాకాశమునను బర్వతగుహాంతరములను బ్రసరింపవలెను. వేయి చదువనేల ? దేశోద్ధరణమే యీజీవయాత్రయందలి సత్యము. దేశసేవయే నీకన్నపానములు. దేశీయదాస్యమే నీసుఖము. దేశానందమే నీ కానందము మనము దేశోద్ధరణమునకే పుట్టితిమి. కావున దేశమునకొఱకే చావవలయును" అని శివాజీ ప్రబోధించుచుండగ కేవలపరబ్రహ్మసందర్శన మొనరించిన మహాయోగికైనవీ దేహమును మఱచి యానందాశ్రుపరిప్లుతచక్షుర్యుగళుండై ద్విగుణీకృత దేహుండై కన్నుల నొక్కసారి మూసికొని, పక్షములచేత బాష్పములను విదిల్చుకొని "మహాత్మా! సాష్టాంగదండ ప్రణామమును జేయుచుంటి. దేవా ! గోబ్రాహ్మణపరిపాలక దూరీకృత సకలదేశారిష్ట, దేశభక్తాగ్రేసర! భవదీయ జ్ఞానోపదేశమునం జేసి ధన్యుండనైతిని. నాయజ్ఞానాంధత్వము తావకజ్ఞానోపదేశాంజనమున నూరీకృతంబయ్యె. తుదకీశ్వర విలాస మెట్లు జరుగునో కాని నాశక్తివంచన లేక ప్రయత్నించెదను. మహాత్ముండు శ్రీ సాంబనాథయోగీంద్రుని కరుణచేతఁ గించిజ్జ్ఞానావశిష్టుండనై వ్యవహరించుచుంటిని. ఆమహామహుండే మిమ్ము సందర్శింపుమని, యానతిచ్చుటచే వచ్చి భవదీయపవిత్రముఖదర్శనలాభము నందితిని.

శివా—ఓయీ! నీయుద్యమములు నీయరణ్యసంచారమువలన జ్ఞానప్రబోధములు. నానారాజసమీకరణ శక్తియు నీతెలివి నీనైపుణ్యమును గర్ణాకర్ణిగ వినుచున్నది. మొదలు నిన్నెన్నఁడు చూతు నని నిక్కముగా జపప్రతిమానముగఁ దలంచుచుంటిని కాని యనేక రాజకార్యపరతంత్రుఁడనై గడియయైనఁ దీరిక లేకుండుటచేత, నింతకు మున్ను నిన్నుఁ జూచుభాగ్యము చిక్కలేదు. కాని ఢిల్లీచక్రవర్తి కార్యదృష్టి ప్రసాదము నామీఁదఁ దగ్గినది. ప్రస్తుతము నీమీఁద నున్నది. నీ వొక్కగడియయైన నేమఱియుండరాదు వాఁడు బహుయుక్తిపరుఁడు, ద్రోహి, మోసగాఁడు. వాని మాయావిలాసములు దురవగాహములు వాని మాటలమృతనిష్యందములు. నీవు స్వప్నమునందైన వానిమాటలయందు విశ్వాసము నుంచరాదు సుమీ. వాఁడు మిక్కిలి కపటహృదయుఁడు. వాని మాటల కన్నిటికిని నీవును గపటమును వహించి సమ్మతించినవానివలె నటించి నీయుద్యమమును నీ వెప్పుడు నేమఱియుండరాదు. వానికపటనాటకము నాచెంత సంపూర్ణముగఁ బ్రదర్శింపఁబడినది. కాని తత్సర్వము వ్యర్థము చేసితిని. నీ విఁక నీ కార్యములకుఁ బొమ్ము. నేనును నానెలవునకుఁ బోయెదను.

ఛత్రసాలుఁడును వెంటనే తిరిగి భీమానదిని దాఁటి మరల వచ్చెను.



## పదునాల్గవ ప్రకరణము.

### రణదుల్లాఖాన్.

ఢిల్లీపట్టణమున నొకభవనమునఁ గుర్చీమీఁద నొక పురుషుఁడు కూరుచుండి యొకసమువంకఁ జూచుచుఁ గుడిచేత మీసము నదేపనిగా మెలి పెట్టుచు మధ్యమధ్య బుసకొట్టుచుఁ దల పంకించుచు నేదియో యాలోచించుచుండెను. అతని ముఖము మిక్కిలి భయంకరమైనది. ఎఱ్ఱనిమైచాయ గలవాఁడు. కన్నులు మేడికాయలవంటివి, ఎఱ్ఱగనుండును. హృదయము మిక్కిలి క్రూరము. చచ్చినను సరియేగాని పట్టినపట్టువిడువననుదీక్ష గలవాఁడు ఆహా! అట్టి పట్టుదల సత్కార్యములయందుండిన నెంతబాగుండును? అట్లెప్పుడు నుండదు. పరభార్యాతస్కరణమున నుండుపట్టుదల భగవంతుని కైంకర్యమునందుండునా? పచ్చి మిరియము కొత్తిమిరియు వేసి నూతి కమ్మగఁ బాగుపు పెట్టిన చింతపండు పచ్చడియందున్న ప్రేమ చప్పని పెసరపచ్చడి యందెట్లుండును? కాని క్రూరచిత్తుల కట్టితీవ్రమైన పదార్థముల సేవించుపట్ల నాహ్లాదము నొందు. సాధుస్వభావులకు శాంతపదార్థసేవనయందభిలాష మిక్కుటము. కావున నీ పురుషున కనార్యకార్యములయందు మిక్కిలి పట్టుదల కలదు. ఈపురుషుఁ డెవ్వఁడో మీరు కొంచె ము

హించుకొనిన రణదుల్లాఖానుఁ డని తెలియకపోదు. ఎవ్వఁడు సీతను రావణాసురుఁడు కోరినట్టులఁ బ్రసన్నముఖిదేవికిఁ దన్ను బెండ్లియాడు మని వర్తమానమంపెనో, ఎవ్వఁ డామెచే నిరాకరింపబడి దురభిమానంబునఁ బ్రసన్నముఖితండ్రి యైన రామసింగును ఛత్రిసాలుని మీఁదికి యుద్ధమునకుఁ బంపఁ జక్రవర్తిచేత శాసనమును బుట్టింపఁ జేసెనో, యెవ్వఁడు రామసింగు గృహమును దోఁపించి ప్రసన్నముఖిని దస్కరింప యత్నించి తెక్కలికాండ్రను బంపించి వారి నామెచేతఁ జంపించి పరాభవింపఁబడెనో, మరలఁ బ్రసన్న పాఱిపోయిన దని చింతించి యామెను దోడ్కొని వచ్చుటకుఁ బనిమంచి గుఱ్ఱపురౌతులను బంపి వారల రూపు లేకుండఁ జేసికొనెనో, యట్టిను హామతిమంతుఁడు రణదుల్లాఖాను నెఱుంగుదురుకదా ? వాఁడిట్లు తనలో నేదియో యోచించుచు, నిట్లనుకొనుచున్న వాఁడు "ఔరా ! ప్రసన్న యెంతలో మాయమైనది. పోయిన వారల రూపమైనఁ గనఁబడలేదు కదా ! ఎంత వింత? వారల నెవ్వఁడు చంపెను? బందిపోటుతస్కరుల నెవ్వఁడు చంపెను? నా కాశ్చర్యముగ నున్నది. ప్రసన్న చంపిన దని తలంతున న్న, నాఁడుది యేమి యింతమందిని జంపుట యేమి? తరువాత నడవిలోనికిఁ బోయినవారి రూపములే కానరాకున్నవే. ఆహా ! యేమినాయము? ఆమె నాకెట్లు దొరకును. దొరకనిచో నీరణదుల్లాఖానుని బ్రతుకు వ్యర్థముకదా ? ఆయెలనాగ క్రైపోయిన యాశ్వకు లున్నది లేనికూడఁ దెలియకపోయెఁగదా?

ఒకవేళ వా రెవ్వరని చేరనైన మడిసినచో వారితో నాయ ల్లునిఁ గూడ బంపితినే! అక్కటా! వాఁడు చచ్చినఁ గూతు రు ముండమోయునుగదా? పోనిమ్ము దానికిఁ దిరిగి నిఖా కట్టింతునుగాక. తా వలచినకాంతను బల్మిమైఁ దెచ్చుట కల్లు నిచంపించినాఁ డన్నయపకీర్తి నాతలను బడునుగదా? హుం. నాకోరికతీరుట యే నాకుఁ బ్రధానముగాని యపకీర్తి గిపకీర్తికి వెఱవను" అని నిశ్చయపఱచుకొని తిరిగి "యామెను దోడ్కొ ని వచ్చుట కెవనిని బంపుదును, లేక నేనే పోవుదునా? నా యట్టివాఁ డా సేవకుఁడై భటవృత్తికిఁ గూడ సిద్ధపడిన వలుగురు నవ్వరా?" అని యాలోచించు నవసరంబున నెవ్వఁడో తలుపు తట్టెను రణదుల్లా యెవరని పలుకరించెను. నేను హెజీరుద్దీను నని ప్రత్యుత్తరము వచ్చెను. వేగఁ బోయి తలుపుఁ దీసి, ఓయీ! కార్యమున నేమున్నది. ఫత్రిసాలునిమీఁదికి యుద్ధ మునకుఁ బోయిన పిదాయీఖా నోడిపోయి పాఱివచ్చినాఁడు" అని నుడివెను.

రణ—ఏమి బ్రతికివచ్చినాఁడా?

హె—అట్లువచ్చినవారు పిదాయీతో పదియేగురు మాత్రమే.

రణ—తక్కినవారో?

హె—తక్కిన వారందఱు స్వర్గము చూడఁ బోయి నారఁట.

రణ—వచ్చునపుడు వారికిఁ బ్రదన్న కనఁబడినదేమో!

హా—చచ్చునప్పుడు సంధ్యమంత్రమని ప్రాణములు దక్కించుకొని బయలుపడుటయే చాలును. ప్రసన్న యోడిన దన్నుకే గావలయునని? ఇపుడు తిరిగి నీవు యుద్ధమునకుఁ బోయెదవఁట. అట్లు పోయి నీభార్యమంగళసూత్రపుకుహింము బ్రతికితివేని యుడవృలన్నిటిని వెతకి ప్రసన్న యెచటను దో కాంచి పోయిన వారివలెఁ గృతార్థుఁడవయ్యెదవు కాక"

అని చెప్పునంతకు రణదుల్లాఖాను, "ఏమేమీ! నే నీసారి యుద్ధము సేయుటకు నాజ్ఞ యయినదా? అందులకు నేను సర్వసిద్ధముగ నుంటిని" అని చెప్పునంతకు, హేజీరు, "అయ్యా! దేశాధికారపత్రిక, సేనలన్నియు, సిద్ధముగాఁ బ్రయాణముకుంద నున్నవి. ఇఁక మీదే యాలస్యము" అని పత్రిక నిచ్చెను.

రణ—నేనాలస్యము సేయను. నా కార్యమును గూడ సమయమునఁ జక్కఁబెట్టుకొనెదనుగాక.

హా—సరేపొమ్ము. అని చెప్పి హేజీరు వెలుపలకు రణదుల్లా లోపలికినిఁ బోయిరి. "ధణధణ" మని రణభేరి మ్రోగుచుండెను.



# పదియేనవ ప్రకరణము.

---

## పురుషుఁడు.

ఒకనాఁటి మధ్యాహ్న కాలమున ఢిల్లీపట్టణమున నొక మనుజుఁడు కడువేగముతోఁ బోవుచుండెను. కాని తిన్నఁగఁ దన వేషము నానవాలు పట్టుదురేమో యని జంకుచు,నిటు నటుఁ జూచుచుఁ బోవుచుండెను. అంతటఁ గొందఱు తిన్నఁగఁ గినవా రెదుట వచ్చుటఁ గనిపెట్టి తన్నుఁ బలుకరించి మాట ధ్వని నానవాలు పట్టుదురేమో యని తలంచి లఘుశంకకుఁ బోయినటులఁ గొంచెముదూరముగఁ బ్రక్కకుఁ బోయి కూరుచుండెను. అంతట వారు వారిత్రోవను బోయిరి. తిరిగి యాపురుషుఁడు లేచి పోవుచుండ నొకయువమాయికుఁడైన కాపువాఁడు, రామసింగు గృహమునకు సమీప నివాసియైనవాఁడు, పొలమున కన్నగారి కన్నయును గొనిపోవుచుండ వానిని గాంచి, ఓయీ ! నీ వెక్కడికిఁ బోవుచున్నావు. నీతో నొక్కమాట మాటాడవలసి యున్నదని మార్గము విడిచి కొంత దూరము ప్రక్కకుఁ గొంపోయి యిట్లు మాట్లాడఁదొడంగెను.

పురు—ఓయీ ! మీయిల్లు రామసింగు గృహమునకు సమీపము కాదా ?

కాపు—అగును. నన్నెఱింగి నట్లుతే మాటలాడు చున్నావే ;

పురు—రామసింగు, ప్రసన్నముఖియు నింట నున్నారా?

కాపు—రామసింగు యుద్ధమునకుఁ బోయి చచ్చినాఁడు. రామసింగు యిల్లు వెడలఁగనే వానియింట బందిపోటు పడియె. ఆదొంగ లేమిహేతువ్వొ కాని తెల్లవాఱునంతకు చచ్చి పోయి పడియున్నారు. ఆమె యాదినము మొదలు కనఁబడుట లేదు. కొందఱు చచ్చిన దనియు, మఱి కొందఱు పాఱిపోయిన దనియు, పదిమంది పదివిధములుగఁ జెప్పుకొను చున్నారు. నిజమేమొ నాకుఁ దెలియదు

పురుషుని ముఖము దైన్యమునకు స్థానభూతమైనది. కన్నులనుండి నీరు బిరాన క్రమ్మి వెలువడఁజొచ్చెను.

కాపు—ఏమి! యేడ్చెదవు నీకు బంధువులా యేమి ?

పురు—ఆ! అటులే. నీవు నీదారినిఁ బొమ్ము.

అని చెప్పెనుఁ కాపువాఁడు తనమార్గమును బట్టెను. అంతటఁ గొంతసేపటికి ధైర్యము దెచ్చికొని యుత్తరీయము శిరముమీఁదఁ గప్పుకొని, మెట్టటులో తనగృహమును జొచ్చి తనతల్లి నడుగఁగా నామెయు నటులే చెప్పెను. అంతటఁ గీల్పాడిన జంత్రపు బొమ్మవలె సోలి తల్లి నేదదేర్పఁ గొంతసేపటికి లేచి, “హా! ప్రసన్నా! నీకొఱకై పడరాని శ్రమలను బడినాముగదా ? అదియంతయు నిష్ఫల మయ్యెనే. అయ్యో! నిన్నిఁక జూచుభాగ్యము నాకు లేదా? నాఁడే కడసారి దర్శన

చూ ! అక్కటా ! నిన్నెన్ని శ్రమలయినం బడి తోడ్తెచ్చెద నని యామహీపాలునకుం జెప్పి వచ్చితినిగదా. ఇప్పుడు నే నేమని చెప్పుదును. బ్రతికి యుండి తురుష్కులచే నలయుచుంటి వని చెప్పుదునా లేక పంచత్వము నొందితి వని చెప్పుదునా. ఏమియుం దోచదయ్యెను గదా." యని పరిపరి విధముల విలపించుచున్న కూంతును చూచి, "ఏమే యిట్లేడిచెదవు ! దైవమట్లు చేసినప్పుడు నీవేమి చేసెదవు? నీభక్తిని నీస్నేహమును గనంబడి, మూడుకాళ్ళ ముసలిముండను నన్నింట విడచిపెట్టి, పులి యనక భూతమనక, కొండలనక, కోనలనక, యరణ్యములనక, యదేపనిగా నామెకార్యమునకై పోయి నీవు పడవలసిన పాటులన్నియుం బడినావు నీవు వచ్చువఱకు, నామెయే యంతరించినది. ఆమె ప్రాప్తమట్లుండ నీవేమిచేసెదవు ? ఇకం జాలు నూరకొనుము ఆమెపై వెఱ్ఱివెఱ్ఱి ప్రేమలు మానుము. ఇంటం బడియుండి నా కింతగంజి కాచి పోయుచుండుము." అనితల్లి చెప్పిన మాటలకొక చెవి యిచ్చి తనలోం దా నిట్లని తలంపం జొచ్చెను. "అప్రసన్న లేని బ్రతుకొక బ్రతుకా. ఆహా! ఆమె చెల్మివంటిది వేఱొకటి దొరకునా? నేను నిర్భాగ్యురాలను, లేకున్న నామెయెడబాటు నాకేల కలుగును? కానను నీరాత్రి యీపుర సమాచారంబును బూర్తిగం దెలిసికొని, యామె మాఱువేషముతో నేవనములలోనైన సంచరించుచున్న దేమో కనుంగొందునుగాక" యని నిశ్చయించుకొనెను.



కాపు—అగును. నన్నెఱిఁగి నటులే మాటలాడు చున్నావే ;

పురు—రామసింగు, ప్రసన్నముఖియు నింట నున్నారా?

కాపు—రామసింగు యుద్ధమునకుఁ బోయి చచ్చినాఁడు. రామసింగు యిల్లు వెడలఁగనే వానియింట బందిపోటు పడియె. ఆదొంగ లేమిహేతువో కాని తెల్లవాఱునంతకు చచ్చి పోయి పడియున్నారు. ఆమె యాదినము మొదలు కనఁబడుట లేదు. కొందఱు చచ్చిన దనియు, మఱి కొందఱు పాఱిపోయిన దనియు, పదిమంది పదివిధములుగఁ జెప్పుకొను చున్నారు. నిజమేమో నాకుఁ దెలియదు

పురుషుని ముఖము దైన్యమునకు స్థానభూతమైనది. కన్నులనుండి నీరు బిరాన క్రమ్మి వెలువడఁజొచ్చెను.

కాపు—ఏమి ! యేడ్చెదవు నీకు బంధువులా యేమి ?

పురు—ఆ ! అటులే. నీవు నీదారినిఁ బొమ్ము.

అని చెప్పెనుఁ కాపువాఁడు తనమార్గమును బట్టెను. అంతటఁ గొంతసేపటికి ధైర్యము దెచ్చికొని యుత్తరీయము శిరముమీఁదఁ గప్పుకొని, మెల్లటులో తనగృహమును జొచ్చి తనతల్లి నడుగఁగా నామెయు నటులే చెప్పెను. అంతటఁ గీలూడిన జంత్రపు బొమ్మవలె సోలి తల్లి సేదదేర్పఁ గొంతసేపటికి లేచి, “హా ! ప్రసన్నా ! నీకొఱకై పడరాని శ్రమలను బడినానుగదా ? అదియంతయు నిష్ఫల మయ్యెనే. అయ్యో! నిన్నిఁక జూచుభాగ్యము నాకు లేదా? నాఁడే కడసారి దర్శన

మూ ! అక్కటా ! ని న్నెన్ని శ్రమలయినఁ బడి తోడ్తెచ్చెద నని యామహీపాలునకుఁ జెప్పి వచ్చితినిగదా. ఇప్పుడు నే నే మని చెప్పుదును. బ్రతికి యుండి తురుష్కులచే నవయుచుంటి వని చెప్పుదునా లేక పంచత్వము నొందితి వని చెప్పుదునా. ఏమి యుఁ దోచదయ్యెను గదా." యని పరిపరి విధముల విల పించుచున్న కూఁతును జూచి, "ఏమే యిట్లేడ్చెదవు ! దైవ మట్లు చేసినప్పుడు నీవేమి చేసెదవు? నీభక్తిని నీస్నేహమును గనఁబఱచి, మూఁడు కాళ్ళ ముసలిముండను నన్నింటిలో విడచిపెట్టి, పులి యనక భూతము ననక, కొండలనక, కోనలనక, యరణ్యము లనక, యదేపనిగా నామెకార్యముకొఱకై పోయి నీవు పడవలసి న పాటులన్నియుఁ బడినావు నీవు నమ్ముమనుము, నా మె యే యంతరించినది. ఆమె గ్రహచార మట్లుండ నీవేమిచేసెదవు ? ఇఁకఁ జాలు నూరకొనుము ఆమెపై పెట్టిపెట్టి ప్రేమలు మానుము. ఇంటఁ బడియుండి నా కింతగంజి కాఁచి పోయు చుండుము.'' అనితల్లి చెప్పిన మాటల కొక చెవి యిచ్చి తనలోఁ దా నిట్లని తలంపఁ జొచ్చెను. "అప్రసన్న లేని బ్రతు కొక బ్రతుకా. అహా! ఆమె చెల్మివంటిది వేఱొకటి దొరకునా? నేను నిర్భాగ్యురాలను, లేకున్న నామెయెడబాటు నాకేల కలుగును ? కావున నే నీరాత్రి యీపుర సమాచారంబును బూర్తిగఁ దెలిసికొని, యామె మాఱువేషముతో నేవనము లలోనైన సంచరించుచున్న దేమో కనుఁగొందునుగాక" యని నిశ్చయించుకొనెను.



## పదునాఱవ ప్రకరణము.

---

### వీరవర్మ.

ఒకనాఁటి సాయంకాలము శంబరపురవీథినుండి యొక సన్న్యాసి యతిత్వరితముగఁ గోటచెంతకుఁ బోవుచుండెను. ఆమహాత్మునిఁ జూచుటతోడనే ద్వారపాలకుఁడు లేచి నిలిచి నమస్కరించి లోపలికిఁ బోవుటకు మార్గముఁ జూపి విడిచెను. యోగియు లోపల నడుగుపెట్టఁగనే యిద్దఱు యోధులు వచ్చి నమస్కరించి వారి వెనుక వచ్చుచుండిరి. అందఱును గలసి నాలుగైదు కక్ష్యాంతరములు గడవంగనే యొకవిశాల సౌధము గానవచ్చెను. వా రందుఁ బ్రవేశించి యుచితాననములఁ గూరుచున్నంతలో నొకవీరుఁడచటికి వచ్చి నమస్కరించి మునిచంద్రుని యాజ్ఞచేఁ గూరుచుండెను. ముని వెంట వచ్చిన తక్కిన యిద్దఱు సర్దారులు నాప్రదేశమును విడిచి,కొంతదూరమునకుఁ బోయి కూరుచుండిరి. అంతట నీమునియును వీరుఁడు నిట్లు సంభాషించిరి.

ముని—ఓయీ వీరవర్మా! ఈవార్త ఛత్రసాలునకుఁ దెలియ నిచ్చువఱకును వ్యవధి లేదు. ఇపుడు ఢిల్లీనుండి రణదుల్లాఖాను ఛత్రసాలుని మీఁదికి యుద్ధమునకు బైలుదేరినాఁడు. కావున నీవు నీసేనలతోఁ బోయి వానిని మధ్యనే

నిరోధించి వధింపుము ఈవార్త ఛత్రసాలునకుఁ దక్షణము వర్తమాన మంపుము. ఇఁక నాలస్యము సేయరాదు.

వీర—మహాత్మా ! అటులే చేసెదను ఇట్టి మహా సంగ్రామ దినంబులలో మీతోడ మనవి చేసికొనుట పాడి గాదు. దేవర కటాక్షించెద నని యభయ హస్తమిచ్చితిరేని మనవి చేసికొనెదను

ముని—ఓయీ ! నాకు నీవుక్కటియు ఛత్రసాలుఁ డొక్కటియుఁ గాదు మీ కందఱకు ఛత్రసాలుఁ డధిపతి యని వానియం దెక్కుడు ప్రేమయు నీయందుఁ దక్కువ ప్రేమయు లేదు. నీవు నిరాటంకముగఁ జెప్పవచ్చును.

వీర—స్వామీ ! నాకొక్కతెయే పిల్ల గలదు అది పుట్టినది మొదలు జ్యోతిష్కులు మండలాధీశ్వరునకు రాణి యౌనని చెప్పుచుందురు. అందు చేత నేను ఛత్రసాలుఁడు స్వీకరించినఁ గృతార్థుఁడ నయ్యెద నని కొండంత యాసతో నుంటిని గాని, నే నా రాజమార్తాండునకు వశీకృతుఁడనై యా తనికి మామగ నే నీపుడము నేలు మండి నాకన్యకి నా నృపతిల కున కిచ్చెద నని చెప్పుటకు సాహసము లేక, మీవలనఁగాని యీ కార్యము గాదని యోచించి మీకొఱకుఁ దపంబు సేయుచుంటి నా పుణ్యవశంబున నేఁడు భవద్దర్శనమైనది. కావున శిష్యునిపైఁ గృపారసము చిల్కి యా కార్యమును మీరు నెఱవేర్పవలెను.

ముని—ఓయీ ! నీ వతని యధికారపాలకుఁడవైనను నీకంటెఁ దా నెక్కువ యని తలంచునట్టి యహంభావము కల

వాఁడు కాఁడు. నే నింతకుమున్ను త్రిలోకసుందరి యైన రామ
సింగుని పుత్రిక ప్రసన్నముఖ విషయముఁ జెప్పితిని. కాని యా
మె తురుష్కులచేఁ దస్కరింపఁబడెనో, దిక్కు లేక మరణించె
నోకాని, యామెవార్త యెవనికిఁ దెలిసినట్టు మని చెప్పుటకు నింతయు
వీలు లేకున్నది ఆమె పరాక్రమమునుఁ గూడ ననుమానింపరాదు.
సౌందర్యాది సద్గుణ విశేషములలో నిప్పటి స్త్రీలలో నామెను
జెప్పి కొనదగు వారినిఁ జేర్కొనఁజాలను. కావున దైవవశమున
నామె జీవించి యున్నచో నీపుత్రిక ద్వితీయ కాఁగలదు. అం
దుకై నీ వనుమానింపకుము.

వీర—మహాత్మా! ద్వితీయయైనను తృతీయయైనను
సరియే కాని యారాజపుంగవుఁడు వరించునట్లు చేసితివేని కృ
తార్థుఁడ నయ్యెదను స్వామీ! నాపుత్రి యని స్తుతి చేసికొ
నుట కాదు పార్వతి శివునికై తపము సేయునట్లామహాత్ము
ని వరించి నాకూఁతురు నిత్యము పూజసేయుచు సద్గోష్ఠిచేఁ
గాలముఁ గడపుచున్నది ఆమె పేరు చంద్రిక. దయచేసి యొ
క్కసారి నాపుత్రికారత్నము చేయు నమస్కారమును స్వీక
రింతురుగాక.

అని చెప్పి లోనికిఁ బోయి కొంత సేపటికిఁ బుత్రికను
తోడ్కొని వచ్చెను ఆమె చంద్రిక కే తగును ఆమె వచ్చి
బంగారు లతవంటి తనమేను తీగను వంచి యోగీంద్రునకు
నమస్కరించెను. యోగియు—“అమ్మా! నీకుఁ గల్యాణమ
గుఁగాక. మనోభీష్ట ప్రాప్తియే కాఁగలదు. నావాక్య మమో

ఘము." అని దీవించి "భవిష్యత్కార్యముసకై త్వరపడుము. నీయభీష్టంబును నేను నెరవేర్చెదను" అని చెప్పి యోగీంద్రుండు సనియెను. అప్పుడు వీరవర్మ పుత్రికను జూచి "అమ్మా! యింక నీతపము సిద్ధింపఁగలదు. నీవు మనసునందు విచారమును దక్కియుండుము. నే నిప్పుడే సమరమునకుఁ బోవలయును." అని చెప్పి యొక్కలేఖ వ్రాసి విలాసపురమునకుఁ బంపి యపుడె రణభేరి వేయించెను. ఆధ్వని వినునంతలో సైనికులెల్లరు చీమలబారువలె నెక్కడనుండి వచ్చిరో యసంఖ్యాకముగా వచ్చిరి. ఒకవైపున శృంగనాదములు వినఁబడెను. ఆటవికు లెల్లరును సమరసన్నాహములై బయలువెడలిరి ఆసైనికులెల్లరు నధికారక్రమముగ నుత్తరాభిముఖులై వెడలఁ జొచ్చిరి

---

పదునేడవ ప్రకరణము.

గడకోటయుద్ధము. O 35, S J M S. P 38 N 27

మధ్యమండలమునఁ బుట్టి ఛత్రసాలుని ప్రతాపము ఢిల్లీసామ్రాజ్య మొగలాయీవంశమును ముంచివేయుటకుఁ బ్రవాహరూపమున నుత్తరవాహినియై బయలుదేఱినదో యనునట్లు వీరవర్మసేనావాహిని బయలుదేఱి పోవుచుండెను. ఆ

కోలాహలమునకు నడవి నున్నపక్షికులంబులు తల్లడిల్లెను మృగసంతానంబులు పాఱిపోయెను. కడకోటయొద్ద రణదుల్లాసైన్య మెదురయ్యెను. ఇరువీరులవారును దీసిపోక విజయేచ్ఛచేతఁ బోరుచున్న సమయమున సంగ్రామసింహగణపతిసింహులును తుటికొంత యాశ్వికసైన్యంబు నున్నతమైన యొకభద్రగజముపై నెక్కి ఛత్రసాలమహీపాలుఁడును, వెనుక వచ్చి చేరి మహారాజు వచ్చి కలిసినట్లు సంజ్ఞగాఁ దురుష్కసైనికుల కూడలు పగులునట్లొక పెద్దభేరిగి వేల్పఁబడెను. వీరవర్గసైనికులు ద్విగుణీకృత మనోబలులై ప్రాణముల కాసింపక పోఁజొచ్చిరి సంగ్రామసింహగణపతిసింహులునుదపుసైన్యముతో సమరమున శత్రులను డీకొనిరి. అట్టియెడ రణదుల్లాఖానును ప్రళయకాలరుద్రుని పగిది గర్జిల్లుచు నమితమైన శత్రుసైన్యమును జూచి హృదయములందే వెనుకఁ దీయుచున్న తమసైనికులఁ జూచి “వెరంచుకరండు. భయము లేదు. యింతకు వేయిరెట్లు సైన్యము వచ్చినను రణదుల్లాఖానుఁడు కృపాణఘాతంబుల రూపుమాపఁగలండు రండు” అని ధైర్యము చెప్పుచు యుద్ధ మొనరించుచుండ, వెనుకను భద్రగజముపై నధిష్ఠించిన ఛత్రసాలమహీపాలుండు చూచుచుండ ముప్వురు చెంచువాండ్రు వచ్చి స్వామీ! యని నమస్కరించిరి

ఛత్ర—ఓరీ! మీరెవ్వరు?

చెంచు—దేవా! మేము చెంచువాండ్రము. ఈతఁడు మామన్నె తేఁడు

అని తమలో మూడవవానిఁ జూచి చెప్పిరి.

భర్త్రి—[కన్నులారఁ జూచి తనలో] ఆహా ! వీఁడు చెంచుకులజుఁడైనను యెంతసౌందర్యముగ నున్నవాఁడో ? నిక్కముగ మాక్షత్రియులందు సైత మిట్టియందగానిఁ జూచి యుండముకదా యని తలంచెను. మన్నె తెలి చూపు లామహారాజుగారి ముఖమున పద్మమునందు దగుల్కొనుతుమ్మెద లట్లు లగ్నము లయ్యెను. ఆసమయమున నిరువురకును సమదృష్టి మాత్రము లేక అప్పుడుచల్లనివాయు వ్రేక్కటి వీచి వారిహృదయముల కనురాగపూరిత శుభోదర్కమును దెలిపెను. ఆట్లిరువురు నన్యోన్యప్రేమను జూచించు చూపులఁ జూపుచుండఁ గొంతసేపటికి మన్నెతేని ముఖము సిగ్గుచేత వంపఁబడినది. అయిన సహాంగవీక్షణము మాత్ర మారాజేంద్రుని ముఖము మీఁదనే ప్రసరించెను. సమర మతిభయంకర మగుటచేత మహీపాలుఁడు తన దృష్టి సంగ్రామమునకుఁ ద్రిప్పెను. మన్నెతేఁడును యుద్ధమునే చూచుట కారంభించెను. అప్పుడు మన్నెతేని యుత్సాహము రణమునకు నుఱుకుదునా యని యుఱుకుచున్నటులు దోచెను. ఆపల మహాసంగ్రామ మగుటచేత నావైపున కొకసారి చూచెనేకాని హృదయ మీమన్నెతేనియందే యుంటచేత మహారాజీమన్నెతేనిని మధ్యమధ్య తఱచు చూచుచుండుటచేత నా చెంచులతేని మనోభిప్రాయమును గనిపెట్టి “ఓయీ ! చెంచులతేఁడా! రణవ్యాపారమును జేయఁగలవేని యశ్వమును ఖడ్గము నిచ్చె

దను. నీ యుద్రేక మట్లు కనుఁబడుటచే నీ యభిప్రాయమును దీక్ష్పటకై యిట్లుంటిని గాని యాటవికుఁడవైనను మనోహరా కారమును దాల్చిన నిన్ను సమరమునకుఁ బంపి శ్రమపెట్టుటకుఁ గాదు సుమీ" యనెను.

మన్నెఱేఁడు—"దేవా! అట్లు కటాక్షించితిరేని యీ సేవకుని రణవ్యాపారమును దేవరకుఁ జూపించి కృతార్థుఁడ నయ్యెదను." అని వినయపూర్వక మృదుమధురవాక్యంబులఁ బలికి తేనె లొలికించువఱ కాశ్చర్యపడి యొకయశ్వము నొక ఖడ్గము నొసంగెను కాని మహారాజా యాటవికనాయకుని వాక్యములఁ గురిసిన మధువునే పలుసారులు రసనాంచలమునకుఁ దెచ్చుకొనుచుఁ దత్సారస్యమును గ్రోలుచు నాశ్చర్యపడుచు, "ఆహా! విధాత యిట్టివానిని గొండరాళ్లలో మాణిక్యమును సృష్టించినట్లు నాటవికవంశమందు సృజించె. మా క్షత్రియవంశమందే యుదయించినచో నాసర్వరాజ్యము నీ సౌందర్యమూర్తి కొసంగి సేవకుఁడనై యుండకుందునా ? ఆహా" యని తలపోయుచుండ నా ఖడ్గమును నమస్కారపూర్వకంబుగఁ గైకొని రయంబున నశ్వోత్తము నధిష్ఠించి ప్రభునకు నమస్కరించి యతిభయంకరముగ రణము సలుపుచున్న నామహీపాలసేనకుఁ బ్రక్కగాఁ బోయి యందఱికంటె ముందునకుఁ బోయి సుంతయైన వెనుదీయకుండ శత్రుకరవాల ప్రఘాతంబులఁ గాచికొనుచు, రిపుకంఠనాళంబుల దూఁటకత్తులట్లు తుత్తునియలు చేయుచు, విలయకాలశూలి

పోలిక మార్తుర నెత్తుటిచేఁ గాలువలఁ బ్రవహింపఁ జేయు చుండు నవసరంబున రాజ్యసైన్యము లహహహమను ధ్వనులతో నాచెందులరాయుఁడు పనుపరించి విజృంభించి యొక్కపెట్టన తురుష్కసైన్యారణ్యంబును ఛేదింపుచుండ నొక్క గడియలో మొగలుసేన పాదభాగావశిష్టంబయ్యె రణదుల్లా ఖానుఁడు ప్రాణమాత్రావశిష్టుఁడై గుఱ్ఱముమీఁద సోలెను. తక్కిన ఖానులందఱును గంగపాలైనారు. చావఁగ మిగిలిన వారు రణమును విడిచి పోవుటకు యత్నించుచుండిరి. చెందులతేఁడు తాను దొలుతఁ గొట్టిన దెబ్బచేతనే నొచ్చి రణదుల్లా ఖానుఁడు చావఁ డయ్యెనను చింతతో నతివేగమున ఖానుని నఱకుటకై వచ్చు నాచెందునాయకుని వీక్షించి చెంతనున్న య ఱియొక్క యోధుఁడు ఖాను పోలినగుఱ్ఱమునొక్క దెబ్బగొట్టె. అంతట నాయశ్వము రణభూమిని విడిచి పలాయనము లగుచున్న వారిని గలసెను. కొందఱు తురుష్కయోధులు కొంతవఱకు యుద్ధముచేసి రిపుసైన్యముల నాపి తాము వెనుకటివారివలె పలాయనులైరి. అట్లు పాఱిపోవువారినిఁ దఱుముటకు యత్నించుచుండ, మహారాజు వలదని సైఁగ చేసెను. సంపూర్తిగాఁ దురుష్కులు పాఱిపోయిరి. రాజసైనికులు వచ్చి మహారాజునకు నమస్కరించిరి. అపుడు ఛత్రసాలుఁ డిట్లని సమాశ్వసింపఁ దొడంగెను. ‘ ఓరాజశేఖరులార! సైనికులార! మీరందఱు వెనుదీయక సంగ్రామముఁ జేయుట సహజమే. ఈచెందులతేఁడు జన్మస్థలంబునఁ జూపినయప్రతిహతమైన ప్రతాపమును జూచితిరి కదా?

వీర—మహారాజా! కన్నులారఁ జూచితిమి. ఈతని ప్రతాపమున సహస్రాంశమైన మేము చూడలేము. మేము నిక్కముఁ జెప్పితిమి. ఒక్కతుపాకిటితో మమ్ముల నందఱఁ దల కడచి శత్రుభయమించుకంతయు లేక తురుష్కసేనాగణ్యముఁ జొచ్చి చీల్చి చెండాడిన నీ వీరమూర్తికిఁ దుల్యుఁడు మాలో నెవ్వఁడును లేఁ డని నొక్కి చెప్పెదము." అని దృఢముగఁ జెప్పవలకు, దక్కిన యోధులెల్లరు "సత్యము సత్య" మని ఘోషించిరి. అందులకు సంతోషించి ఛత్రసాలమహీపా లుఁడు "ఓయీ! ఆటవికాధ్యక్షా! నీ యనుపమానప్రతాప మును జూచి సంతోషించితిని. నీ వీఖడ్గమును గైకొనుము" అని కరవాలము నొసంగెను. మహాప్రసాద మని యాచెంచుల యొకవీఁడు నమస్కారపూర్వకముగా దాని స్వీకరించెను. అంతకుము న్నొసంగినఖడ్గమును మరల నిచ్చివేసెను రాజు వానితో "ఓయీ నీవు మా పట్టణమునకు వచ్చుచుఁ బోవు చుండు"మని యాదరముతోఁ బలికెను. వాఁడు చిత్తమని కోమలస్వరముతోఁ బదులు పలికెను. ఆ ఛత్రసాలుఁ డందఱి లోను బలుమార్లు మాటలాడింపఁదలఁచెను గాని యాచెం చులతేఁడ మితభాషియై యొకమాటయే ప్రత్యుత్తరమిచ్చు చుండెను. ఛత్రసాలున కతనితో మాట్లాడుటకుఁ దనివితీఱక యుండఱ వెళ్ళుట కాజ్ఞ యొసఁగెను సైనికు లందఱును వెడలి పోయిరి. తాను గజమువీఁదనుండి దిగి యందఱి నావలకుఁ బొమ్మని యాజ్ఞచేసి వారిద్దఱు నొక రసాలవృక్షముక్రిందికిఁ

బోయిరి. అప్పుడు చెంచునాథుని మనము హర్షసంభ్రమము లతో నొప్పి సంగ్రామజన్యమైన శ్రమును విడిచెను. అది యే మికారణముననో కాని రారా జతిపరిచయమును జూపి పలుక రించిన కొలంది సిగ్గభిగ్నుడై తలను వంచి మాట్లాడఁజొచ్చెను. అప్పు డాచెంచువానిమొగము తన కరకమలములచే నెత్తి ముద్దులొలుకు నామోముగోమును కన్నులారఁ జూడ ఛత్ర సాలుఁ డభిలషించెను కాని తనయంత వాఁడు చెంచువానిని ప్రేమించి స్పృశించిన భాగుండ దని యెంచి, "ఓయీ! నేను నీతోఁ గొన్నిరహస్యములఁ జెప్పెదను. నీ ప్రతాపాతిశయ ము నీ మాటలయందలి మధురిమయు, నా కానందమును గొల్పినవి. కావున నీతో బద్ధస్నేహితుండనైతిని రహస్యము లేమందువేని నీ వాటవికుఁడ వౌటచే వనసంచారము సంత తము కలిగియుండును. కావున నీవనప్రాంతమున ఢిల్లీనుండి వచ్చుచున్న యొక రాకుమారి నీ కెందైన నెన్నఁడైనఁ గనఁ బడినదా ?" అనెను.

చెంచు—మహారాజా ! అనేకులు పోవుచుందురు వచ్చుచుందురు. నే నెవనిని గుర్తింపఁగలను! అయిన నామె పే రెద్దియో యెవ్వని పుత్రికయో చెప్పఁగలుగుదురా ?

ఛత్ర—ఆ! చెప్పెదను. ఆమె ఢిల్లీపురవాసిని. రామ సింగు పుత్రిక. ఆమె పేరు ప్రసన్నముఖ యందురు.

అంతటఁ చెంచునాయకుని మేనెల్ల జల్లుమనెను. ఆనం దరసము వేల నతిక్రమించిన వారాశివలెఁ బొంగి పొరలెను.

కొంతసేపు తలవంచి తన ముఖమండలంబున సంతోషముఁ దోపసీయక, గన్నులఁ గ్రమ్మిన యానంద వారి కనఁబడకుండ ధ్యానించినట్లు కొంతసేపు నయనయుగమును మూసికొని "అయ్యా! ఆలోచించితిని. నా కెందును గానరాలేదు. కాని మహారాజులయిన మీరు నావంటి యల్పులతో మాటలాడి నందులకే ధన్యుఁడనై కొంచెము చనవిచ్చుటచేత నొక్క మాట దేవర నడుగఁదలంచితిని. సెలవైనచో నడిగెదను."

ఇన్ని మాట లొక్కసారి మాటలాడినందుల కానందముఁ జెంది రాజు వానితో "నోయీ! నీ వేమాట యడిగిన నడుగవచ్చును. సంశయింపకుము." అనెను.

చెంచు—మహీనాయకా! మీ కామెతోఁ బనియే మి? సర్వంసహానాథుల కబలల ప్రసక్తి యేల యనిశంక తోచుచున్నది.

భర్త—ఓయీ! ఆమె తురుష్కులచేఁ బరాభూత యనియు శత్రుసంహారమును జేసి పోవవలె ననియుఁ దలంపుతో నడుగుచుంటిని ఆమె దండ్రియింట లేకుండుటఁ జూచి దొంగలు పడి యామెను దస్కరించినా రని కొంద ఱందురు. అడవులఁ బోవుచుండ నెవ్వరో చంపివైచిరని కొందఱందురు. ఆత్మహత్య చేసికొన్న దని కొంద ఱందురు అందుచేత నా మెను రక్షింపలేకపోతిని గాదా యని వగపు గదురుటచే నడుగుచు టిని.

చెంచు - మీరు దయారసపరిపూర్ణు లగుటకు నేను పదివేలవందనము లొనరించుచున్నాను కాని మీరడిగిన ప్రశ్నముల కొక్కండును బ్రత్యుత్తర మీయఁజాలఁ, బై మాట యడుగుటకు శక్తి చాలదు. కాని మదవియందు మేము సంచరించుచుండఁగ నొక చిన్న చేతిరుమాలు మాకు దొరకినది. అది కడుఁ జిత్రముగ నున్నది. అక్షరములుకూడ నున్నట్లు తోఁచునుగాని నేను చదువురానివాఁడ నగుటచే నిదమిత్థమని చెప్పఁజాలను. దానిని మేమాటవికుల మగుటచేత వాడలేదు. అదివ్యతరమైన వస్త్రము యుష్మదాదులచెంత నుండఁదగినది. దానివలన మీకుఁగొంత తెలియునేమో యని తోఁచెదను. ఆజ్ఞయైనచోఁ దెచ్చెదను.

ఛత్ర అటులే దానినిఁ దెమ్ము. కాని నీవు వనమున సంచరించుటలో నామె వర్తమానమును మాత్రము దెచ్చితి వేని నీమేలు మఱువను. నిన్ను నా యాంతరంగిక మిత్రునిగఁ జేసికొందును. నేను నీతో నింత చనవున మాటలాడుచుండ నీవు నాతో మాటలాడుటకు సిగ్గుపడెదవేల ?

చెంచు.—దేవా! ప్రభువులయెదుటఁ బరిచారకుఁడు తలయెత్తరాదు నే నాచిత్రాంబరము నిప్పుడే తెచ్చి సమర్పించికొందును. మీరు వారణము నారోహింపుఁడు." అని చెప్పెను. ఛత్రపాలుఁడు గజము నధిష్ఠించెను. చెంచునాయకుఁ డొక్కపనుగున నశ్వము నెక్కిపోయి తెచ్చి మహారాజున కిచ్చి నమస్కరించి తానును జెలికాండ్రును ప్రభువు

నొద్ద సెలవు తీసికొని పల్లెకుఁ బోయిరి. మహీపాలుఁడా చిత్రాంబరమును జొక్కా జేబులో వేసికొని పురమునకుఁ బోయెను.

## పదునెనిమిదవ ప్రకరణము.

### చిత్రాంబరము.

ఛత్రసాల మహీపాలునికీర్తిచంద్రిక లిట్లువిశ్వమునందు వ్యాపించుసటుల శరచ్చంద్రికలు కర్పూరము చల్లినట్లు ప్రకాశించుచుండెను. విరహిజనుల హృదయభిత్తికలు ఛేదించుటకై పంచబాణుఁడు వదలిన ఫిరంగిగుండువలెఁ జంద్రుఁడు వియన్మార్గమునఁ బ్రకాశించుచుండెను. మారుతుండు హాయిగ వీవఁ దొడంగెను. అప్పటికి రాత్రి రెండవయామము ప్రారంభ మయ్యెను. ధవళసుధాప్రపూరితమైన సౌధభాగంబున నొక హంసతూలికాతల్పమునందు నొక పురుషుఁడు శయనించి మందిరంబున సమర్పఁబడిన చిత్తరువులఁ జూచుచు నేదియో యాలోచించుచు హఠాత్తుగా లేచి మణిభంజికాకరమ్మునన వ్రేలుచున్న నంగచ్ఛదమును దీసి దాని జేబులో నున్న క్రముకదళపుఁ బొట్లమును విప్పెను. అయ్యది పసపుఁ

బచ్చని పట్టువస్త్రపుఁ జేతిరుమాలు. దానిమీఁద మంచి జరీ పోగులతో నల్లిబిల్లిగ నల్లుకొనిన లతలవలెఁ గుట్టుపని చేయఁ బడియున్నది. చూచుటతోడ మిగుల నాశ్చర్యపడి దానిని దీపికచెంతకుఁ గొనిపోయి చూచునప్పుడు నాలతాంత దళము మీఁదఁ "ప్రసన్నముఖి" యను నక్షరరత్నములు స్పష్టముగఁ గనఁబడెను. గుప్పునఁ గస్తూరాగరు వాసన పరిమళించెను. అంత నాపురుషున కాశ్చర్య సంభ్రమకరుణ లొక్కసారి జనించెను. పద్మపత్రములవంటి కన్ను లశ్రుపరిప్లుతము లయ్యెను. ఆచిత్రచేలమును వికసితాంజలిని బట్టి తనముఖమండలమునఁ గప్పికొని "హా! ప్రసన్నా" యని గద్గదకంఠుఁడై యవ్యక్తభాషణములఁ బలుసారు లుచ్చరించెను తరువాత నా వస్త్రమును మొగమునుండి తీసి తిరిగి విస్పష్టముగఁ జూచి పలుసార్లు ప్రసన్నా! ప్రసన్నా! యని పలవరించి తనివిదీఱ వక్షఃస్థలంబునఁ జేర్చికొని పోయి శయ్యపై మేనొట్టుటలోఁ చేర్చి "హా! ప్రసన్నా" యని తపించుచు పలుసార్లు తీసి చూచి చదువుచుఁ గన్నులనీరు కార్చుచు, నేమియుఁ దోఁచక మరల శయ్యనుండి లేచి యొకబల్లమీఁద నాచిత్రాంబరమును బాగుగాఁ బఱచి ఘనమైన దీపికను దానిచెంత విడియాలతాప్రకల్పనలను సవిమర్శముగఁ జూచుచుండెను ఆయల్లికలతీరు సరళిగ నల్లుకొనినట్లుండలేదు దట్టముగ నల్లుకొనినట్లును నామధ్యభాగమునఁ బ్రసన్న చిక్కువడినట్టి భావమును దోఁపించుచుండెను. ఆయక్షరములపంక్తికి పైభాగ

మున వికసించినట్టి పతాకహస్తము నొకదానిని యాశ్వాభా వమును దెలుపునట్లు కుట్టఁబడెను దాని కెమురుగను లతావల యమునకు వెలుపల నొక ఛత్రము కుట్టఁబడెను దానిఁ గాం చిన యాపురుషుని చిత్తము చేయివెట్టి కలఁచినట్టు లయ్యె ను. ఆహా! చిత్రపటము మిక్కిలి భావగర్భితమై యున్నదే. సాంద్రలతావేల్లనములమధ్య తన పేరుండుటచేత దుష్టతురు ష్కులమధ్యఁ జిక్కితి ననియు, తద్వ్యాహ్యాసీమను జిత్రించిన ఛత్రమును సంబోధనచేయు పతాకహస్తము తననామము నకుఁ పైభాగమున నుండుటచేతఁ దాను తన యాపద నివా రించి ఛత్రసాలు నేలుకొమ్మని ప్రార్థించినటులను విస్పష్ట మైనది. ఆహా! ఆనుగుణఖని, ఆ సుందరములప్రోవు, ఆసాధ్వీ మణి, యిప్పు డేమైనదో కదా? హా! ప్రసన్నా! నీనామాక్ష రములు తొలుత శ్రీప్రాణనాథ యోగీంద్రుఁడు చెప్పినప్పుడె నాహృదయ మాకర్షణ చేసినవి. పిమ్మట ఛత్రపతి శివాజీ మహారాజు చెప్పినదిమొదలు నీనామము నాకుఁ దారక మంత్రమైనది. హా! ప్రాణవల్లభా! ప్రసన్నా! అదిమొ దలు నిన్నెప్పుడు కన్నులారఁ జూచి యానందింతు నని మితి లేని యాశచే నుంటినిగాని, నిన్నుఁ జూచుభాగ్యము కలుగలే దయ్యె. ఆనాఁడు నీ వొక లేఖను వ్రాసి యెవ్వనిచేతనో బం పితివికాని వానితోడనే నీవు వచ్చిన నాభాగ్యము పండును గదా! అయ్యో నేను దప్పుపలికితిని. నిర్బంధావాసమున నుండి నవయుచున్న నీ వెట్లు రాఁగలుగుదువు. ఆదోషము

నాదే యేమందువా—ఆవార్త వినుటతోడనే నమస్తసేనలతో వచ్చి ఢిల్లీని నాశనము చేసి నిన్నుద్ధరింపవలయును. అట్లు చేయని భీరుత్వమునకు నీవు నన్ను నిందింపవలసినదే. నీ వాలేఖయందె తెలిపితివి నీవు మఱచితివేమో. నీవు రుక్మిణివై నన్ను శ్రీకృష్ణుతోఁ బోల్చినపుడు నిన్నకట బాధించు రణదుల్లాఖానును శిశుపాలుని వధ చేయునట్టి యవసరము నాడే యైయున్నది. నీవు కాదు మఱచుట నేనే మఱచితిని. కాని నీతండ్రి నీగృహమును విడిచి రణమునకు బయలుదేరి వచ్చినవాఁడే. నీవు వసించిన గృహమును ఖులులు దోఁపెంచినారఁట. నీవే చంపితివో నీపాలిటి భగవంతుఁడెవఁడైన వధించెనో కాని యాతస్కరులు వధింపఁబడినారఁట. ఎవరోయని నేనెందులకుఁ దలఁపవలెను? ఆనీరకృత్యమును నీవే చేసియుందువు. నీయందు నరకాసురుని వధించిన సాత్రాజితిశక్తి కల దని యానాఁడె యోగీంద్రుఁడు చెప్పియున్నవాఁడు. హా! ప్రసన్నా! నీ వాక్కువ్రనఘము నొసర్చి యెందైన నరిగితివా? లేక తురుష్కులచేఁ బట్టువడి కారాగృహమునఁ గృశించుచుంటివా? లేదు లేదు. అట్లు జరిగినచో యీచిత్రాంబరము నడవిలో దొరకుటకు హేతు వెయ్యది? పగతురు నీవు కొంతవఱకు వచ్చుటతోడనే తురుష్కుల వెన్నంటి విన్నంతము నొందించియుందురా? హా! మనోనాయికా అట్లే కానిచో నీకై యనేకులను బంపి వెదకించితినిగదా? బ్రతికియున్నచో నొక్కనికంటనైనఁ బడకుందువా? నీవే కాదు. నీవెవన్నంటివచ్చిన

తురుష్కయోధులు పలువురును రూపుమానిపోయినారని కింవదంతి కలదుకదా ? ఆహా ! అదియుఁ గడువిచిత్రమే. వారినందఱ నీవే వధించితి వని తలఁచుచున్న సమంజసముగ నున్నది ఇంటఁబడిన బందిపోటుగాండ్రను బలువురఁ జంపిన నీవు వీరలఁ జంపు టాశ్చర్యము కాదని తలంతునా ? వారికళే బరముల యానవాలయిన కనఁబడలేదుకదా ? యిది యేమి వింత ? యెట్టు లాలోచించుటకుఁ దోచకున్నది. కాని నా కీమధ్య పలుమాఱు గొంతుక పొరపడినది. నన్ను నీవు పలు సార్లు తలంచియుందువు. అందువలన నీ వెచ్చటనో బ్రతికి యుంటి వనియే తలఁచెదను హా ! యీ దురదృష్టవంతునకుఁ దిరిగి ప్రసన్నముఖీదేవి ముఖకమలము ప్రసన్న మగునా? ఓహృదయమా ! ఏల నీ కీవెఱ్ఱి ? ఢిల్లీవిలాసపురమధ్యమ సీమను జారులచేత జల్లెడ వేసినట్లు వెతకించితిని. ఆమెజాడ నుంతయు నగుపడలేదు కదా. అట్టిమిథ్యా వస్తువుపై యేల నీ కీకాంక్ష? ఓప్రసన్నముఖీ ! నీ వెట్టయిన ధన్యురాల వనియే తలంతును. యేమందువేని నీగుణములు జగత్పూజ్యములని యెదునంశంబు దిగంతములవఱకు వ్యాపించినది. దేశోద్ధార కుల హృదయాకాశములకుఁ బండు వెన్నెల యైనది. అరణ్యౌక సులయిన యోగిజనుల మనస్సాక్షికిఁగూడ జ్యోతిర్లింగమైనది. అట్టి పరమపూజ్యురాలవైన నీవు పంచత్వమును బొందినను నీమనస్సాక్షిచేత నన్ను వరించి నాయందే నీచిత్తమును లగ్న మునుజేసి పుణ్యలోకమునకుఁ బోతివికాని నీ వెవనిని మనోవ

ల్లభునిగ మనసార స్మరించుచు వానిహస్తములచే లాలన చేయఁబడఁ దలంచితివో యట్టి నా మనస్సు నూడఁ గొని పోయి నన్నుఁ బిచ్చివానిగఁ జేయుట ధర్మమా ? ఇంచుక తెలిపినచో భౌతికశరీరమును విడిచి నేనును నీవెంటనే యుందు నుగదా ? అట్లేల చేయుదు; నావలన భూమిపైఁ గొన్ని రాచ కార్యములను జరుపఁదలఁచి విడిచిపోయియుందువు నీవును దేశోద్ధరణమునం దాసక్తి కలదానవే కదా ? ఇందువలన నీ వాత్మసౌఖ్యముకంటె దేశసౌఖ్యమునే యెక్కువగఁ దలంచి తివని తేలినది. హా ! ప్రసన్నా ! నీ మోమెక్కసారియైనఁ గన్నులఁ పండువుగఁ జూపి పవిత్రతను బొందవైతివిగదా? హా! నీవు నాయట్టి యదృష్టహీనునకుఁ దక్కుదువా ? అక్కటా! యేమి, ఆశ యింకను బాధించుచున్నది కదా? ఎక్కడనుండి యో యెవ్వఁడోవచ్చి "అయ్యా! ప్రసన్నసుఖజీవించియేయు న్నది. ఇక్కడనే మాఱువేసముతోఁ దిరుగుచున్నది" అని చెప్పవచ్చునేమోకదా యని భ్రాంతి తోఁచుచున్న దేమి ? ఇసీ యిదంతయు నాకామెయందుఁగల ప్రేమాతిరేకమునం జేసి పొడముచున్న దుర్భ్రమ, సందియము లేదు. నాయనుచరుల లో బాఁలెగాండ్రులో నే నెఱుఁగనివా రెవ్వరు? అట్టివ్వఁడైన గూఢవేషధారియై యుండి యున్నచోఁ బ్రసన్నకై యిన్నివిధ ములఁ దపించుచున్న నా చెలి నొక్కఁడైన జూడకుండునా? అంతియొ కాదు. ఆరమణీలలామ త్రిభువనసుందరి యని చెప్పుదురు. అట్టి త్రిలోకసుందరి మాఱువేషమున నున్నంత

మాత్రమున మాఱునా? అది వట్టి కల్ల. కమలము శైవాలము చేతఁ జుట్టుకొనఁబడినను నిసర్గసుందరత్వమును బాయదు. కాని నామహిళావతంస మన్యభూమికాధారణము జేసినను ప్రజలకుఁ దెలియక మానదు. కాని యామెకు మాఱుగ నీచి త్రపటమును నాకంపి నాప్రాణములను గొంచెము నిలిపినది. హా! ప్రసన్నా! నీతండ్రి రామసింగు నీ వెక్కడనో మరణించితి వని విరక్తిచేత బైరాగులలోఁ గలసి యెచ్చటికో పోయెనుగదా? హా ప్రసన్నా! నీయాత్మకు భగవంతుఁడు శాశ్వతానందసౌఖ్యము నొసంగుఁగాక" అనునంతలో మాగధుల ప్రబోధనగీతములు చెవులఁబడెను. నరేంద్రుని కన్నులనే తెల్లవాఱెను.



పందొమ్మిదవ ప్రకరణము.

ఆశ్రమము.

రాత్రి నాలుగుగడియలైనది. ఎక్కడను మనుష్యసంచారము లేకున్నను, మృగసంచారము మాత్రము మితముగనున్నది. ప్రదేశమా సూర్యకాంతులు చొరని మహారణ్యము. అందును గాఢాంధకారము. అందుఁ బ్రాణము లన్నఁ గడుఁ జవుకగానెంచి యొకపురుషుఁడు పోవుచుండెను. తా నెవఁడో

యెక్కడికిఁ బోవలయు నని పోవుచున్నాఁడో నడచునది దారి యో కాదో యెఱుఁగఁడు తొల్లి వ్యాసుఁడు కుమారుఁడైన శ్రీశుకుఁడు సర్వసంగపరిత్యాగియై పోవుచుండ పుత్రునియందలి ప్రేమచే వెనుకనుండి హా! కుమార! హా కుమారా యని పిలుచుచుఁ బోవుచుండ శ్రీశుకుఁడు సర్వభూతమయుఁడగుట చేత ప్రతివృక్షమును "ఓహో! ఓహో" యని ప్రతిశ్రుతి యిచ్చినట్టులఁ బ్రసన్నముఖీ దేవియం దర్పింపఁబడిన చిత్తవృత్తి కలవాఁ డౌటచేత నేశబ్దము వినఁబడినను బ్రసన్న కంఠస్వర మనియే భ్రమించుచుండెను. అప్పుడే విరక్తిఁ జెందుచుండును. నురలఁ బ్రసన్నాభిలాష పడుచుండెను. మేనెల్లఁ జెమటపట్టి కట్టినపుట్టంబు పూర్ణంబుగఁ దడిసె. కంటకంబులచే మేనెల్లఁ జీల్పఁబడెను. పదములు కఱకు రాళ్ళ నడచుటచేత నే కాక కంటకవ్యాకీర్ణములను బగ్గున మంటలెత్తఁ జొచ్చెను. ఇతరమైన నాత్మశరీరమునం దభిమానగుణము లేశమైనను లేదు. దెబ్బలు తగిలినప్పుడుగూడఁ బ్రసన్నా యనియే తలంచుచున్నాఁడు. కాని దైవమా! యని తలంచుట లేదు. ఆహా! యిట్టి మనశ్శక్తి యేయోగీంద్రునికైనఁ గలుగునా? ఇట్లు పోవంబోవఁ గొంత సేపటికి పథికునకు నేదో యాత్రామాత్రయములభించునని శకునము కనుపట్టుల పూర్వదిఙ్ముఖంబు తెలివినందెను. అధికారిని జూచిన తస్కరులవలె చంద్రునికాంతులు చూపట్టినకొలఁది తిమిరసంతతులు మూలమూలల దాఁగుచుండెను. మేలుదినములలోన మేలుదినములట్లు కొంతదూర

మున దీపపువెలుతురును కనుపింపఁదొడంగెను. ఆ వెలుగు ననుసరించి క్రమముగా నాపథికుఁ డచ్చటఁ జేరెను. అది కృష్ణపక్షము. అప్పటికి రాత్రి పండ్రెండుగడియలైనది. అక్కడ నొక్కపర్ణశాల కలదు. దానిఁ సమీపించి, "అయ్యా! యిం దెవరున్నా" రని మార్గస్థుఁ డడిగెను. ఎవరును బలుకరైరి. ఆశాలాముఖద్వారమునకుఁ బోయి చూచువఱకు నందొక చోట నగ్నిహోత్రపునెగడియు దానికిఁ గొంత సమీపమున సమాధినిష్ఠ నున్నయొక యోగియుఁ గన్పట్టెను. ఆమహానుభావుఁడు కేవలము దేశోద్ధరణమునకై భూమి నవతరించిన సదాశివునివలెఁ గన్పట్టినాఁడు. పలుకకుండుటచేత నాయోగిపుంగవునిఁదిరిగి పలుకరించుట భావ్యము గాదని యాయాసశ్రాంతుఁడౌటచేత గుమ్మమునకుఁ ప్రక్కగఁ బండుకొనెను. నిద్రవేళ దాఁటినను పాదములు చిమచిమ యని మండుచుండుటచేతను నురనురమనుచుఁ బొరలుచుఁ బరుండెను. ఇట్లుండఁ గొంత సేపటికి యోగీంద్రుఁడు సమాధినిష్ఠను జాలించి "ఓయీ! యెవ్వఁడవు" నీవని పలుకరించెను

పథి—అయ్యా! నేనొక మార్గస్థుఁడను. ఢిల్లీనుండి విలాసపురమునకుఁ బోవుచున్నాను.

యోగి—నిరంతరావాస మేపురము? నీ కేమిపని?

పథి—విలాసపురము నివాసము, ఛత్రసాలమహారాలు ని సేవయే పని.

యోగి—ఢిల్లీపురమున కేలఁబోయితివి?

పథి—స్వామీ ! మహారాజుగారి నాశ్రయించిన రామసింగను క్షత్రియపుంగవునిపుత్త్రిక ప్రసన్న యను నామె యాపురమునఁ జిక్కుపడినది ఆమెనుదోడి తెచ్చుటకుఁబోతిని.

యోగి—ఆమె కనఁబడినదా ?

పథి—అయ్యో ! కనఁబడిన సంతవిచారమేల ? నేను మిక్కిలి దురదృష్టవంతుఁడను.

యోగి—ఆమె యేమయిన దని తలంతువు ?

పథి—స్వామి, యెట్లు తలంచుటకును వీలులేకున్నది. తురుష్కులకుఁ జిక్కిన దని తలంతు నన్నచో నామె దుష్టులకుఁ బ్రాణముతోఁ జిక్కునది కాదు అథవా దైవహతిచేతఁ జిక్కిన దని తలంతు మన్నచో నారణకుల్లా యింక నామెకొఱకై పరితపించుచు భటులచేత భూమినెల్ల వెతకించుచున్నాఁడు. అడవులలో నెందైనఁ జిక్కుపడి మృగస్వాముల కెఱయైన దని తలంతునన్న నట్టిచిహ్నము లెందును గానరావు. ఈవల మహారాజుగారికి నావలఁ దురుష్కులకు నట్టిజాడలు సుంతయుఁ గానరాకుండునా ? ఎందైన నాత్మహత్యఁ జేసికొన్న నాచిహ్నములైనఁ గానవచ్చును గదా ? అదియుఁ గన్పట్టుట లేదు. క్రియ కిందటి నాశవెట్టి కళేబరముతో నాకసముమీఁది కెగిరి పోయినట్లు తోఁచుచున్నది. దేవా ! యోగిచంద్రులయిన కాలత్రయవేదులు మీరు. మీకుఁ దెలియరాని దీజగంబులనుండదు, కావున దివ్యదృష్టినిఁ జూచి యాప్రసన్న జీవించియున్నదో

లేదో యెచ్చట నున్నదో చెప్పి నాయలమటఁ దీర్పుఁడు. మీా కివే పదివేలవందనములు.

యోగి—తనలోఁ దా నిట్లని తలపోయఁజొచ్చెను. అక్కటకటా! నాకు జ్యోతిషప్రశంస నుంతయుఁ దెలియక పోవుట చిక్కుగ నున్నది. దివ్యజ్ఞాన శక్తియుఁ బూజ్యమే. ఎవ్వరైనఁ బ్రశ్న యడిగినవో నప్పటికిఁ జంద్రస్వరమాడుచున్నఁ గార్య మగు ననియు, సూర్యస్వర మాడుచున్నఁ గార్యహాని యనియుఁ జెప్పుచుందురు. మిడతంభట్లుశకునమువలెఁ గొన్ని కానవచ్చును. గొన్ని కాకపోవచ్చును. మనసుచేత నాలోచించఁగా యెక్కడనో యున్నటులే తోచుచున్నది. నేనట్లు చెప్పితినేని వారి నాశాపాశము బాధించుచుండును. అందుపై నన్నుఁ బట్టి పాలార్చి నాప్రాణములు దీయుచుందురు. లేనట్టులే తోచుచున్న దని యనుమానముగ మదురుమీాఁదఁ బిల్లివలె జెప్పితినేని పిమ్మట నెటుపడితేనటులఁ దిరుగవచ్చును కావున ద్వంద్వముగఁ జెప్పెదను. ఓయీా! రాజసేవకుఁడా! నీపేరేమి?

పథి—నాపేరు మిత్రదాసుఁడు.

యోగి—మిత్రదాసా! నేను రెండువిధములఁ బ్రశ్న చూచితిని. ఒకవిధమున నున్నట్లును, రెండవవిధమున లేనట్లును దోచినది. కాని యామె జీవించియున్నట్లు నాకు నమ్మకము లేదు. నిస్పృహఁ జేసికొనవలసినదే కాని జ్యోతిష ఫలములు దృష్టాదృష్టములు. ఇంతకు నేమి స్థిరీకరించుటకు వీలు లేదు. దైవతంత్ర మెట్లో యట్లు జరుగును.

మిత్ర—స్వామీ! యోగీంద్ర! మీరు సంతోషభేదములను రెండింటిని సమముగఁ జూపినారె. పోనిండు మాయ దృష్ట మెట్లున్నదో యట్లు జరుగును.

యోగి—మిత్రదాసా! నీవు లోపలికిఁ బూర్తిగ వచ్చి తడికవేసి యాముూలఁ బరుండుము.

అని చెప్పటతోడనే మిత్రదాసుఁడట్లు చేసి పడుకొని నిద్రించెను. యోగియు బొంతను బఱచుకొని పండుకొని నిద్రించెను.



## ఇరువదవ ప్రకరణము.

---

### నెమిలికన్నులు.

శంబరపుర సమీపారణ్యమునందు నొక తెల్లరాళ్ళ గుట్ట గలదు. అం దొక పరిశుద్ధమైన తెల్లరాతి పలక కైలాస పర్వతమందలి చఱియవలె నొప్పుచుండెను దానిమీఁద భిల్లీ వేషమును దాల్చిన పార్వతిని వశీకృతురాలిగఁ జేసికొను తలంపునఁ జెంచువేషము వేసిన శివుఁడో యనునట్టుల నాచఱియపై నొక్క చెంచువాఁడు కూరుచుండెను. అప్పటి కప్పుడె మలయమారుతలాసకుండు లతాకాంతలకు నాట్యమును జెప్ప

టకుఁ బ్రారంభించెను వృద్ధత్వ మాసన్నమయిన కొలఁదిఁ బురుషునకు స్త్రీవాంఛ లధిక మౌనట్లు వృద్ధభాస్కరుఁడు నిశాకాంతాసల్లాపమున కువ్విళ్ళూరుచుఁ బరుగిడఁ జొచ్చెను. అచ్చటఁ దోఁడి చెలికాండ్రు కొంతదూరమునఁ దిరుగుచున్నారు. అట్టి సమయమున మిన్ను చూచుచు మనసులో నేదియో యాలోచించుచున్నాఁడు, ఆహా ! నాజీవితమునకుఁ గష్టావధి యెన్నటికైన గలుగునా ? సుఖోదర్కమైన శుభమును గాంచఁ గలుగుదునా? ఆహా! దైవమా! యెప్పటికి నీకుఁ దనివి? నావియోగమును సహింపలేక నాతండ్రి విరాగియై యెచ్చటికో పోయినాఁడట. నాచెలికత్తె మిత్రవింద యానాఁడె విలాసపురమునకుఁ బోయెద నని పోవుటయే కాని తదాది దానివార్తనుంతయును నాకుఁ దెలియకపోయెను. మహారాజు నాయందు బద్ధస్నేహము కలవాఁడో లేఁడో సుంతయుఁ దెలియకపోయెను. న న్నీవిపదబ్ధినుండి యుద్ధరించు వా రెవ్వరు? దైవమా! నీవు న న్నుద్ధరింపవు. నే నేమి పాపముఁ జేసితినో కాని నీకు నామీఁద జిన్ననాఁటనుండియుఁ గోపమే తుద కిప్పుడు నాచేత నడవులలోఁ జెంచువాండ్రు సేవింపించుచున్నావు. అట్టి నీవు న న్నుద్ధరింతు వనుమాట చెవులపిల్లికిఁ గొమ్మున్న దన్న మాటవలె నయథార్థము. సరే: ఇప్పుడు స్త్రీరూపమును ధరించి ఛత్రసాలునిదర్శించినచో వెనుకదినములలోఁ జెప్పుకొనవలసివచ్చిన మేనమామకూఁతురు వావి కాదన్నసామెత ప్రస్తుతము నాపట్ల సార్థక్యమును బొందును. ఈప్రశంస చెం

చువారలకుఁ దెలియరాదు. అట్లు తెలిసెనేని „అల్లో యిది యాఁడదఁటరా" యని నవ్వుదురు. మోటుజాతి కెప్పు డేమి బుద్ధి పుట్టునో యేమి తెలియును. ఈ గౌరవ మిట్లే యుంచు కొనవలెను. ఈ యాకారము గలనేను మహారాజునకుఁ బ్రేమికాఁడుగఁ దోచితినిగదా ? పిమ్మటఁ జిత్రపటమునొసంగితిని. నిక్కముగ నామీఁద నాయువనీశతికి బ్రేమ యున్నచో నాచిత్రాంబరమును జూచి జాలిఁ బొంది నాయందు బద్ధాను రాగుఁడు కాకపోవునా? ఈసారి నానామాంకితము గలయుంగరము నిచ్చి పంపెదను. అప్పటివాని మనోభావ మెట్లున్నదో మిత్రులచేతఁ దెలిసికొందును. అంతకు నేను చేయవలసిన పనేమున్నది." అనునంతలో నొకస్త్రీ తనవైపునకే వచ్చుచున్నది. ఈ స్త్రీ యిట్లువచ్చుట కేమికారణము చెపుమా యని చెంచుల తేఁడాలోచించుచుండఁగ నే సమీపించి „ఓ యుమన్నదొరా ! నేను నీకొఱకే పంపఁబడితిని.

చెంచు—ఎవరివలన ? నెందులకు ?

స్త్రీ—శంబరపురాధీశ్వరుఁడైన వీరవర్మగారి పుత్రికచేతఁ బంపఁబడితిని. ఆమె చెంచుల నడిగి నెమిలికన్నులు తెమ్మని నన్నుఁ బంపించెను.

చెంచు—సరే కూరుచుండుము. ఆమెకు నెమిలి కన్నుల ప్రయోజన మేమి ?

స్త్రీ—అవి యెందులకో నాకుఁ దెలుపలేదుకాని యాకన్నులతో సురటిని గట్టి వింధ్యవాసినీదేవి కుపచారము

చేయు నని యామె యప్పుడప్పుడు పలికినమాటలచేతఁ దెలిసికొంటిని.

చెంచు—ఓహో ! ఆమె నిత్యమును దేవినిఁ బూజించునా యేమి ? అటులయిన నవివాహిత కాఁబోలును.

స్త్రీ—ఆ ! యిప్పటివఱ కంతే, ఆ మహానుభావునకుఁ గరుణ రావలెను దేవీకటాక్షమునఁ జేసికొనవలయును.

చెంచు—ఏమహానుభావుఁడు ? వారి నామమేది?

స్త్రీ—ఇం కెవ్వరు ? దేశోద్ధారకుఁడె ఛత్రసాల మహీపాలుఁడే.

ఆవార్తాశ్రవణముచేత మన్నె జేనికీళ్ళన్నియు నొక్కసారి సడలినవి. ముఖమున వైవర్ణ్యము బిరాన దెర వేసినటులావరించెను. పైపలువరుసచేతఁ గ్రిందియధరమును గఱచుకొనెను. ఒక్కసారి నిట్టూర్పు విడిచెను. తనలోఁ దా నేదియో యాలోచించుచుఁ గనుబొమ్మలు ముడివేయుచుండెను. మొగ మెఱ్ఱవడెను. శరీరము కంపింపఁ దొడంగెను. నోట మాట రాకుండెను.

స్త్రీ—ఓయీ మన్నె జేఁడా ! నీ వీమాట విని తిరిగి ప్రత్యుత్తర మీయలేకుంటివేమి? నడుమ నీపుట్టి యేమి మునిఁగినది.

చెంచు—లేదు నా కేమి? నెమలికన్ను లెచ్చటనున్న
విరో యని యోచించుచున్నాను కాని నీపేరేమి? నీయజ
మానురాలి పేరేమి?

స్త్రీ—రాజపుత్త్రిక పేరు చంద్రిక. నాపేరు కైరవిణి.

చెంచు—ఓహో. అటులయిన మీ యిద్దఱకు సరిపో
యినది కాని నీమాటలచేత నామహారాజే యీమెను బరి
ణయ మగుదు నని వర్తమాన మంచినట్లు తోచదు. మీరు
మాత్రము ప్రయత్నించుచుందురు. అంతయేనా స్థిరమైనదా
నీవు దాచక చెప్పుము.

స్త్రీ—నీవు చెప్పినదియే యథార్థము. కాని మధ్య
నొక యోగీంద్రుఁ డిరువురకును సంధానముఁ జేసెద నని మా
మహారాజుగారి కభయహస్త మొసంగినాఁడు. అట్లు జరిగి
తీరును.

చెంచు—(తిరిగి యేదియో మనసులో నాలోచించుచు
శిరఃకంపము చేయుచున్నాఁడు)

స్త్రీ—ఓయీ! నన్నుఁ బంపుము నేను వెళ్లవలయు
ను. సూర్యాస్తమాన మగుచున్నది. నేను వెడలినపిమ్మట నీ
యాలోచనలను జేసికొనుము.

చెంచు—సరే యుండుము.

అని యెక్కడికో పోయి కొన్ని నెమలికన్నులను దెచ్చి
యిచ్చెను. ఆకైరవిణియుఁ బురాభిముఖురాలై పోయెను. మన్నె
దొర యదిమొదలు తోచక తనచేతఁ బడనున్నవిధాన మన్యు

నిచేతఁ బడుఁచుండఁ గాంచు వాని మనంబువలె దుఃఖపూరితచేతస్కుఁడై తనలో నిట్లు వితర్కించుట కుపక్రమించెను. ,,ఓచిత్తమా నీ కేల యీతత్తరంబు. ఆనసౌందర్యచంద్రుని మొగ మెన్నఁడైనఁ జూచియుంటివా? ని న్నేలుకొనెద నని యాయన యభయహస్త మిచ్చెనా! లేక యెవరిచేతనైన వార్తను బంపెనా? నీలో నీ వూరక వానిగుణగణాతిశయమును విని వరించినంతమాత్రమున నిన్నుఁ గలనైన నెఱుంగని యారాజమార్తాండుఁడు వేఱొక పద్మినీలతను జేరుచుండ నీ కెందుల కీయారాటము? నీ వదృష్టవిహీనురాలవె కాక యజ్ఞానవిశిష్టవు నుమీ! నీ కిది తగదు. నీకు లేనిది లేనే లేదు. పరశ్రేయస్సు సహించి సంతోషభావమును బొందుము. అట్టిమేళ్లఁ బదింటిని గన్నులారఁ జూచి యానందించితివేని నీకుత్తరజన్మమునందైన ముక్తి కలుగును ఈజన్మమందు నీవు నిశ్చయముగ మోడ వనితలఁపుము. నీకు ననల సౌభాగ్యము ప్రసవఫలసంపత్తియుఁ గలుగనేరదు అయ్యది నీ పురాకృతకర్మపరిపాకము. నీ యందము గోవిందపూసపాలు; నీ కేశబంధము మయూరపింఛదళములపాలు. నీ చరణములు భీకరారణ్యసంచారములపాలు. నీయునికి పర్వతకందరములపాలు. అంతయేకాక యో ప్రసన్నా! దురదృష్టురాల! నీకంధరము రత్నహారములకును నీవేనలి చూడామణులకును నీచరణములు లాక్షాసౌభాగ్యమునకు నీనివాసము చంద్రకాంతశిలాసౌధ సంచారములకును నీయునికి ప్రాణవల్లభునంకపీఠియు నని తలపో

యకుము. నీకోరిక లన్నియు గగనకుసుమ మైనవి. నీయభి
ప్రాయము లన్నియు నశుగంటినవి. ఇంక విరక్తిం జెందుము.
ఆకసమునకు మాత్రము నిచ్చెన వేయకును జారిపడుటతప్ప
ఆనన్యఫలము లేదు. అనుసంతలోఁ జెలికాండ్రువచ్చి,
"అన్నా! యేమి యిచ్చోట సదే వనిగాఁ గూర్చుండి యేది
యో ధ్యానించుచుంటివేమి!" అని ప్రశ్నించిరి. మన్నెదొర
యు నుత్తరీయమునఁ గనుదమ్ములఁ దుడిచికొని, "సోదరులా
రా! నాకుఁ బూర్వాశ్రమమునందలి కొన్ని యంశములు
స్ఫురించుటచే విచారపడుచుంటిని.

చెంచు—అమ్మా.—కాదు కాదు—అయ్యా! నీకు
మావలన నే దేనికార్యముండినఁ జెప్పుము సెఱవేర్చెదము. ఊ
రక చింతిల్లిన నేమిఫలము? ప్రాజ్ఞుఁడ వట్లు శోకింతువా?

చెంచు రేడు—ఓయీ! ముందుగ "అమ్మా!" యని
పిలిచి దిద్దుకొంటి వేమికారము?

చెంచు—అయ్యాది మాతల్లి ని బిలుచు నలవాటున
వచ్చినది. కాని వేఱు గాదు.

చెంచు ఱేఁడు—ఆహా! మాయామోహితమైన నీబుద్ధి
కి సత్యము స్ఫురింపకున్నను బరమాత్మ సన్నిధానవర్తి యాట
నంతరాత్మకు సత్యము బయలుపడక మానదు కదా, దానిని
యపాజ్ఞులు తెలిసికొనలేరు. మనోవ్యాపారమున నిర్మలాంతః
కరణ ప్రవృత్తి కలవారు సర్వము ను దెలిసికొందరు. అది యే
దివ్యజ్ఞానదృష్టి యందురు," అని తనలోఁ దా నచ్చెరువందుచు

దీర్ఘాలోచన సేయుచున్న జేనిని దిరిగి చెంచులు పలుకరించి. అయ్యా మననివాసములకుఁ బోవుదము" రండు. మాతోడ నీ మనోగతవిచారమును జెప్పకుండ నీలో నీవు తపించిన మేము హర్షించువారము కాము. మీ కార్యమున్నఁ జేతులు కట్టుకొని చేయుదుము. నీయభిలాష దెలుపుము."

చెంచుజేఁడు—మిత్రులారా! నాయభిప్రాయ మటు లనే చెప్పెదను. నాకు మీరు కాక వేరెవ్వరు. నివాసముల కరుగుదము రండు

అని యందఱును మార్గము ననుసరించిరి.

## ఇరువది యొకటవ ప్రకరణము.

### వింధ్యవాసిని.

ద్వాపరయుగంబున శ్రీకృష్ణుఁ డుదయించినప్పుడు శ్రీ మహావిష్ణువు చెఱలోనున్న వసుదేవునకుఁ బ్రత్యక్షమై "ఓయీ నీశృంఖలము లూడిపోవును నీకు మార్గమునందు నిరోధ ముండదు. నీవు పోయి నీభార్యప్రక్కలో యిప్పుడే యుద యించిన బాలకునిఁ గొనిపోయి వ్రేపల్లెలోని యశోద ప్రక్క లోఁ బరుండఁబెట్టి యామెప్రక్కలో నున్న బాలికను దెచ్చి నీభార్యప్రక్కలోఁ బెట్టి నీ వెప్పటియట్లుండు మని చెప్పట

యు నాయానకదుందుభి యట్లు చేయుటయుఁ బిమ్మట నా బాలిక "యూవురని" యేడ్చుటచేఁ గావలివారలు దేవకి ప్రసవించిన దని కంసునితోఁ జెప్పుటయు, నాకంసుఁడు క్రుద్ధుడై యాబాలను దోడ్తెప్పించి పాదములను బట్టుకొని గిరగిరఁ ద్రిప్పి నఱికివేయుటకై భూమిపైఁ బడఁగొట్టుటయు, నాబాల క్రిందఁ బడక యంతరిక్షమున కేగి, యష్టబాహుయై మహాశక్తిస్వరూపమును దాల్చి. "యోరికంసా! నిన్నుఁ జంపుటకు మాయన్న వేఱొపల్లెలో నున్నాఁడురా. త్రుళ్ళిపడకుము" అని చెప్పి యంతరిక్ష గామినియై పోవుటయుఁ మీరు భాగవతమునఁ జదివియే యున్నారు. ఇప్పు డాయోగమాయాదేవి "వింధ్యవాసిని" యను నామముతో వింధ్యాచలమున వెలసెననియు నా ప్రాంతపుజనులు చెప్పుట వాడుకయై యున్నది. ఆప్రాంతము వా రాదేవిని సందర్శించి సేవించి మనసులోనికోరికలఁ బడయుదురు. అందుచే నా దేవ్యాలయము దుర్గమం బైన పర్వతమునం దున్నను వారతిభక్తిచేతఁ గష్ట మని తలంపక సంతతము నబ్బ్రాజ లాదేవీ సందర్శనమునకుఁ బోవుచు వచ్చుచుందురు. అందు శుక్రవారమున నాదేవిని సేవించుటకై పీను వారని లేక యెల్లరును వచ్చుచుందురు. ఆదినము శుక్రవారము. ఆదేవీ సందర్శనమునకై కొందఱు యోగిజనులు వచ్చి సేవించి యొకచోట నిష్ఠాగరిష్ఠులై తపముఁ జేయుచుండిరి. తక్కిన స్త్రీ పురుషు లెందఱో వచ్చి కుంకుమ పూజలు చేయుచుండిరి. కొంతసేపటికి రాజభటులు తొలఁగుఁడు "తొలఁగుఁడు". అని

నివారింపఁజొచ్చిరి. వారి వెనుకనే యొకరమణీలలామ స్నానమును జేసినదగుటచేత నింద్రనీలములను గేలుతనశిఖాకలాపమును జిగురున వ్రేలుముడి వైచి యెఱ్ఱపట్టుచీరను గట్టి యనేకరత్నభూషణనివహంబులను నిసర్గసుందరమైనశరీరమునకు సార్థక్యము దాల్చి కుంకుమయుఁ బ్రసవంబులను నైవేద్యార్హవస్తుసంతానమును జేటికలు పళ్ళెరంబునం బెట్టుకొని వెంట రా భువనమోహనలక్ష్మియో యనునట్టులు దేవీసన్నిధానమునకుఁ బోవుచుండెను. యోగిజనులలో నొకఁడు రెండవయోగినిఁ జూచెను. ఆ రెండవయోగి విలాసార్థము భూమిమీఁద నవతరించిన శంకరునివలె దివ్యతేజోవిస్ఫూర్జితుఁడై ప్రకాశించుచుండెను. అతనిమెడనిండ యనేకరుద్రాక్షమాలిక లుంటచేత శరీర మెట్టిదో చెప్పుటకు వీలు లేదు. కాని పార్వతీసందర్శనమున ననురాగయుతుం డైనపరమశివునివలె నా నారీరత్నమును జూచిన మనయోగిచంద్రుఁ డనురాగవశుండై జపంబు మఱచిపోయెను. సమశిరంబు నిడి యా రమణీమణి నిలిచినవైపునకుఁ దనశిరంబుఁ ద్రిప్పెను. ఆమెయు నా యోగిచంద్రునిఁ జూచినది కాని తనలో ‹‹నాహా యిట్టి రూపవంతులు సన్యసించెదరు కాఁబోలును?›› అని తలంచెను. యోగియు నామెకేసి పలుసార్లు చూచుటచేత నామెయు ‹‹నిదేమివింత, యీమహానుభావుఁడు రాగమును విడువక విరాగి యెట్లయ్యె?›› నని తనలోఁ దాను యోచించుచు దేవిని సందర్శించుచున్నంత మఱియొక్క భామినీరత్నము

మెడ నిండ దట్టముగఁ బూలహారములు వేసికొని యొకనార చీరఁ గట్టి బర్హిణపింఛమొక్కటందు శిఖాబంధమున నలవరించుకొని పళ్ళెరమునఁ బూజాద్రవ్యముల నుంచుకొని, మెల్లన నంచనడకతోఁ జనుదెంచి వెనుక నిలిచెను. అప్పు డర్చకులు రాజుగారికుమార్తె పూజ పూర్తి యైయినఁగాని యితరులు సమీపింప రా దని ప్రబోధించిరి. ఆ చెంచుభామయు నచ్చటనే యోగిపరిక్క నున్న యోగీంద్రుల బాగుగఁ దిలకించి వారలకు నమస్కరించి నిలిచెను. అది మొదలు లీల కరతుల్య యోగీంద్రు నిష్పృష్టి చెంచుదానిమీఁదఁ బ్రసరించెను. ఆమె సౌందర్యము నిగూఢమైనను బ్రకాశించుచునే యున్నది. ఆమెయు నపాంగ వీక్షణముతో నీ యోగిచంద్రుని జూచుచుండెను. రాజపుత్రిక పూజచేయవచ్చినదన మఱి నాలుగుమంత్రములు చదివిన మఱింత ద్రవ్యము లభ్య మగు నని యాసతో నర్చకు లంగన్యాసము మొదలగు ఘనకల్పముతో నోళ్ళు చించుకొనుచు నొకనికంటె హెచ్చుగా నింకొకఁడు వానికంటె హెచ్చు మఱొకఁడు నీవిధముగాఁ బ్రాఁతగిల్లిపోయిన ముదుసలి యర్చకులు సహ బయలుపడి గుడిఁకుంతయు మాఱుమ్రోసి బ్రద్ద లగు నట్లు పూజచేయించుచున్నారు ఇట్టు లుండ రాకుమారి చూచు యోగిచంద్రుఁడును మధ్యమధ్య యోగిచంద్రునిఁ జూచు రాజపుత్రియు నీపూజ యెంతవఱకుఁ గాయెరా యని తలఁచుచున్నట్లు పై వారికిఁ దోఁచెను. కాని యామహానుభావుఁడు యోగి యాఁటచేత నేమి యనుటకు వీలు లేక పూజకు వాగ్వం

ధమైనది. చెంచుపడఁతి కాయిద్దఱి చైదము లావరాచికొనినటు లుండెను మనయోగియు నెదుట నున్న చెంచుకళావతినిఁ గాంచి యిది యెవ్వతెరా యని దీర్ఘాలోచన చేసెను. కాని పలుసార్లు దానిపైఁ జూచిన నల్వురు నెగతాళి సేయుదురేమో యని చూచియుఁ జూడనట్లు నటించుచుండెను. కాని మధ్య మధ్య మిన్ను చూచి "ఆహా యేమి? పవిత్ర మైననామనంబు రాజపుత్రివిషయమై సానురాగ మగుట సుప్రసిద్ధమే యీ చెంచుదానిపై నాహృదయము పరవనేల? కారణ మేమి చెప్పుమా" యని యోచించుచుండ మరలఁ దనమనస్సు "ఓహో. వీనిమోము గోము. ఆహా! దీని కన్నులబెళుకు. ఔరా! దీనియవయవసౌష్ఠవము." అని వర్ణించుటకుఁ గమకించెను. "ఇసీ యేమిది? నేనధర్మప్రవర్తనుండనా? అనాచారణశీలుండనా? ఏమీ మనం బీచెంచు దానిపైఁ దలుచున్నది?" యని తిరిగి బుద్ధిచెప్పుకొనినను జిరకాలస్థాపితమైన ధ్వజమువలె నామెపైకి మరల మనస్సు పరుగెత్తినది. మఱియుఁ దనలోఁ దానెట్లో తలఁ పోయుచుండెను. ఈ విళంబమునకు సైపక దనకార్య మైనదికదా యని యెంచి దేవి కెదుట నిలిచి కన్నుల మూసికొని ధ్యానించి యక్కడ నుండియె తాను దెచ్చినకుంకుమను బూవులను నాచెంచుపడఁతి విసరుచుండెను. ఆకుంకుమయుఁ బుష్పములును సరిగాఁ బోయి దేవిశిరమున నే పడుచుండెను. చూచువా రందఱాశ్చర్యపడుచుండిరి. యోగిజనులు నాశ్చర్యము నందుచుండిరి.

ఒక్క నిమిషములోఁ దనపూజ చేసివైచి తాఁ దెచ్చిన నారికే
ళఫలమును గొట్టి యక్కడనుండియే తల్లికిఁ జేయి చూపెను.
ఆచేతిలోని పళ్లెర మక్కడఁ బెట్టి కన్నులు మోడ్చి మరలఁ
బ్రార్థించెను. అంతట దేవి శిరంబున నుండి కుంకుమపూరి
తములైన రెండుపుష్పములు వచ్చి హస్తాంజలిఁ బడియెను.
ఆయంశమున కందఱు మాన్పడి బొమ్మలైరి వెంటనే యా
చెంచునెలఁత దేవికి సాష్టాంగనమస్కారములు చేసి తాఁ దె
చ్చిన కలశ మందలియుదకము నా యోగిచంద్రుని పదములఁ
జల్లి పళ్లెరములోనితోనూలిక నామునిచంద్రుని కంఠమున
వైచి దేవివలననొసంగఁబడినకుంకుమసిక్తపుష్పములలో నొక
దాని నామహాత్మునిశిరమున నిడి రెండవదానిని దా శిఖాబం
ధమునఁ గ్రుచ్చుకొని నారికేళశకలప్రసాదములలో నొకదాని
నా మహాత్మున కిచ్చి నమస్కరించి రెండవశకలమును గొన్ని
పుష్పములును రెండవయోగి కిచ్చి ప్రదక్షిణపూర్వకముగ
నాయాటవికస్త్రీ దేవళమును విడిచెను. ఈ యంశము నంద
ఱును గన్నులారఁ జూచుచుండిరి. ఇదేమని వెదవిఁ గదల్పరై
రి. యోగిచంద్రుఁడును దేవీప్రసాద మని స్వీకరించెను. కాని
దాని యర్థము నెవ్వరు నాసమయమున వ్యక్తీకరణము
సేయరైరి. తరువాత రాకుమారి పూజాకల్పము సంపూర్ణ
మైనది. అర్చకులగొంతుకలు పూడిపోయినవి. వర్షకాలపుఁ
బర్వతములవలె నర్చకుల మేనులనుండి చెమటకాలువ లనేకము
ప్రవహించినవి. రాజపుత్రియందఱు సంతోష పెట్టినది. దేవీప్ర

సాదము యోగిజనులకును సమర్పించినది కాని వెనుకకుఁ జూచుచు వెడలిపోయెను. యోగిజను లిద్దఱిలో మొదటివాఁడు శ్రీప్రాణనాథుఁడు. రెండవవాఁడు ఛత్రసాలమహీపాలుఁడు- అని యెఱుఁగవలయును. ప్రసన్నముఖీదేవి మరణించియున్న దనియు, మహారాజునకుఁ జంద్రికాదేవిని బరిణయము చేయిం చుతలంపున నామె దేవీపూజాసమయమునకు మహారాజును యతివేషమును వేసి కూర్చుండఁబెట్టెను. ఇది యిట్లుండ; మధ్య నొక్క చెంచుగరిత యావిధంబున నర్పించి వెడలిపోయెను ఆ యాటవికస్త్రీని మీరు తెలిసికొనియే యుందురు నేను జూఁ చనేల ? ఆమెయే యింతకు మునుపటిను చెంచులనాయకుఁ డై యిపుడు స్త్రీరూపమున వచ్చి పూజ నెపమున రాజును వరించిపోయెను. శ్రీప్రాణనాథుని ప్రయత్నము వేఱు, జరిగినది మఱియొకటి, అందులకే ,,అన్యథా చింతితం కార్యం దైవ మన్యత్ర చింతయే" త్తని పెద్దలు చెప్పుదురు

ఇరువది రెండవ ప్రకరణము.

దర్బారు—1.

ఢిల్లీపట్టణ మంతయుఁ బరాభవాగ్ని చేతఁ దగులఁబడు చుండెను. హిందూప్రజల మొగములమీఁదఁ గత్తికాటు వేసి నను రక్తపుఁజుక్క యందునకైనఁ గాన్పించుటలేదు. నిండు

శీతకాల మగుటచేత యుద్ధమందు దెబ్బలుతినినవారి గాయములు మానకుండెను. అదిగో ఛత్రిసాలుఁ డక్కడికి వచ్చినాఁడు, ఇదిగో యిక్కడ డేరా వన్నినాఁడు. అల్లదే నాకు ధ్వజము కనిపించినది. అల్లదే శృంగనాదము లని ఢిల్లీపట్టణమెల్లఁ గలవరపడుచుండెను. ఎక్కడ నేనుచప్పుడు వినఁబడినను ఛత్రసాలుని ఫిరంగిధ్వనియే యని తల్లడ పడుచున్నారు. కొందఱీపట్టు తురష్కులఁ జిత్రవధలపాలు చేసి తమకసి తీర్చికొందు రని యభిప్రాయపడి పురమువిడిచి పాఱిపోవుటకు యత్నించుచుండిరి. ఇట్టు లున్నసమయమున డోలాయమానమానసుఁడై పేరోలగంబునఁ జక్రవర్తి కొలువు దీర్చి కన్నుల నగ్నిఁ గురియుచు "ఓరోరి మొగలువంశ సాగరబడబాగ్నులార! పిఱికిపందలార! మేమే పౌరుషవంతుల మనియు, మేమే మగవార మనియు, మేమే శత్రువనములను దహించుదావాగ్నుల మనియు నాయెద్దఁ గొట్టిన ప్రతాపములన్నియు నిప్పుడే యేటఁ గలిపినారు రా! ఛీ! మీరు మొగలువంశమునందుఁ బుట్టలేదా? మీ శరీరమునఁ బ్రవహించుచున్న రక్తనాళులు మురికినీఁటికాలువలా? మీశిరంబులు మట్టిముద్దలా? శత్రువులకు వెన్నిచ్చుటకంటెఁ జచ్చుట ధర్మమని యెఱుఁగరా? ఒకరాచ పురుషుని కోడిపోయితి మని యే మొగముతోఁ జెప్పెద మనుకొంటిరి? ఛీఛీ మీరు పురుషులు కారు. మీకంటె స్త్రీలే పరాక్రమమును జూపింతురే. నీవు పంపిన బందిపోటుగాండ్రను ముప్పదిమంది నొక్క ప్రసన్న

చంపివైచి నీకన్నుల దుమ్ముఁగొట్టిపోయిన దే. అట్టిహీనుఁడవు. నీ కేల జయము లభించును? సంగ్రామమధ్యమున నిన్నొక్క చెంచువాఁ డొక్క వ్రేటు వేయఁగనే చచ్చినశవమువలె గుఱ్ఱముపై నొరిగిన పరాక్రమహీనుఁడవు. వాఁడు నిన్ను దయ దలఁచి నెమ్మదిగాఁ గొట్టుటచేత మూర్ఛఁబోయి తిరిగి బ్రతుకఁగంటివి కాని, లేకున్న అల్లాదర్శనము—కాదు కాదు- సైతాను పిశాచదర్శనమునకుఁ బోయి యుందువు నీ యట్టి పరాక్రమహీనుని బంపుటచేతను విజయము శత్రువులకే యగుచుండుటచేతను బ్రళయాగ్నితుల్యమైన ఢిల్లీ తేజము నేఁడియినుకలోఁ గాలినలోష్ఠమువలెఁ జూతురుగదా ? ఆహా! తొలుత ఫిదాయీఖానును బిద ః నీవును రణమునకు బోవుటచేత నీసామ్రాజ్యమున కపజయ మనుమాట గలిగించితిరి ఛీ యిఁక మీమోములఁ జూడరాదు. మరల నెన్నటికైన ఢిల్లీడి మీరు జయమును సమకూర్చి తిరిగి సామ్రాజ్యమున నధికారార్హతను బొందువఱకు, మీరు నా మొగమును జూడరాదు. పొండు" అనెను. అంతట ఫిదాయీఖానుఁడును దణడుల్లాఖానుఁడును సలాము చేసి మొగమున గుడ్డ వేసికొని లేచిపోయిరి. తక్కిన వా రందఱు నధికోష్ణ గీష్మమారుతమునకు వాఁడిపోయిన మామిడిమొక్కలవలె సొబగుదఱిగిరి. అందఱగుండెలు గడగడ కొట్టుకొనుచుండెను. అంతటఁ జక్రవర్తి పిడుగవంటిధ్వనితో "ఓయీ ! తుహ్వార్ ఖాఁ" అని పిలిచెను.

తుహ్వారు లేచి "మహారాజ" అని చేతులు కట్టుకొనెను.

చక్ర—ఓయీ తుహ్వాక్ ఖాన్, ఇదివరకు ఛత్రసాలుని మీఁదికి యుద్ధమునకుఁ బోయి పరాభూతులై వచ్చినవారికి సభలో జరిగినమంగళముఁ జూచితివికదా? నీవు శూరుఁడవు. యుక్తిమంతుఁడ వని ప్రసిద్ధి. నీ విపుడు ఛత్రసాలుని మీఁదికి యుద్ధమునకుఁ బోయి "అల్లా ఢిల్లీపై కెన్నఁడు యుద్ధమునకుఁ బోరా దని శత్రువులకుఁ దోచునట్లు సంహారము చేసి రావలయును. ఇంతవఱకుఁ బొందినప్రసిద్ధి ప్రసిద్ధి లోనిది కాదు తోలుతఁబోయినవారి పరాక్రమము ననుసరించి ఢిల్లీసరదారు లల్పతేజస్కు లని శత్రువులకు లఘుభావమున దోచె నట్టిభావమును నీవు తద్వ్యతిరేకముగఁ జేసి రావలయును. అప్పు డశ్రద్ధగ నుంటిమేని వారు తప్పక ఢిల్లీ మీఁదికే దాడి వెడలుదురు. ఇది నిశ్చయము. ఇంత వఱకు బైలుదేరిన స్వదేశపురాజు లంద ఱుపరాజ్యము లాక్రమించుకొన్నవారు కాని యీతనిప్రభావము ఢిల్లీపట్టణమునె యణఁగఁద్రొక్కె నని తోచెడిని. పట్టణమునందు మన మనమర్థుల మనియు ఛత్రసాలుఁ డెప్పుడో వచ్చి ఢిల్లీని వశపఱచుకొను ననియుఁ గలవరము మెండుగ నున్నది. కావున నీవు పోయి ఛత్రసాలసైన్యాటవుల వేవేగ దహించి రమ్ము పొమ్ము. ఒక్కక్షణమైన జాగు సేయరాదు. నీతోడఁ బదివేలసైనికులు రాఁగలరు పొమ్ము" అని చెప్పెను. తుహ్వారు—మహాప్ర

భూ, ఆ రాజాధమునకు ఢిల్లీపై( గన్నెత్తి చూచుటకైన శక్తి కలదా? పట్టణములు బహుజనవ్యాకీర్ణములు. ప్రజలుసత్యము నరసి సంభాషించుకొనరు. ఉన్నవి కొన్నియు లేనివి కొన్నియు నూరిమీఁద ననేకలోకాభిరామములు పుట్టుచుండును. మీ బోఁటిచక్రవర్తు లామాటలను నిదర్శనముగఁ దీసికొనరు. నిక్కముగ నొక్కసారి దేవరకన్నెత్తిచూచిన మధ్యమండల మెల్ల మాడిపోవలయును పిఱికిపంద యైన ఫిదాయీఖానుఁ డును బ్రసన్నకై పరితపించుచు మన్మథాంధుఁడైన రణదుల్లా ఖానుఁడు నోడిపచ్చినంతమాత్రము చేత మీ రిట్లధైర్యపడ రాదు. నేను బోయి రాజాధముల నుఱుమాడి దేవరకు విజ యలక్ష్మిని గూర్చెద'' ననియెను.

చక్రవర్తి సంతోషించి.“ఓయీ సరదార్, మాటల చేత నేను సంతసించువాఁడను గాను. కార్యమును జేసినపిమ్మట నీవాచాలతను విశ్వసింతును. ఆలస్యము చేయక రమ్మ''ని చెప్పఁగా తుహ్వార్ ఖాన్ చక్రవర్తికి సలాము చేసి వెడలి పోయెను. రణభేరి సింహద్వారమున “ఢమ. ఢమ'' మ్రోఁ గెను. సైనికుల కుత్సాహము జనించెను. చక్రవర్తియుఁ గొలువు చాలించి యంతఃపురమున కరిగి తుహ్వార్ ఖాన్ తప్పక జయించితీరు నని నిండుమనంబుతో నుండెను.



## ఇరువది మూఁడవ ప్రకరణము.

---

### తుహ్వార్ ఖాన్.

బహుళపక్షమగుటచేత విష్ణుపదంబునఁ దారకలు మిక్కిలి ప్రకాశించుచుండెను. ఎక్కడఁ జూచినను హుహు యని శీతలబాధాసూచకములైన ధ్వనులె వినవచ్చుచుండెను. కడుబీద లక్కడక్కడఁ జలిమంటలు వేసికొనుచుండిరి. సత్తరుసావిళ్ళఁ గొందఱు తనుపిడికిళ్లనఁ బట్టుకొని మూఁడంకె వేసికొని పరుండి నిద్రించుచుండిరి జారచోరులు స్వగృహములకై పోవువేళయుఁ గాలేదు కాని దీర్ఘరాత్రము లగుటచేతను మిక్కిలి చలి బాధించుచున్నందువలనఁ జాలమంది జనులు మెలఁకువగనె యుండిరి. అట్టిసమయమున శంబరపురమున జాముసాత్రివేళ "ఢాం" అని యొకధ్వని యైనది చలి బాధచేత నంతకుమున్నె మెలఁకువగ నున్న ప్రజ లదిరి మంచములనుండి త్రుళ్ళి క్రిందఁబడి కన్నుల విప్పినారు అదివఱకు వర్షకాలములలో నధికవర్షములఁ దడిసి చుండువాల నమర్చఁబడినరేకు లూడి క్రిందఁబడి వ్రక్క లగుటచేఁ దిరిగి బాగు పఱచి కట్టనపోవుటచేత నామందువాలో నుండి జగమునిండిన యొక పెద్దవెలుఁగు కనఁబడెను. అయ్యది పెద్దకొబ్బరికాయ యంత యాకృతి కలిగి జగజ్జ్యోతివలె మతాబుగుండు ననుసరించియుండెను. ఆధ్వని సుమారురాత్రి యగుటచేత మూఁడు యోజనములదూరమువఱకు వినఁబడవచ్చును. ఆ వెలుఁగు నం

తదూరము కనుఁబడెను. ఇదేమి యాశ్చర్యమని కోటలోని వారును బురములోనివారును బయటికి వచ్చిచూచిరి. అంతట నా జగజ్జ్యోతిర్గోళము క్రమముగ నెదునిమిషములలో మాయ మయ్యెను. అందఱు నిదేదో జ్యోతిర్మండలము భూమిపై వ్రాలి శిథిలమై యంతరించిన దని తలంచునంతలోఁ దిరిగి యొకధ్వని పురోత్తరభాగంబున వినవచ్చెను. దానిచే నందఱకు దెప్పపాటు కలిగెను. అంతలోననే మఱియొకజ్యోతిర్గోళ మాకాశవీథి నవలంకరించి పట్టణమునకు రెండుఫర్లాంగులకుఁ బైన వెలుఁగుచుండెను. అప్పుడు విద్యుచ్ఛక్తి యొక్కసారి ప్రకాశించినట్టులయ్యెను. కన్నుల విప్పి చూడలేక పోయిరి. ఆసమయమునఁ బట్టణమందలి నల్లపూస కూడ స్పష్టముగాఁ జత్వారి కలవాండ్రకుఁ గూడఁ గనఁబడెను. రాజభటులగుండెలు దిగ్గురనెను. అందఱు నిదేదో మునిఁగిన దని భయాస్పదులగుచుండిరి. కోటలోపల నుండి ప్రళయకాలభైరవశంఖారవమువలె దిక్కులు చెప్పుడ్పుడునటుల ‹‹భామ్మ›› ని యొక్కశృంగనాదము బైలువెడలినది పౌరులందఱుఁ గలవలపడుచు నేమి చేయుటకును దోచక త్రొక్కులాడుచుండిరి. అంతట నుత్తరదిక్కుననుండి, ఢాం. ఢాం. అని ఫిరంగిగుండు వెడలి కోటగోడను ప్రక్కలించుచుండెను వీరవర్మసైనికులందఱు నపుడె సమరసన్నాహులై లగ్గల కెక్కి బురుజులచాటుననుండి ఫిరంగుల నమర్చి ప్రేల్చుచుండిరి. అట్టియెడ నెవ్వరియధికారము నెవ్వరికి నిమిత్తము లేదు. పౌరులందఱు బిడ్డలను జంకఁ

బెట్టుకొని వస్తువులఁ దగు ద్రవ్యమును మాత్రము దీసికొని పాఱిపోవుచుండిరి దేహమున శక్తిలేనివారు వృద్ధులయిన యంధులయిన తమతల్లిదండ్రుల నొక్కఁడును మోసికొనిరా లేక యింటనే విడిచి తనప్రాణమును దక్కించుకొనుచుండిరి. కొందఱు లుబ్ధధనికులు తమ బొక్కసములోని ద్రవ్యమునువిడిచి రాలేక పెట్టెలను గౌఁగిలించుకొని చావునకుఁ దెగించి యింటనే యొదిగియుండిరి. మొద్దునిద్దుర ప్రాపు దరిద్రగొట్టులు హఠాత్తుగ మెలఁకువను గాంచి యూడిపోవుకట్టుపుట్టముల తోడనే పోవుచుండిరి ఇట్లుండ యొక్కగడియలోఁ బురమునకుఁ బశ్చిమభాగమునకు లేచిపోయి వెనుకఁదిరిగి చూచుకొనిరి కాని కోటలోనివారికి మాత్ర మెచ్చటకునుబోవుటకుపీలు లేకపోయినది. అప్పు డాకస మగ్నిగోళములచే నిండిపోవుచుండెను. కోట గోడలకుఁ దాఁకుటచేత గుహలు మాఱ్మ్రోయునట్లు గుండ్ల దెబ్బలధ్వనులు చెవులను బీటలువడఁ జేయుచుండెను. తద్ధూమంబులు పిండులు గట్టుకొని గగనమండలంబునఁ గాదంబినీ పంక్తులను గలిగించుచుండెను. ఒక్కగడియవఱకుఁ గోటలోని వారు ఫిరంగులను సర్దుకొనువఱకే సరిపోయినది. అదిమొదలు దెబ్బకు దెబ్బ వేయుచుండిరి. కాని తెల్లవాఱువఱకుఁ దుష్కృసేన ప్రళయాగ్నిని గురిపించునట్లు వ్యవహరించిరి. అందుచేతఁ గోటలోని నానావిధమందిరంబులు భగ్నములు కాఁజొచ్చెను. జనులును హతులగుటకుఁ బ్రారంభించిరి. ఆట్టిఱేఁడ విక్రమసింహుఁ డనియెడు క్షత్రియవీరుఁ డొక్కరుఁడు మహాజనమును

పశ్చిమద్వారంబునఁ బంపించుట కాజ్ఞచేసి మరల శతఘ్నుల వర్షమును గురిపించుచుండె. తురుష్కులశతఘ్నులుకోటగోడలను మందిరములను భగ్నములుగఁ జేయుచుండె నేమందు లేని యాపురోత్తరభాగమునఁ దగు కూత్రపుగొండకలదు. దాని నధిష్ఠించి ఫిరంగుల నందేర్చి యటకొట్టుచుండుటచేత కోటను ధ్వంసము జేయుచుండెను. రాజపుత్రుల నాళికలు బయటనుండుటచేతఁ దురుష్కులనే సంహరించుచుండెను. అంతట విలాసపురమునుండి ఛత్రపాలుఁడను తగిన సైన్యముతోఁ జనుదెంచెను. ఎక్కడనుండియో రిగు మనియెడు ధ్వని వచ్చి తురుష్కులఁ గూల్చుచుండెను గాని వాఁ డేకోణమున వచ్చునో యని మొగలులు గుర్తింపరైరి. వచ్చినవారు చాలమంది హతులైరి. ప్రభాతకాల మైనకొలఁది క్షత్రియులబలము హెచ్చఁజొచ్చెను. భాస్కరోదయమునకు నంతకంతకుఁ జీకటి సఱిగినటులే ప్రతాపవంతులైన రాజలోకముయొక్క తేజమునకుఁ దురుష్కప్రతాపము తఱుగుచుండెను ఉదయపర్వతశిఖరమున హరిణశాబకములు బాలభాస్కరుని యరుణమరీచులు వృక్షాగ్రములయందు మలయుటచేత దావాగ్నిశంకచేతఁ దల్లసిల్లుచుఁ జికిలిచూపులతోఁ దోఁకలు ముడుచుకొని తల్లుల విడిచి కెలఁకులకుఁ బాఱుచున్నవి. క్రమముగా భాస్కరుండంబరమార్గంబున నలంకరించుచు రాత్రియందుఁ గురిసిన మంచును హరించి తనకిరణసహస్రములను బఱపుచుండెను. వెనుక నున్న మఱియొకకొండనుండి జున్నునియలుగుల వానలు

గురియుచుండెను. అంతకంతకు శత్రుపరాక్రమమె విజృంభించుచుండెను గాని తనయుడు ముందుపడుట లేదు. మధ్య మధ్య చక్రవర్తియాజ్ఞను దలంచి వీరావేశమును దెచ్చుకొని సైనికులం బురికొల్పుకొని విజృంభించుచుండెం గాని తుహ్వారుఖాను మనోబలము పూర్తిగం దగ్గినది. సైనికులు వెనుకనుండి వచ్చునలుగులకును ముందునుండివచ్చు నగ్నిజ్వాలలకును నిలువలేమని కేకలు వేయుచుండిరి. నీవు మదముండిన నీవు యుద్ధముచేసి చావు మన తుహ్వార్ ఖానుని గదిమి పాఱిపోవుచుండిరి. అప్పటికి జాముపొద్దెక్కినది. మూండువంతులు సైనికులు మడిసిరి హతావశిష్టులైన రెండువేల సైనికులంకొందు హ్వార్ వెనుకకుం బాఱంజొచ్చెను. ఆటవిక సైనికులు వెనుకనుండి కొంతవఱకుం బాఱందోలి మరలి వచ్చిరి. వారు వచ్చువఱకు ఛత్రసాలమహారాజు శత్రువులు నిలిచి యుద్ధము చేసిన కొండగుట్టకు జనుదెంచి యందఱం బరీక్షించి దొరికిన యాయుధాదుల సంగ్రహించికొనిపోవుచుండం జెంచువార లక్కడకు వచ్చి నమస్కరించిరి. ఛత్రసాలుండు ఓరియాటవికులార, మీరు మా కొనరించు నుపకారము మిక్కిలి యగుచున్నది. మేము మీ యుపకారమును మఱవము. కాని మీనాయకుండీదినమున రాలేదేమి యని యడిగెను.

చెంచు—స్వామీ! యింతవఱకు యుద్ధమును జేసిన వాం డాతండే. అతండు మిక్కిలి సుకుమారుండు వేళకన్నము

ను భుజింపకున్న నిలువలేఁడే. దేవరదర్శనమునకు మమ్మేలఁ బంపి తాను మాగూడెమునకుఁ బోయినాఁడు.

భర్త్య—సరే కానిండు మీరుడు బొండు. అని చెప్పి యాగేయి యుద్ధసంరంభము చేతఁ బురమువిడిచి పాఱిపోయిన పౌరులను రావించి వారలకుఁ గలిగిన కష్టనష్టముల నాలోచిం యాకొంఱతిలను బూర్తి చేసి యందఱను దగినరీతుల నాద రించి కోటలోఁ బ్రవేశించి భగ్నము లయిన మందిరముల బా గుచేయుటకు కేర్పాటు చేయించి „ఇంతటిమండి శత్రువులు మనమీఁదికిఁ బలుసార్లు వత్తురు. మన మిఁకఁ బ్రతిక్షణమును సమరసమయ మనియే తలంచి సర్వసన్నాహముగ నుండవలె ను. మఱియు ఢిల్లీకి విలాసపురముకంటె శంబరపురము సమీ పమౌటచేతఁ బలుసార్లు రిపు లీపురమును ముట్టడింపఁ జూచు చుందురు. ఈ మూఁడు పరాభవములచేతను ఢిల్లీశ్వరుఁడు మండిపడుచుండును. కావున మనము చాలజాగ్రత్తగ నుండ వలెను. మఱియు శత్రువులు వచ్చి కోటపైఁబడువఱకును మనము వారికి స్థల మిచ్చు టనుచితము. అందువలనఁ బౌరు లకు హాని కలుగును. అందులకై సతతముఁ బది యేనువేల సేనలకుఁ దక్కువ లేకుండ మధ్యమార్గంబునఁ గాంచి యుండ వలెను.” అని నిర్ణయించి స్నానాదికమున కరిగెను.

## ఇరువది నాల్గవ ప్రకరణము.

---

### అంగుళీయకము.

పరమేశ్వరుఁడు బ్రహ్మాండములను మార్చుచు నవస్థా భేదములు గలుగఁజేయునట్లులే పిండాండములనుగూడ నవస్థా భేదములను గలుగఁజేసి నాటకములలోని వేషములవలె మార్చుచుండును. నిరంతరము దుష్టశత్రుసంహారము సాధుసంరక్షణము దేశోద్ధరణము-అను జపముఁ జేయుచున్న ఛత్రసాల మహీపాలుఁ డొకనాఁడు సాయంకాలమున మనసున నేదియో యాలోచించుకొనుచు విలాసపుర కేళికోద్యానసీమ నటునిటుఁ దిరుగుచున్న సమయమున నొక్క చెంచువాఁడు వచ్చి యభివాదన మొనరించి నిలిచెను. మహారాజు వాని నేమి వచ్చితి వని యడిగెను. వాఁడు దేవా! మా చెంచునాయకుఁడీ ఖర్జూరపుటాకులబరిణెను తమ కిచ్చి రమ్మని యాజ్ఞాపించుటచేత వచ్చితి ననెను. అంతట మహారాజు దానియల్లికకు నంతసించి మూఁతఁ దెఱచి యం దొక యుంగరము నుపలక్షించి "ఓరీ యిదేమిరా యని ప్రశ్నించెను. చెంచువాఁడు, స్వామీ "ఆయుంగర మడవిలో దొరికినది. దేవర కిమ్మని ఱేఁడు పంపుటచేతఁ దెచ్చితిని" అని బదులు చెప్పెను. అంత నాభూపాలచూడామణి యా యంగుళీయకమును బరిశీలించి యందక్షరము లున్నటులఁ దెలిసికొని "ప్రసన్నముఖ" యను నక్ష

రములఁ జదివి కన్నుల నద్దికొని హా ! ప్రసన్నా యని తలపోసి మరలఁ జూచుచు నేవోదృష్టితో నిలిచెను. కొంతసేపటికి నేత్రయుగళ మశ్రుజల ప్రపూర్ణ మయ్యెను. కొంచెము బిగ్గరగ హా ప్రసన్నా ! యని యుచ్చరించి యొక కదంబవృక్షచ్ఛాయను గూలఁబడి నోట మాట రాకున్నను "ఓరీ" యని చెంచువానిని పిలిచెను. చెంచువాఁడు సమీపించి స్వామీ యేమి యాజ్ఞ యని నిలిచెను.

భర్త —"ఓరీ ! ఈయుంగరము మీలో నెవరికి దొరకినది ? ఇయ్యది దొరికినప్రదేశమున స్త్రీలయాభరణము లింకేమయిన లభించినవా ? పదచిహ్నము లేమయినఁ గనఁబడినవా ?" అని జాలి గదిరి పలికెను.

చెంచు—దేవా ! ఈయుంగరమైనను జేనికి దొరకినది కాని నాకు దొరకలేదు. అక్కడ నేమియానవా ళ్ళున్నవో నేనేమి చెప్పఁగలను ?

భర్త—ఓరీ ! నీవుపోయి నీజేనిని బంపుము.

చెంచువాఁడు చిత్తము మహారాజా ! నే ననుజ్ఞ తీసికొనెద నని వెడలెను. భర్తసాలుఁ డాయుంగరమును జూచి "ఆహా, యంగుళీయకమా ! ఆ ప్రసన్నముఖిక రాంగుళి వసించి నాయందలి మోహాతిరేకంబునం జేసి యతకార్యమై యసువుల వీడిన యాసుందరిని విడిచి యామెకై తపించు నామనికిత మార్చుటకై వచ్చితివా ? అయ్యో ! పలుకవేమి ? నీకు జాలి లేదా ? హాం! నీ వెట్లు పలుకుదువు ? నీ కెట్లు జాలిపుడమును ?

నీవు కళ్యాణమయాంగవయ్యు హృదయంబు శిలామయ మాట చేత నీకు జాలి యనుమాటయే తెలియదు. అట్టి శిలాహృదయు వైన నీవా నాకు మంచి మాట చెప్పి నామనంబును జల్ల చేయుట ? కాదు కాదు తప్పు తలంచితిని. ‟కరుణారస మన్న నల్ల రాల్గరుగవలెను” అని యొకకవి చెప్పియున్నవాఁడు. కావున నీవైన జాలి దలఁచి చెప్పకుందువా ? కావున నేను కరుణారసము నాశ్రయించి యీశిలాగర్భ స్వర్ణాంగుళీయకమును బ్రార్థించెదను. ఓకల్యాణాత్మకమైన యంగుళీయకమా! ఆకల్యాణి—ఆప్రసన్నముఖి యెందైన జీవించి యుండెనా లేక యేఘోరజ తువుచేతనైనఁ బంచత్వము నొందెనా! అయ్యో! చెప్పవేమి ? నీకుఁ బుణ్యముండునుగదా ?” యని పరితపించుచుండెను. ఆహా! చూచితిరా! ఎంతలో మన ఛత్రనాలము హిపాలుఁ డెట్లు మాఱెనో! అదియే దైవసంకల్పము. ఈయుంగరమును జూచినది మొదలు ప్రసన్నముఖి యిలవై జీవించియుండునేమో యని యాశాపాశము తిరిగి బాధించుచుండెను. అందువలన మఘసంతయు నామెపైఁ దిరిగినది. ఇట్లు పరిపరివిధములఁ దలపోయుసమయమునఁ జెంచు నాయకుఁడు కట్టెమొటఁ గన్పట్టెను వాఁడు కన్నులకుఁ దోచినంతనే యది యేమో వైకుంఠము దొరికినట్లు మనసు స్వస్థపడెను. అంతట మన్నెఱేఁడు సమీపించి వందనముఁ జేసెను.

రాజు—ఓయీ! నీకుఁ గళ్యాణ మగుఁగాక

మన్నా—స్వామీ! దేవరకటాక్షమున నా కిదివఱకే కల్యాణమైనది

రాజు—ఓయీ! వెంచునాయకుఁడా! కల్యాణ మనిన శుభ మని నా యభిప్రాయము కాని నీకుఁ బెండ్లి యైనదని నేను మున్నె యెఱుంగుదును

మన్నా—దేవా! మహాప్రసాదము మీకు సర్వముఁ దెలిసినచో నేను చెప్పవలసిన దేమున్నది. సాధారణముగఁ గల్యాణ మనినఁ బెండ్లి యని వాడుకచేత నేనట్లంటిని.

రాజు—ఓయీ! నీ కీయుంగరము మెచ్చట లభించినది?

మన్నా—నాకిది గంగానదీశాఖాసమీపమున వేఁటకై పోయినప్పుడు కనఁబడినది. దానిని దేవరకు సమర్పింపు మని పంపితిని.

భర్త—నే నొక స్త్రీవిషయము నీతో వెనుకఁ జెప్పియుంటిని. నీకు స్మరణ యుండియుండవచ్చును. ఈయుంగులీయకము లభించినప్రదేశమున స్త్రీ పదచిహ్నము లేమయినఁ గన్పించినవా? నేను చెప్పినట్లు చూచితివా?

మన్నా—అయ్యా! చూచితిని. ఆమెయడుగులజాడ నదియొద్దకుఁ బోయినట్లు కనఁబడినది.

భర్త—హా! మందభాగ్యుఁడనుగదా? అని యువనత్రవదనుఁడై దుఃఖవిమగ్నుఁ డయ్యెను.

మన్నా—దేవా! ఆమెకొఱకై పరితపింప నేల? మీకా మె యెట్టి బంధుపురాలు? దాఁచక నాతోఁ జెప్పుఁడీ.

ఛత్ర—ఓయీ ! ఆమె నా కెట్టిబ ధువురాలైన నేమి ఫలము ? అన్నియు వ్యర్థము లయ్యెనుగదా?

మన్నె—అయినను జెప్పవలయు నని నా ప్రార్థన. ధైర్యమును దెచ్చుకొని యానతీయవలయును.

ఛత్ర—ఓయీ ! ఆమె లోకపావని. సకలకల్యాణగుణనిలయ. ఆమెవంటి సౌందర్యరాశి లేదు ఆమెను బరిణయము చేసికొమ్మని నాకు గురువుల యాజ్ఞయైనది. అట్లు దేశబంధు ఛత్రపతిశివాజి యను మహారాష్ట్రాధికారిచే విజ్ఞప్తి యొనర్పంబడినది. అది మొదలామెను నాయర్థాంగిగ భావన చేసికొని యవనదుర్మార్గమును సంహరించినపిదప నామెను స్వీకరించు తలంపున నుండునంత నామెతండ్రిని నామీదికి యుద్ధమునకుం బంపి యిల్లు దోచిరి. అప్పుడా దేవి వీరావతారయై వారల వధించి తా నెటకో పోయెనట. అది మొదలామెకొఱకనేక ప్రయత్నములు చేసితిని. ఆమెపొడ నుంతయు గానరాలేదు. ఆమె మృగాదులవలననో యాత్మహత్యవలననో మరణించినట్లెంచితిని. తరువాత నీవలన నొకచిత్రపటము నీయుంగరము నామెను సంబంధించినవి లభించెను.

మన్నె—మహారాజా ! అగ్రహము సేయకుండు రేని యొక్కమాట నడిగెదను.

ఛత్ర—ఓయీ యడుగవచ్చును. ఆగ్రహమేల?

మన్నె—స్వామీ ! శంబరపురాధీశ్వరుండైన వీరవర్మ పుత్రికను వివాహమాడెద రని మండలమెల్ల కింవద తి వ్యాపిం

చినదికదా? ఇప్పు డీమెను గుఱించి యింత తపించుచుంటి రిదెట్లు ?

భర్త—ఓయి! నిశ్చయముగఁ బ్రసన్నముఖి మరణించి నదానిగఁ దలంచి మాగురువులైన యోగీంద్రులవారు తిరిగి తనభావమందు నామెను పరిణయముగమ్మని నాకుఁ జెప్పినారు.

మన్నె—ఒకవేళ దైవకృపచేత నామెయే పర్వతగుహ లలో దపశ్చర్యానియమిత్రమై నుండి తిరిగి వచ్చినచో నిం దెవ్వరి ని స్వీకరింతురు ?

భర్త—ఓయీ! నా కంతటి యదృష్టము పట్టునా? న న్నేల యభిలాష పాలుఁ జేసెదవు? దైవకృపచేతఁ దిరిగి యామెప్రసన్నమైనచో ముందుగ నామెనే స్వీకరింతును.

మన్నె—కాని యామెను ద్వితీయమహిషిగ నంగీకరిం పక తప్ప దనియే కావా తమయభిప్రాయము ?

భర్త—ఓయీ! యామె యెందైన జీవించియుండు నని నీ కనుమానము పుండుట కాధారము లున్నవా? ఉండినచోఁ జెప్పి నాకుఁ బ్రాణదానము సేయుము.

మన్నె ఆనాఁడు నదియొడ్డునకుఁ బోయిన చరణసర ణియే మఱియొకచోట నదినుండి భూభాగమునిూఁదికి వచ్చి నట్లు కనఁబడెను.

భర్త—అట్టులయిన నీ పాపదప్రచారచిహ్నముల నవ లోకించి యోచించి యామహిళామణిని వెదకి కనుఁగొని రమ్ము. ఈ కార్యభారము నీతల నిడినాను.

మన్మ—స్వామీ! అట్టిమోహమైన నెన్నఁడుఁ జూడ లేదంటిరికదా? మీరు చూడని యీ నెలంత యందక త్తె యనియు,సుగుణార్ణవ యనియు మీ కెట్లు నమ్మకముండును? ఇప్పుడు మఱొక నారి వచ్చి నేనే ప్రసన్న నని చెప్పిన మీరు మోసపడుదురుకదా?

ఛత్రి—ఓయీ! అట్లెన్నటికిని జరుగదు. యోగీశ్వరుండు సర్వము నెఱింగిన మహానుభావుఁడు. వారివలననే దేశో ద్ధారణకర్మ జరుగుచున్నది. కావున నందువిషయమై శంక లేదు కావున నీవు సర్వగుహాంతరాళముల నన్వేషించి యీ మెహా కాంచిరమ్ము పిమ్మట నామె సంవర్శనమునకు నేనే పోయి తోడితెచ్చెదను.

మన్మ—మహారాజా! మీయాజ్ఞానుసార మిటులే వెళకెదను. నాకనుజ్ఞ నిండు.

ఛత్రి—ఓయీ! నీవు చెంచువాఁడవైనను నా కేమో నీయం దత్యంతమైత్రి పొడ సూపుచున్నది. నిక్కముగ నిన్ను విడిచియుండుటకుఁగూడ నామన సొల్లకున్నదికాని యనంతర కార్యము సేయుటకు నీవే కర్తవాటచేత నిన్ను విడువవలసివ చ్చుచున్నది. కావున కార్య మెట్లుచేసెదవో.

మన్మ—మహీపాలా! మీకార్యములు సర్వములు నావికాని మీవికావు. వేయేల? మీరే నేను మీసంతాప ము నాసంతాపము మీ సంతోషము నాసంతోషము. కాని తరువాత నెటువచ్చినను బుత్రికావియోగభారమున రాగిన్దైవి

న రామసింగుగారిని మాత్రము మీరు వెతకించి మీ రాయ
నను సత్కరించుచుండుఁడు. నే నా ప్రసన్నముఖి దేవి విషయమై
ప్రయత్నింతును.

భర్త్రు—అది యుక్తమే. వారిని వెతకించి వెంటనే
రప్పించెదను.

మన్నె—నేను సెలవు తీసికొనెదను

అని చెప్పి విడువలేక వెనుకకుఁ దిరిగి చూచుచుఁ యిరీ
ద్వారమున నున్న మన్నెగాడ్రిఁ గలసి పురము నిర్గమించెను.
ఆహా! చూచితిరా! కామపిశాచమహిమ, మహారాజా
మన్నెగారి చేతికీలుబొమ్మ నైయెనుఁడు. ఆ ప్రసన్న విషయమై
నిరాశ చేసికొని శోకమున మునింగెను. కలదన్న హర్షాంబుధి
లో నోలలాడెను. అంత నా భర్త్రు నాలుఁడును బ్రసన్నాధీనచిత్తుఁ
డై మందిరద్వారము ననుసరింప మెల్లన నడచుచుఁబోయెను.

## ఇరువది నైదవ ప్రకరణము.

### శివరాత్రి.

అపకీర్తిమాట పుట్టిన వెంటనే దేశమెల్ల వ్యాపించినట్టుల
గాఢాంధకార మైన చీకటి హరిదంతవ్యాప్తిఁ జెందెను. పలు
వురు దుష్టులచెంత నొక సామాన్యగుణవంతుఁ డున్నను వాఁ
డప్పుడు మహాపురుషులలో నెంచఁబడునట్లు దిగంతవ్యాప్తిని
వహించిన పెనుచీకటిలో ముత్యములవంటి నక్షత్రములు చం

ద్వర్జితమైన యారాత్రి మిక్కిలి ప్రకాశించుచు వచ్చెను. ఆనాడు బహుళపక్ష ద్వాదశి తెల్లవారిన మహాశివరాత్రి అయ్యెను శివారాధనార్హ మయినది యగుటచేత భ్రాంతియు లుప్పొంగి శివునకు నభిషేకాది సమర్పనము సేయుచుందురు. అందులకై నర్మదానదీతీరంబునం బశుపతీశ్వరుని దేవాలయము మొకండు చిరకాలంబునుండియు సుప్రసిద్ధమై, యఖిలజన సేవితంబై యుండునది. అట్టి మహత్తరమైనవారదినంబున మానవజన్మ మెత్తిన ప్రతిమనుజుడును నా ప్రాంతమున కల్మషహరము లైన నర్మదానదీపుణ్యజలంబుల స్నాన మొనరించి పశుపతీశ్వరునకు నమస్కరింపనివా రుండరు. అందుచేత నాటనమున నుదయ మగుసరికె నర్మదానదీతటంబు జనసంకుల మయ్యెను. మందీకృత ... వాహ యయ్యెను నాటిదినంబు పర్వదినం బగుట నాతరంగిణి వాయువశంబునం జేసి యలలచేత ఝులఝుల మని ధ్వనిం జేయుచుండెను. యాత్రికు లన్యోన్యావలోకనానంద పరవశులై యొకరినొకరు పిలుచుకొనుసట్టి ధ్వనులచేత సంకల్పమంత్రముం జెప్పు బ్రాహ్మణుల భూరిధ్వను లంతరించుట లేదు. ఇట్లు వచ్చినవారెల్ల రన్నదీజలంబులయందు వగాహన మొనర్చి శివున కభిషేకాది సపర్యలం గావించి యాదినమున నుండుటకుం దగిననిలయములం జేరుచుండిరి. శంకరసేవాసక్తమైన యనేక యోగులు వచ్చి నదీస్నానము చేసి పశుపతీశ్వరుని దర్శించి యొక్కచెట్టుక్రిందం జేరి పంచిత్రిశిగొట్టములో వేసి యంగారము నంటించి "ఝుంతసాకా" యని పిల్చుచుం దద్ధూమం

బు మింటి కూఁడుచు "శంకరా" యని కన్నులు పారవశ్యము దెలుప మాటిమాటికి నెదుట నున్నయగ్నికుండమున వెలుఁగు చున్నమూర్చఁకుల నెగఁద్రోయుచుండిరి. కొందఱు రాజభటులు మాత్రము వచ్చి యుదయముననే స్నానముఁ జేసికొని వచ్చి నవారి నెల్లఁ బరీక్షించుచుండిరి. ఒకయోగికి నీళ్ళు ద్రాగుటకు సొరకాయబుఱ్ఱయుఁ గాని పొగపీల్చుటకు గొట్టముగాని యగ్గి కారుగాని లేదు. మేనినిండ విభూతి నలఁదుకొని, యొకవిధమైె కావి గుడ్డలఁ గట్టుకొని వచ్చిన స్త్రీల నన్వేషించుచు, నిరుత్సాహుఁడై మనస్సులో నేదియో యనుకొనుచు, తీర్థయాత్రాపరుల నందఱ చెంతకుఁ బోయి చూచుచు మరలిపోవుచుండెను. అట్టివానిని రాజభటులు చూచి వాని ననుసరించి తిరుగుచు నీ వెవ్వఁడ వని ప్రశ్నించిరి. కాని యాజోగి నే నొకజోగి నని చెప్పుటయేకాని రెండవమాట యాతనినోటనుండి వెడలలేదు. అయినను సాయంకాల మగువఱకు నాజోగినిమాత్రము రాజభటులు విడువరైరి. ఆజోగి సాయంకాలమువఱకుఁ దిరుగుట యేకాని స్నానముసేయుట గాని శివసందర్శనము సేయుటగాని లేఁపోయెను. క్రమముగ నంధకారము వ్యాపింపఁజొచ్చెను. ఆజోగియు నెవరును వసింపనియొక చెట్టుక్రిందికిఁ బోయి కన్నుల నీరుగార్చుచుఁ గూరుచుండెను. రాజభటులు నాచెట్టుక్రిందికిఁ జేరి యిట్లు సంభాషింపఁదొడఁగిరి.

భటు—మహాత్మా! యోగీంద్రా! ఈదినమున మహాశివరాత్రి కదా? అందఱును స్నానము చేసి శివుని

దర్శించిరికదా? నీ వేల స్నానము చేసి హరుని సేవింపవైతివి.

యోగి—నాకు స్నానముతో నిమిత్తము లేదు. శివునితోఁ బ్రయోజనము లేదు.

భటు—ఏమి! ఈశ్వరారాధననిమిత్తము లేని మనుజుఁ డొక్కఁడును లేఁడుకదా. అందు యోగులకు నీశ్వర సేవ ముఖ్యముగదా? నీ వేల నిరసించెదవు?

యోగి—అయ్యా! నాతో మీ కీతర్క మేల? బ్రతికి యున్నవార లీశ్వర సేవకాని జీవన్మృతులకు నారాధనలతో నిమిత్త మేమియుండును?

భటు—నీవు బ్రతికియున్నావు కదా. నీ కేల యింత వైరాగ్యము?

యోగి—నేను బ్రతికియున్నానో లేదో మీ కేమి తెలియును? నా మొగఁ బ్రాణముపోయినది. వట్టికట్టె తిరుగుచున్నది.

భటు—మహాత్మా! మీరు ప్రాణమువంటి వస్తువును బాసియున్నారు కాఁబోలును. మా కెఱింగించెద రేని సమాకర్ణింతుము. తెలియఁజెప్పుఁడు.

యోగి—ఆవస్తువు నశించిపోయినది. లేకున్న నెందు వగపడకుండునా?

భటు ఏమో మీ రెట్లు నిర్దేశింపఁగలరు? దైవవశమున మీకన్నుల కగపడక యొందైన నుండరాదా? మరలఁ బ్రాప్తింపరాదా? అంతమాత్రమున మీ రావస్తువువిషయము నిస్పృహఁ జెందరాదు.

యోగి—అగోచరపదార్థము విషయమయి నిస్పృహా త్మకఁ డేమి సేయుము నెదవు ?

భటు మీరు మా వెంటరండు. పోయినవస్తువు మా కెఱింగించితి రేని మేము వెతకి తెచ్చెదము. మీరు మా రాజుగారి యనుగ్రహమునకుఁ బాత్రులు లయి యుందురు.

యోగి—మీ రెవ్వరు ? మీ రాజెవ్వరు ?

భటు—ఎఱుఁగరా క్షత్రపాలమహీపాలుని, దేశోద్ధారకుని ? వారి యనుచరులము మేము.

యోగి—మీరు నా వెంట నంటుటకుఁ గారణ మేమి ?

భటు—మహారాజుగారి యాజ్ఞ చేత.

యోగి—మహారాజునకు నాయవసర మేమి వచ్చినది?

భటు—ఆయంశము మేము చెప్పెదము కాని మిమ్ములను విడిచిన వస్తు వేదియో చెప్పుఁడు.

యోగి—ఓ మూఢులార ! ఏమని చెప్పుదును ? నా యనుంగుబిడ్డ—"ప్రసన్నముఖి"—అని యేమ్పను.

భటు—తెలిసినది తెలిసినది. నీయంత వెఱ్ఱి లేదు కాని మా మహారాజునకును బ్రసన్నముఖి యందలి ఓచ్చియే బాధించుచున్నది కావున మీ రిద్దఱు నొకచోట నుండఁదగినవారు రముల్న.

యోగి—ఎక్కడ నున్నను దుఃఖసముద్రమున నూపిరి యాడకుండ మునుంగుట కేనా ? దరి యను రెండవముకులవతరించునా ?

భటు——లేదు. భగవంతునికృపవలన మీయిరువురికినొక నొక రచింపఁబడినది. కొలఁదిదినములలోఁ దీరమును జేరి కృతార్థు లగుటకుఁ గావలసినన్ని కారణములు కనుపట్టుచున్నవి.

యోగి——ఏమో యోఁడమాపులను గాంచి జలభ్రాంతి పడినచందమగు నేమో? ఎందుల కాశామధువును నానాల్కకొనను వ్రాసెదరు?

భటు——అటుల కాదు నమ్ము

అని చెప్పి చేయి పట్టుకొనిరి. యోగియు వారివెంట నడవఁజొచ్చెను కృతార్థుల మైతి మని భటులును సంతసించుచు నారాత్రి యాయూరిబయలఁ విలాసపురమునకుఁ బోవుమార్గము ననుసరించిన సత్రపుటరుగుమీఁద నిద్రించిరి. ఆపురము పేరు శంబరపురము ఆనాటిరాత్రి యాపశుపతీశ్వరునకు లింగోద్భవకాలమువఱకు నభిషేకాదులను జేసి యంతట సహస్రనామపూజయుఁ గావించిరి. ఆస్వామికి శంబరపురాధీశ్వరుఁడైన వీరవర్మ ధర్మకర్త యగుట చేత నారాజేంద్రుఁడు సకుటుంబముగ వచ్చి యాయుత్సవమును గావించి లింగోద్భవకాలానంతరము ఫలాహారము చేసి మరల నీశ్వరారాధనకై దేవళంబునకుఁ బోయియుండెను తిరిగి స్వామిని సందర్శించుటకు మేలుకొనలేక రాజభార్యయు పుత్రికయైనచంద్రికయు నివాసగృహమున నే శయనించిరి. పండుకొనుటతోడనే రాజమహిషియైనసావిత్రికి నిద్దుర పట్టెను రాజపుత్రిక శివరాత్రి మహోత్సవదర్శనమాట యెటు లున్నను బడిపట్టు ఛత్రసాల

మహీపాలుఁడు వచ్చునేమో కన్నులారఁ బ్రత్యక్షవిగ్రహమును జూచి యానందింపవలె నని పుట్టినయాసతో వచ్చినది కాని యా మహారాజు నేకరాజకార్యపరతంత్రుఁ డగుటచేతనో ? ప్రసన్నముఖవియోగ పరితాపకారణముచేతనో కాని యానవత్సర మచ్చటికి రాలేదు. స్నానము సేయునపుడు కాని శివసందర్శనమునకుఁ బోయినపుడుకాని యాచంద్రిక ఛత్రసాలమహీనాథునే యన్వేషించుచుండెను గాని తదితరమును జూచుటలేదు. ఎవరి నైన నడుగుటకు సిగ్గగుటచేత నడుగలేదు పూజాంతమువఱకు నామహారాజు కనఁబడకపోవుటచేత రానేలేదని స్థిరపఱచుకొని నాభాగ్యము తటస్థింపలేదుగదా యని యాత్మలోఁ జింతిల్లుచు ఛత్రసాలార్పితచిత్తయై నిద్దురపట్టక కొంచె మటు నిటుతల్పంబునఁ బొరలి పొరలి చలిచేత ముడుచుకొని ముసుఁగుపెట్టుకొనెను అంత నేదియో చప్పుడు వినవచ్చినది. ముసుఁగుఁ దెఱచి యేమిది యని యోచించెను గాని మరలఁ బండుకొని నిద్రించెను. ఆభవన మప్పటప్పట వచ్చినపుడు ధర్మకర్త లుపవసించుటకై తొల్లి చంపతిరాయునిచేఁ గట్టఁబడినదికాని, యాగృహము విహారయోగ్యగృహము కాదు. ఇతరు లాగేహమునకుఁ జుట్టు నున్నప్రాకారము నవలీలగ దాఁటి లోపలఁ బ్రవేశించుట చాలసులభము. అందుచేతఁ గొందఱు తస్కరు లామందిరంబుం బ్రవేశించి, యా చంద్రిక శయనించినమంచమును శిరంబుల నిడికొని యమోఘముగ నాపాణిద్వార కవాటమును దెఱచుకొని కొంపోయిరి.

———

## ఇరువదియాఱవ ప్రకరణము.

---

### చంద్రిక.

మిథ్యాప్రగల్భవచనచమత్కారము సత్యవాక్కుల ప్రాశస్త్యమును బ్రకాశింపకుండఁ జేయునట్లు శిశిరకాలపు రేయను భాస్కరుని కాంతి వెలికిఁ జిమ్మనీయకుండఁ జేయుచుండెను. అప్పటికి యుదయగిరిశిఖరమును భానుఁ డధిష్ఠించి నాల్గుగడియ లైనది. అయినను బాగుగ వెలుఁగు కనుపట్టుట లేదు. ఆప్రదేశము దట్టము నైన వెదురుపొదలచేత వ్యాప్త మయినయావరణము. అందు మధ్యభాగమున నొకపర్యంక మొప్పియుండెను. అందుపై నొకసాధ్వి మునుఁగు తన్నుకొని పండుకొనియుండెను. యాశితపర్వగుల్మముల నడుమ గూడులు కట్టుకొని విహంగములు వసించుచు తెల్లవాఱినదాట మేఁతకై పోవనెంచి పదములను గుంచించి చెట్లపైనుండి యెగిరిపోవుటచేతఁ బుట్టినధ్వనులచేతఁ గొంచెము మేల్కాంచి మెల్లన మునుఁగును దెఱచి చూచువఱకు నెటుచూచినను భయంకర మైనవెదురుపొదయే కాని వేఱొండు లేదు. మధ్యపది మూరలుమాత్రము నిష్కంటక మై నిర్మలమైనప్రదేశముమాత్రము కనుపట్టుచున్నది. అప్పుడు గుండె ఝల్లనితల్లడిల్లెను. హా ! దైవమా యని మూర్ఛిల్లెను. పొదలో నొకభీకర మైన

ధ్వని కర్ణరంధ్రములఁ బ్రవేశించెను. అంతట మూర్ఛ దెలిసి నలుకెలంకులఁ జకితేక్షణయై చూచెను. పొదలలోనుండి య వల నొక్కభల్లూకము పోవుచున్నట్లు గాంచెను. అంత నా యువతీలలామ యిట్లు పరితాపపడఁ దొడంగెను. అక్కటా! భవనమున నిద్రించిన నే నీయరణ్యమధ్యమున నుండుటకుఁ గారణమేమి? చెప్పవూ? న న్నెవ్వ రిటకుఁ దెచ్చినవారు? అయ్యో! యెవ్వరును గన్పింపరే! ఏదేని యొకమహాభూత ము తెచ్చియుండలేదుకదా? అట్టే కావచ్చును. లేకున్నఁ దస్కరు లైనచోఁ జెంతనుండరా? భూషణముల దొంగలింప రా?. ఒక్కయాభరణమైనఁ గడలలేదే, అన్నా! యేమి దిక్కు? నే నెట్లుపోవుదును? చుట్టును దట్టముగ నల్లుకొనిన యీవెదురుపొదలోనికి నే నెట్లు వచ్చితిని? తప్పక న న్నేభూత మో తెచ్చి యీవెనుపొదలోఁ బెట్టిపోయినది. ఎవరిని బిలు తును? ఈయరణ్యమున నాకు మృగములు కాక మనుష్యులు సహాయుపడువారుందురా? అక్కటా! మృగములుమాత్ర మే మిసహాయము చేయును?. తా మొక్కసారి భక్షించి నాకష్ట దశ నంతము చేయునట్టి పుణ్యముఁ గట్టుకొనును ఏమో యీ భయంకరారణ్యమున మనుష్యులు కనఁబడ రనుసంకల్ప మేల? పిలిచిన విఫలమనోరథ నైనపిమ్మటఁగదా యట్లు తలచుట. "హా! ఆర్తావనపరాయణులార! హా కృపాకరులార! దీను రాల నన్నుద్ధరింపుఁడు వేగ వచ్చి రక్షింపుఁడు రక్షింపుఁడు" అని యొకమొఱ్ఱ వెట్టెను. పొదచాటుననుండి "యెవ్వ రావి

లుచువారు ? ఎక్కడ నుండిటివి?" అని వినఁబడెను. „అయ్యో! నే నొకరాజపుత్రికను, భవనమునందు శయనించిన నన్ను నెవ్వరో యీయరణ్యమునఁ బడవైచిరి, మహాత్మా పుణ్యముఁ గట్టుకొనుము. వేగ వచ్చి బ్రతికింపుము." అని జాలి పుట్టునట్లు పలికెను. మరల బొందచాటున నుండి „నే నీస్థానమునకు వచ్చుమార్గము నాకుఁ దెలియదు. అది కాక నిన్నుఁ దెచ్చినవారు న న్నేమి సేయుదురో ? కావున నా దారిని నేను బోనెరుదను." అని యిట్లు వినఁబడెను స్వామీ ! నీకు వేయువందనములు. ఎట్లయినను మార్గమును దెలిసికొనివచ్చిరక్షింపుము." మరలఁ బొందచాటునుండి „నా కంతయునవసరము లేదు. ఈ దినములలో శుష్కప్రియములకు సంతసించువారు లేరు." అని వినఁబడెను.

స్త్రీ—అయ్యో. నాయనా ! నీయుపకారమును మఱవను. రమ్ము రమ్ము. రక్షింపుము. అంతటఁ బొందచాటునను ముఖద్వారమునకు మఱియొకగుల్మ మడ్డముగ నుండుటచేఁ దెలిసికొనరానిమార్గమునుండి యొకపురుషుఁడు ప్రవేశించి, „ఓకాంతారత్నమా ! నా కేమి యుపకారము చేసెదవు" అని యడిగెను.

స్త్రీ - తండ్రీ ! ప్రాణదాత కేమిచ్చినను ఋణముతీరదు. నాకంఠాభరణమును గైకొని రక్షించి నాతలిదండ్రులఁ జేర్పుము.

పురు—నాకు నీ యాభరణములతో నిమిత్తము లేదు. మఱేమి యిచ్చెదవో యిచ్చితివేని నిన్ను దరిఁ జేర్చెదను.

స్త్రీ—అక్కటా! ఇంకేమి యీఁగఁగలను? శరీరమునఁ గలఁ యాభరణము లన్నిఁటి నిచ్చివేసెదను. తండ్రీ రక్షింపుము.

పురు—అదిగో తండ్రీ యనుమాట మానుము. చెప్పుట కేమున్నది? అంతయు నీ వెఱిఁగినదే.

స్త్రీ—శివశివా యని చెవులు మూసికొని, "అన్నా! ఆపన్నురాలు బిడ్డతో సమానురాలు నీ విట్లు పలుకఁదగునా? నీవు నాఁడుపుట్టువుతోఁ బుట్టలేదా?" యని పలికెను.

పురు - నీ వేదాంతములు నా చెంతఁ బనికిరావు సుమీ, నే నూరక యుపకారము సేయునట్టి వ్యర్థజీవనుఁ డను గాను అంగీకరించి ప్రాణములఁ దక్కించుకొనుము.

స్త్రీ—తండ్రీ! అనుపమానమయిన మానమును గోలుపోయి తుచ్ఛము లైన ప్రాణముల కాసించు నీచు లెందైన నుందురా? ఇవేటిమాటలు? మహాపాపకర మైన కాముకజనకల్పమును జడువకుము.

పురు—ఛీ ఛీ. తెలివితక్కువదానా? అజ్ఞానురాలా? ఈప్రాణము శరీరమున నుండుట యెందులకో తెలియునా? ఇట్టి మహానంద మనుభవించుటకే సుమీ! గోడయవతల నున్నవస్తువు మనకుఁ గనఁబడనట్టులె యుత్తరజన్మముమాట

మెవ్వరికిఁ దెలియఁగలదు? కావున నెప్పటి కప్పటి యానంద మనుభవించుట తెలివిగలవారి లక్షణము. కావున నాచేతి నైకుంభము నెందులకుఁ బోర్లఁద్రోసికొనెదవు? ఇఁక నీవేదాంతము కట్టిపెట్టుము.

స్త్రీ—హరహరా యని చెవులు మూసికొని ఓ హృదయమా! కర్ణములను భేదించిన నీమాటలకు నీవింకను సహస్రధాభిన్నము కాకుండఁగ నుంటివా? లేక లోహతుల్యమవైతివా? ఓ పంచభూతములార! ఈ దుర్మార్గుని భాషణము లాలకించిన మీ కాగ్రహము వృద్ధిబొంది విజృంభించి వీనిని హతమార్ప రాదా? నే నిఁక జీవితాశ వదలితిని. ఓ పృథివీతల్లీ! ఈకామాంధుని నీవు కనినదాన వౌటచేతనా యింకను భూమిలోఁ బూడ్చివేయకుంటివి. ఓయుదకంబులారా! ఒక్కసారి పొంగి యీ మనుష్యపశువును ముంచివేయరాదా? ఓ వైశ్వానరా? వీనినేల దహింపక యూరకుంటివి? ఓ వాయుదేవుఁడా! యీ తుచ్ఛ నాకసమునమీఁది కెగఁద్రోసికొనిపోయి యేపర్వతశిఖరముమీఁద నైనఁ బడవైచి శిరము శతధా భిన్న మగునట్లుగఁ బగులఁగొట్టరాదా? ఓఆకాశమా! నిన్ను వ్యాపించిన యీదుష్టుని సంహరించి లోకమునకు మేలు సలుపరాదా? హా క్రూర! నే నొంటిదానననని నన్ను దుర్భాషలాడ సాహసించుచున్నావు. నీవు నా ప్రాణములఁ దీసెద వని సుంతయైనను జడియుచున్నదాననుగాను. తృణసమానములుగఁ దలంచి యసువుల విడిచెదనుగాని మానభం

గమును గానీ యనుచుఁ" యని గద్దరించి పలికెను. అంతట నాపురుషుఁడు తనకు వశ్యురాలు కాదని యోచించి "ఓసీ రంభ రంభ. ఈమెను బంధించి మనకోరికల దీర్చికొందము" అని పిలుచునంతలో మఱి యొకఁడు వచ్చి "ఏమిరా నీ మాట లక్ష్యము సేయుచుండుట లేదుగా సరే కానిమ్ము నీవు చెప్పిన మార్గమే దీనికి తెల్ప" యని పలికెను. అంత నాయేవురను గాంచి తన్నుఁ దెచ్చిన తస్కరులు వీరే యని తలంచికొని. మహావాతకంపిత యైన మాధవీలతచాడ్పునఁ గడగడ వడంక సాగెను. కనుదమ్ములనుండి నీరు కాల్వలై ప్రవహింపఁజొచ్చెను. కరములు మోడ్చి "తండ్రులారా! మీపుత్రిక నని పలుసార్లు ప్రార్థించుచున్న నన్నిట్లు పరిభవించుట న్యాయమా? మీ రేయాశమును బరిశీలించినను నిక్కముగ వ్యర్థ మనియే మీకుఁ దోచునుగదా? వాయుపూరిత మైన తోలుతిత్తి వంటి యీ మనుష్య మైన శరీరమును జూచి మీరు కాంక్షింప న్యాయమా! అందలి ప్రాణవాయువు పోయినపిమ్మట నొక గడియమైన నీ శరీరకాంతిపటుత్వము నిలుచునా? అంతలో దుర్వాసన పుట్టి చేరుటకు శక్యముగాని మర్దళపాలగునే. అట్టి క్షణకాలసౌందర్యమును గాంచి మురిసి పవిత్రమైన నా మానభంగము చేసిన మహానరకముకదా? తండ్రులార! రక్షింపుఁడు రక్షింపుఁడు." అని చరణములమీఁదఁ బడినను దయ రాంగియుండొకనికిని జాలిపొడమలేదు కాని తాముతలంచినబలాత్కారప్రసక్తికి విముఖులయిరి. అటులైననీమెను దిరిగి తుంచము

మీఁదనైచి బంధింపుఁడు, మనయజమానున కర్పింతము. ఆతఁడామెనే రక్షించునో యీమె యాతనినే రక్షించునో చూచెదముగాక యని యొక్కఁడనెను. అట్లే సేయుద మని యందఱును సమ్మతించి యాసాధ్వి చేతులు కాళ్ళుఁ గట్టి తిరిగి యామంచమువైఁ బరుండఁబెట్టి మంచమునకుఁ గట్టి యందఱు నెత్తిని బెట్టుకొని పొదనుండి వెడలి యరణ్యమార్గంబును బట్టిరి. ఆమంచముపైఁ గట్టఁబడి "హా! మహానుభావులారా రక్షింపుఁడు రక్షింపుఁడు" అనియెడుధ్వని యడవిలో ననేక కోకిలాలాపపూరితమైన వసంతమును స్ఫురింపఁజేసెను. ఇట్లొకముహూర్తకాలము మోసికొనిపోయిరి అంతట గగనంబునఁ "రింగు" మనియెడు ధ్వని వినఁబడఁజొచ్చెను. వాహకులిదేమిధ్వని యని యాలోచించు చుండఁగనే వెనుక నున్న నలువ్వురును కృత్తచరణులై భూమిమీఁదఁ గూలిరి. అంతట మంచము క్రిందఁబడెను. తక్కిన నలువ్వు రతిభయంబునఁ జూచుచుండఁగనే వారును మొదటివారి యవస్థనే యనుభవించిరి. కొందఱికాళ్ళు మోఁకాలిపై భాగమునను గొందఱికాళ్ళు క్రిందిభాగమునను నఱుకఁబడినవి ఆసాధ్వి, "యిదేమి భగవంతుని మాయయా" యని యాశ్చర్యపడుచుఁ గట్టులనుండి తప్పించుకొనలేక యట్టులే పడియుండి యిష్టదైవమును బ్రార్థించుచుండెను అప్పుడు ముప్పురు చెంచువాండ్రరుదెంచిరి. వారిని జూచుటతోడనే దావాగ్ని దగ్ధమైన మల్లికాలతకు వర్షసమాగమమైనట్లు వారిరాక యామెకు నాహ్లాదకరమైనది.

అం దొకఁడు సమీపించి "అమ్మా నీవెవ్వతె" వని యడిగెను. ఆకట్టులనుండి "తండ్రీ! నీవు నన్నమ్మా యనుటచేత నే నాయాపత్తు తీరినది. నేను వీరవర్మ యను శంబరపురాధీశ్వరుని పుత్రికను; చంద్రిక యను పేరుగల దానను" అని చెప్పవిని తల్లీ భయము వలదని కట్లు విప్పి యూరార్చెను. అత స్కాకులం జూచి "ఓరీ పాపాత్ములారా! మీ రెవ్వరు? ఎందు లకీమె నీగొనిపోవుచున్నా" రని ప్రశ్నించెను.

శిక్షితుఁడు—ఓ చెంచులారా! ఎందులకైన నేమిప్రయోజనము మా మనోరథములు విఫలములు చేసినారు. మీరు స్వపరపక్షనిర్ధూమధాము లని వెల్లడియైనది భయంకర రణరంగములనైనఁ జావనిమేము మీచేత హతపాదులమై కూలితిమి ఇంత యొందులకు? మా చేత ఖడ్గము లున్నచో మీప్రభావములును మాప్రభావములును వెల్లడియగును.

చెంచు - ఓరీ! ప్రభావముమాట లటు లుంచుము. మీ రీసాధ్వి నిట్లు గొంపోవుటకుఁ గారణముఁ జెప్పుఁడు.

శిక్షి—ఈమెం గొంపోయి మాప్రభువునకు సమర్పించుటకు.

చెంచు—మీప్రభు వెవ్వఁడు?

శిక్షి—రణమల్లాఖాను.

చెంచు—వాఁడు చావక యింకను బ్రతికియున్న వాఁడా

శిక్షి—ప్రసన్నముఖిని గలయవలె నాతఁడు చావవలెను.

చెంచు—ఆనాఁడిఁక నొకదెబ్బగొట్టిన నపుడే భూభారము తగ్గిపోయియుండునుగదా ? అరే! యింకను బ్రసన్నముఖియం దభిలాషను మానలేదుకా ?

• శిక్షి—ప్రాణాంతమువఱకు మానఁడు. ఇంత యేల? సైంధవునివలె మీ రడ్డు వచ్చితిరికాని లేకున్న యీపారి వారికోరిక తప్పకతీరకుండునా ?

చెంచు—ఈమె ప్రసన్నముఖయేనా యేమి ?

శిక్షి—ఆ. అందుచేతనే కొంపోవుచున్నాము కాని యీమె చంద్రిక యని యిప్పుడు తెలిసెను.

చెంచు—ప్రసన్న యింకను జీవించియున్న దని మీ ప్రభువు తలంచెనా ?

శిక్షి—తలంచుటచేతనేయీమెనుగొంపోవుచుంటిమి.

చెంచు—ఓరీ ప్రసన్నను మీకుఁ జూపెదను గొంపోఁగలరా ?

శిక్షి—మే మింకఁ గొంపోవుటెక్కడికి ? మాశరీరములె మాకు భారములై భూమిపై విడిచిపెట్టి పోవుచున్నాము. మేము మంచియో చెడ్డయో రాచకార్యములందు భక్తితో మెలఁగుచున్నవారము. వారియాజ్ఞ పాపహేతువైనను జేయక తప్పదుకదా ? కావున నింతవఱకు రాజకార్యమును జేసితిమి కానినిన్నొక్కటివేఁడుచున్నాము. అందులకు నీవంగీకరింపుము.

చెంచు—దేని నడిగెదరు ?

శిక్షి—నీవు దేనిని మావిషయమునఁ దలంచితివో దానినే యడుగుచున్నాము. వేవేగ యిచ్చి మమ్ముల నుద్ధరింపుము.

చెంచు—మీవిషయమై నేను దేనినిఁ దలఁచితిని?

శిక్షి—తలఁపలేదా ? మరణమును.

చెంచు—మరణమును దలంచిన మీకు నిట్టిఘోరకృత్యమునకుఁ దగినశిక్ష యెట్లు జరిగెను ?

శిక్షి—మరణమునకంటె గొప్పశిక్ష యేమున్నది ?

చెంచు—మరణదండన శిక్షలోనిదే కాదు. మోక్షములోనిది. అట్టి మోక్షమును మీకొసంగరాదు. మీరు వికలాంగులై బాధ నందుచుండుటయే గొప్పశిక్ష.

శిక్షి—హా ! మందభాగ్యులముకదా, మహాత్మా ! నీవు చెంచువాఁడవు కావు. మమ్ముల నెట్టులయినఁ జంపిన నీచంద్రికాదేవిఁ గాఁచినపుణ్యముతోఁ దుల్యమైనపుణ్యమును నీవు పొందఁగలవు వేగఁ జంపుము. ఈ వ్యథ ననుభవింపలేకుంటిమి. నీకు వేయివందనములను జేసెదము.

చెంచు—ఓరీ ! మీరు మోక్షమున కర్హులు కారు. మిమ్ముల నేను జంపను.

శిక్షి—హా ! దైవమా మా కీపాట్లాప్రసన్నముఖి దేవివలనఁ గదా కలిగినది. ఆప్రసన్న చచ్చినదో బ్రతికినదో

కాని మాకుఁ జావు దొరకలేదు. ఈ పాపమంతయు నాపత్రినన్ను కుఁ దగులుఁగాక.

చెంచు—ఓరీ! మీరు చేసినపాపము పత్రినన్ను కేలఁ దగులవలెను.?

శిక్షి—అయ్యా! మా క్రీపాత్రగర్భ మామువలననే కలిగినది. అటులు కాకున్న నామె మోమును జూచి మా రణమల్లాఖాను వరించుటేమి? పిమ్మట నామె నిరసించి కన్నుల నమ్ము చల్లి పాఱిపోవనేల? ఆమెకై మేము పరుఁబడ నేల? నీచే నీగతి బాధింపఁబడ నేల? కావున మాకష్టముల కామెయే కారణము. కావున మామనస్తాప మా సాధ్వికిఁ దగులుఁగాక.

చెంచు—ఓరీ! ఇపుడు మిమ్ముల నేమి చేయు మనెదరు?

శిక్షి—దయ యుంచి చంపు మనెదము.

చెంచు—అటులే చంపెద నుండుఁడు.

అని తనకరవాలంబున వారి కంఠనాళంబులు తునియ లుగఁ జేసెను. తరువాత రాజపుత్రితో "అమ్మా చంద్రికా దేవి! నీ విఁక భయమువలన విముక్తఁబడితివి. నీవు మా పల్లెకు రమ్ము. అక్కడనుండి మీపురమునకు వర్తమాన మంపి వచ్చినవారి వెంట నినుఁ బంపించెదను.

చంద్రి—తండ్రీ! అటులే వచ్చెదను.

చెంచు—అమ్మాయి! నిన్ను నేను రక్షించినట్లు నా కొక యానవా లొసంగవలయును.

చంద్రి — అటులే యీహారమును దీసికొమ్ము. అని యీయఁ బోయెను.

చెంచు — అమ్మా! నా కానవాలునకై యడిగితిని గాని అర్థకాంక్ష చే నడుగుట లేదు. ఉంగరమైనఁ జాలు నొక టి యిమ్ము.

చంద్రి — వ్రేలియుంగరము నిచ్చెను.

చెంచు — అమ్మా! నీకు నేను దండ్రిని జడియవలదు. రత్నాకరపురమునకుఁ బోయినదనిపించుకొనుము కాని శంబరపురము నకుఁ బంపెదను." అని చెప్పి వెంట నా చంద్రికాదేవిం గొంపోయెను.

## ఇరువదియేడవ ప్రకరణము.

## అన్వర్ ఖాన్.

తొల్లి వింధ్యభూమి రాక్షసప్రచారార్హమైనది. సోఁకు మూఁకలు సంయమీంద్రుల ననవరతము బాధపెట్టుచుండుట వాడుకయై యుండెను పితృవాక్యపరిపాలన వ్యాజమునం జేసి రామాదులు పొలసుదిండుల సంహరించి యా యరణ్యప్రాంత ములను నిష్కంటకముగఁ జేసిరి? తరువాత నాధారుణీఖండము మహర్షి నముయిన భారతీయజనులను బాధించు క్రూర

తురుష్కరాజచక్రము దేశోద్ధారకుఁడైన ఛత్రపాలునిచే పధింపఁబడుటచేతఁ బదిసంవత్సరములకు స్వరాజ్య ప్రకాశకు సౌప్య శాంతిని గాంచినది. ఆభూమి దట్టములైన గుట్టలచే నొప్పు యున్నది. అట్టిచోట సమితమైనక్షత్రియసేన రణమునకు నిరంతరసంసిద్ధముగఁ జేయఁబడియుండెను అయ్యది విశాల మైనప్రదేశము చెట్లన్నియుఁ గొట్టఁబడిన సంచరించుట కనువుగఁ జేయఁబడియుండెను శీతకాలముగుటచేతఁ బ్ర భాకర కాంతు లంత బాధించుట లేదు అప్పటికి జాముప్రొ ద్దున్నది. ఇట్లుండఁ దమకు వెనుకభాగమున నున్న పర్వత శిఖరమునుండి యొకశృంగనాదము వినవచ్చెను. ఆధ్వని వినుటతోడనే మహారాష్ట్రసైనికులు యుద్ధసన్నద్ధులయి యు చ్చచ్చటఁ బడియున్న కొండచాళ్ల వెనుకఁ గూచిరివాడులై యడఁగియుండిరి. అశ్వికులు కొండలవెనుక నాఁగిరి. ఆశృంగ నాదములు సేయఁగనె వారివెనుక నొకమైలుదూరమునన్న కొండశిఖరమున మఱియొక శృంగనాదము సేయఁబడెను. అట్టి శృంగనాదములపరంపరలచే శత్రువులువచ్చుచున్నారనుసంజ్ఞ శంబాపురమునకును దక్షిణప్రదేశములకును నయిదునిమిష ములలో వ్యాపించెను. తన్నాదము వినుటతోడనే సకలజను లును హుటాహుటిగ రణమునకుఁ బోవునట్టి యేర్పాటు చేసి రి. శృంగనాదమున గొరగేదెకొమ్ములకు భాంకారవము వచ్చునట్లు స్వరరంధ్రములనమర్చి యూదినచోఁ బుట్టినధ్వనికి శృంగనాద మని వాడుదురు. ఆయేర్పాటు ఛత్రపతిశివాజీయా

టవికులను వశపఱచుకొనినప్పుడు వారియిండ్లఁ బెండ్లిండ్లకు మంగళారావగీతికలు పాడుచుండఁ గాంచి యాశృంగనాదములను దమరాక తెలుపు తంత్రీవార్తలుగ నుపయోగపఱచికొని తత్సాహాయ్యమున శత్రుసైన్యముల నుఱుమాడి విజయలక్ష్మిని బాణిగ్రహణమై భారతమాత దుఃఖోపశమనముఁ జేసి స్వరాజ్యమును బ్రతిష్ఠించి దిగంతవ్యాపితమైన కీర్తిని గాంచెను. అట్టి శృంగనాదవార్తాప్రచురమే ఛత్రసాలుఁడు నేర్పాటు చేసికొనెను అందుచేత వార్తలతిత్వరితముగ నందుచుండెను. తరువాత సైనికులాశిలావరోధములసహాయమునఁ గాచికొని చూచుచుండఁ దురుష్కతీవ్రాగ్నిసూచకంబైన ధూమమో యనునట్టుల రాజసేనలకుఁ గొంచెము పురోభాగముననున్న కొండవెనుకనుండి సైనికపదోద్ధూతధూళీపుంజంబు బైలువెడలి వాయువశమున నంబరతలమును వ్యాపించి యకాలజీమూతసంఘంబులఁ గలుగఁ జేసెను. మేఘోదయకాలమున గర్జారవములు స్వాభావికము కానట్టులే యశ్వాలంకారకింకిణీక్రేంకారములును హేషారవములును వియ్యమునను మింట వ్యాపించెను. క్రమముగఁ దురుష్కసేన సంపూర్ణముగఁ బర్వతశృంగాటకము నధిష్ఠించెను. కాని రాళ్లవెనుక దాఁగిన పదాతివర్గము మోగలులు క్రమముగ గోత్రపాదభూమికి దిగి విశాలప్రదేశమునకు వచ్చిరి. ఆప్రాంతమున నాకొండ తెంపులేక పూర్వాపరదిశలఁ గొలుచుట్టై విశ్వనాథుఁడు పాచిన మానదండమువలె నొప్పియున్నది.

ఎట్లయిన మూఁడుమైళ్ళుపోయినఁగాని యూరగిదమునకుఁ దెంపు కనుపట్టదు అట్టిపగయు నెక్కి తురుష్కసేనలు వచ్చుచుండఁగ బ్రిటిషుకాలఁగర్జానమట్టులు "ఫం. ఫం." యని తుపాకు లొక్కసారిగఁ బేల్చెను. తురుష్కసైనికులు కొక్కసారి బధిరత్వ మాపాదింపఁబడెను. కాని వారును సర్వసన్నాహులయి యుంటచేతఁ దమతుపాకులఁ దీసి గుఱిపెట్టిరి కాని ప్రథమమున రాజసేనలు పేల్చినతుపాకులవల్ల బైలుదేరిన ధూమము సర్వత్ర వ్యాపించిన దాటుచేత నెదుట రాళ్లవెనుక నున్న సైనికులు సుంతయును గనుపడుట లేనికారణమునం జేసి లక్ష్యములు చిక్కక యెల్లరును దుపాకులు పేల్చక చూచుచుండిరి. సేనాధ్యక్షుఁడు "మార్చ్", యని యొక్కపెట్టున నఱచెను. అంత సైనికులు లక్ష్యములు చిక్కకున్నను తమ నాసాగ్రమునకు నెదురుగ దోఁచినదానికి గుఱిచేసి కాల్చిరి. వెంటనే ప్రక్క నున్న తురంగసేన ప్రత్యక్ష మయ్యెను. సకలసుపర్వసహితుఁడైన పురందరునివగిది ఛత్రగజాధిరూఢుఁడై ఛత్రసాలమహీపాలుఁడు వెనుకనుండి సాదాతుల నాశ్వికులను బురికొల్పుచుండెను. పాత్సాహగీతికలు నాళీకగానవిద్యాంసు లారంభించినారు. రణదుందుభుల వాద్యమున కనుగుణంబుగ హయవతంసములు పదవిన్యాసముఁ దెలుపుచుండెను. చెవులు గింగురు మనునట్టులు శృంగనాదములు పర్వతగుహలు మారుమ్రోయునట్టు సెలంగుచుండెను ఈ కోలాహలంబునకు గుహావాసమృగంబులు వెనుకచూపు లేక

పాఱిపోయినవి. మొగలుల చిత్తవృత్తులు క్రౌర్యము లగుట
చేత వారి మొగములు సంతతమును ధుమ ధుమ లాడుచుం
డెను. అందుఁ బరాభవము మూఁడుమారులు సంభవించిన
దాటచేతను చక్రవర్తి భయంకర మైన శాసనముఁ జేసి
యుండుటను జాఫరను వెనుదీయక పోరఁజొచ్చిరి. సాయం
కాల మైనకొలఁది ఛత్రసాలునిసే నాసముద్రము వెనుక
నుండి వచ్చి చేరిన సేనచేత నుప్పొంగి యభివృద్ధిఁ గాంచఁ
జొచ్చెను. కొండకనుమల సుఖోపవిష్టులై యాటవికులు తమ
తమ బాణవిద్యాకౌశలముఁ జూపుచుఁ దురుష్కులఁ గూల్చు
చుండిరి. అయినను వెనుదీయక షేకుఅన్వర్ఖాను సైనికుల
కిట్లాజ్ఞాపించెను. "మీరు నిక్కముగ మొగలాయి వంశజు
లకుఁ బుట్టినవారైన మీశరీరములయందు రక్తమే యున్న
మీరు నిశ్చయముగ రాజభక్తిపరాయణులే యైనఁ బ్రాణ
ముల కాసింపక పోరుఁడు లేచిపోవుద మని యాలోచింతు
రేమో? మీరు శత్రువులను వెన్నిచ్చి పాఱఁజొచ్చినను
వెనుకభాగమున సుగమముగఁ బాఱిపోనుండఁ బ్రాకారము
వలెఁ బర్వత మడ్డమున్నది. దాని నధిష్ఠించునంతలో మీకు
రాజసైనికులచేఁ జావుతప్పదు ఈసమయమున ఛత్రసాలు
నోడించి జయమును గాంచి చక్రవర్తికి మేలు సలుపుటయో
లేక వారలచేఁ జచ్చుటయో నేదియో యొకటి కావలయును"
అని యగ్నికి వాయుప్రయోగముఁ జేసినట్టుల వీరోత్సాహ
మును బురికొల్పి యుక్కుమ్మడి మొగలుసేనలలో నందఱును

రాకుల విడిచి ఖడ్గములను ధరించి ప్రాణములఁ దృణప్రాయములుగఁ దలంచి ఛత్రసాల చమూమహార్ణవంబునం జొచ్చి యమృతవారాశిని మంథానాచలము చందంబున క్షోభపెట్టసాగెను. అట్టిసమయమున రాజసైనికులు చాల మంది చచ్చిరి. కొంతమంది విచ్చిరి. అప్పుడు షేకుఅన్వర్ ఖాను చేసిన యుద్ధముఁ జూచినవారి కభిమన్యుఁడు తలఁపునకు రాకమానఁడు. అతని వీరోత్సాహము నతని ప్రతాపము నతని సామర్థ్యమును గాంచి ఛత్రసాలుఁ డాశ్చర్యపడి "బలే వీరుఁడ వన్న నీవే వీరుఁడవురా" అని శత్రుసైనను మెచ్చుకొనుచున్నంతలో గణపతిసింహుఁ డడ తలకడచి, "భయము లేదు రండి రండి" అని సైనికుల హెచ్చరించుచు షేకుఅన్వర్ఖానుతోఁ దలపడెను. సంగ్రామసింహుఁడు మారి మసఁగినట్లు సైనికులనెల్లఁ దనఖడ్గమునకు బలి యిచ్చుచున్నాఁడు చీకటి బలియఁ జొచ్చెను. యుద్ధము సేయుట కిరువురకును లక్ష్యములు దొరకకున్నను బ్రత్యర్థులతోఁ బోరుచుండెఁ దురుష్కసైనికులకు వెనుక నున్న కొండ మీఁది శుష్కపత్రము లంటుకొని మలయుచున్న యనిలుని ప్రభావముచేతఁ బెనుమంటయై క్రమముగ నాజ్వాల ప్రాఁకి కొండపాదుగునను మూలికగాఁ దగులఁబడఁజొచ్చెను. ఆసమయమున దానిని జూచినవారికిఁ దొల్లి భండాసురవధోద్యుక్తురాలయిన మహాశక్తికి సేనానాయకురాలయిన జ్వాలామాలినీదేవి స్మరణకు రాకమానదు. ఆ యగ్నిజ్వాల లాకస మం

టుటచేత రణవ్యాపారమున కుభయసైనికులకు నిరోధము లేక పోయెను. ఆ తిమిరబాధ నడంచుటకై పర్వతాగ్రమున నున్న మన చెంచునాయకుని యాజ్ఞచేత బాణపుంఖముల నగ్నిఖండంబుల గట్టి యాటవికులు ప్రయోగించుటచేతఁ బుట్టిన యగ్నిజ్వాల యని వీరూహించుకొనుఁడు. ఆటవికులకు మొండిబలము మొండిధైర్యము కలదు కాని యుపాయసాధనము నెఱుంగరు. అట్టివాఁ డొకఁ డుండినచో వారి ప్రతాపాతిశయ మద్వితీయము ఆటవికులు ప్రాణములను సంపదలను దృణప్రాయముగఁ జూతురు. పది పోయినను సత్యమును విడువరు. ఇతరు లక్రమముగఁ దమ సర్వస్వము హరించుచున్నట్లు తమకుఁ దెలిసినను తాము తొలుత చేసిన బాస మఱవక యనృత మాడక సర్వమును గోలుపోవుదురు. అయినను వారికి విచారము నుంతయు నుండదు. భగవంతుని కృపవలనఁ దిరిగి పొలము పండవలె నని తలంతురుగాని యక్రమముగ నప్పులవాఁడు సర్వసంపదల నొడిచికొనె నని క్రౌర్యము తలంపరు అందుచేతనే యనఁగా నిర్మలమైనయంతఃకరణప్రవృత్తి కలిగి సత్యమును విడువరు గనుకనే మను జుని జూచుటతోడనే గాండ్రు గాండ్రు మని వచ్చి మీఁదఁ బడి చంపు క్రూరవ్యాఘ్రములు నాటవికులు సాంత్వనవచనములచే గొఱ్ఱెలఁ దోలినట్లు తోల నవతలకుఁ బోవును. నిశ్చయముగ నదియె మహర్షుల సర్వజంతుసమభావము. అదియే మోక్షమార్గము. అదియే శుద్ధసత్త్వము. అట్టియుత్కృష్ట

సంపదలవారై సోహంబ్రహ్మ యనుటకుఁదగినవారు గావున నట్టి వారిసాయమునను ఛత్రపతి శివాజీమహారాజు స్వరాజ్యమును స్థాపించినాఁడు. అట్టి యాటవికులచే తిరిగి ఛత్రసాలమహీపాలుఁడు సాయము చేసికొనెను. అందుచేత జయమునకుఁ గొదువ యేమి? అట్టి బ్రహ్మానందము నిచ్చినవెలుగు పట్టపగటి కంటెఁ గాంతిచే నొప్పారునట్టిసమయము తురుష్కసేనలు వెనుకకుఁ బాఱిపోవుటకుఁ గొండపైభాగ మెక్కుకొని ముందు చూడ నెట్లు పాఱిపోవుద మని భయమును గదిరి బోనులోఁ జిక్కువడిన యెలుఁగులవలెఁ గొట్టుకొనుచు నొప్పినంతవఱకు యుద్ధము సేయఁజొచ్చిరి. కొందఱు కొంచె మెక్కి వెనుకకుఁ బోవకున్నను వీరియెదుటనుండి క్రమక్రమముగఁ బ్రక్కలకుఁ బాఱిపోవఁజొచ్చిరి. ఇట్లు పోవుచున్న గణపతిసింహుఁడొక్క పెట్టున షేకుఅన్వర్ ఖానును దనకరవాలమున నొక్కదెబ్బ గొట్టెను. అంత నాతనితలమీఁది కుళ్ళాయి తెగి శిరమునకు బలమైనఘాతము తగిలి రక్తము గాఱఁజొచ్చెను. మరల ఖడ్గము నెత్తివేయునంతలోపలనే షేకుఅన్వరుఖాన్ స్మృతి తప్పి గుఱ్ఱముమీఁద సోలెను. మూర్ఛితుఁ గొట్టుట ధర్మబాహ్య మని గణపతిసింహుఁడు వేఱొకవేటు వేయక కళతో గుఱ్ఱమును గొట్టి తమ సేవలోనికిఁ దోలెను. సంగ్రామసింహునితోఁ దక్కినవారలు పోరుచు నన్వరుఖానుని యవస్థను దెలిసికొని యికఁ దాము జయింపలేమని నిస్పృహతోఁ దమ హస్తముల నున్న ఖడ్గములను గ్రిందఁ బాఱవైచి శరణార్థు

లైరి. అన్వరుఖానుని గుఱ్ఱము ఛత్రసాలుని సమీపమునకుఁ గొంపోఁబడెను. రాజసైనికులు శరణన్న శత్రుసైనికులఁ జుట్టుముట్టి పిలుచుకొని రాజసన్నిధికిఁ గొంపోయిరి. పైకు అన్వరుఖానునకును దక్కినవారికిని శృంఖలములఁ దగిలించిరి. అంతట నొకవ్రణచికిత్సకుఁడు వచ్చి యన్వరుఖానుని శిరము మీఁది గాయమునకుఁ బట్టికట్టెను. అందఱును రణభూమిని విడిచి వెనుకకుఁ బోయి నిర్మలస్థలముఁ జేరిరి. అన్వరుఖాను నొకచోఁ బరుండఁబెట్టి సేవకులచే విసరించిరి. కొంతసేపటికిఁ గన్నుదెఱచెను. తన్నుఁ జెఱపెట్టిరని శృంఖలాలంకారము లచేఁ దెలిసికొనెను అంత నొకతురుష్కుఁడు కొంచె ముదకమును ద్రావఁబోసెను. ఆజలమును ద్రాగినపిమ్మటఁ గొంచెము మాటలాడుటకు నోపిక వచ్చెను. ఆకసమువంకఁ జూచి యొక దీర్ఘనిశ్వాసమును విడిచెను. పిమ్మట ఛత్రసాలుని వైపు దిరిగి ‘‘ఓక్షత్రియపుంగవా? నే నోడితిని ఈ నిస్తేజమైన శరీరముతో మీ కేమి ప్రయోజన మని బంధించితిరి? మీకుఁ గావలసినది జయము గాదా?

ఛత్రి—అగును. మాకుఁ గావలసినది జయమైనను నీవు దుష్టుఁడవు. నిన్ను విడువరాదు. క్రూరసర్పము బలమైన ఘాతచేత నిలఁ గూలినను దిరిగి వాయుధారణమునం జేసి బ్రతికి మరలఁ గ్రౌర్యమును జూపును

అన్వర్—పోనిండు. నావలన మీ కేమి యుపయోగము ?

ఛత్ర—శత్రుసంహారమే మా కుపయోగము.

అన్వ—అట్లయిన నాశిరము నఱకివేయుఁడు.

ఛత్ర—మే మట్లు చేయము. నిన్నిట్టులనే కారాగారమున బంధింతుము.

అన్వ—నేను జెప్పెదను వినుము. నన్ను నీ వేమిచేసినను నేను మీకు సహకారి నౌదు నన్నమాట వ్యర్థముకదా! సర్వావయవశక్తిని మనోబలమును దిగిపోయిన వట్టి శవప్రాయమైన నన్ను బందె నుంచుట పౌరుషము గాదు. నిక్కముగా వీరుఁడైనవాఁడు ధర్మనిరతుఁడు. శత్రువునకు ఖడ్గ మిచ్చి సరాసరిగఁ బోరి చంపుటయో చచ్చుటయో రెంట నేదియో ఫలప్రాప్తి నొందును. కాని బలమైన ఘాతముచేత సర్వముమీఁద మూర్ఛిల్లిన నన్ను జెఱఁబెట్టుట దేశోద్ధారకుఁడనని గొప్పపేరు పెట్టుకొనిన నీవంటివానికిఁ దగదుసుమీ.

ఛత్ర—ఓయీ! నీవు తిరిగి యుద్ధము సేయఁదలంచిన నీఖడ్గమును నీ కిచ్చెదము. మా గణపతిసింహునితోఁగాని, సంగ్రామసింహునితోఁగాని యుద్ధము సేయుము. అప్పుడైన నీయోటమికి సమ్మతించెదవా ?

అన్వ—ఓటమి కిప్పుడే సమ్మతించితిని కావున నన్ను విడిచిపెట్టుము. ఓడినవాని వధింతురా ?

ఛత్ర—మేము నిన్ను వధింపము. బందె నుంచి పోషింతుము.

అన్వ—ఎంతవఱకు ?

భర్త—నీవు సంస్కరింపఁబడునట్లు.

అన్న—ఎట్లు సంస్కారము?

భర్త—నీహృదయము నీబిడ్డలయం దెప్పు డెట్టి ప్రేమాస్పదముగనుండునో యట్టిప్రేమ తక్కినభూతకోటియందును జూపుట యెప్పుడు తటస్థించునో యప్పుడు నీవు సంస్కరింపఁబడితి వని సమ్మోదము.

అన్న—నాహృదయ మట్టి దయామయముగ లేదని మీ కెట్లు నిదర్శనము.

భర్త—గోవులను హింసించుట, బ్రాహ్మణులను బాధించుట, స్త్రీలను జెఱఁబట్టుటయే నిదర్శనము.

అన్న—అట్టి కృత్యములు నేనే చేసితి నని యెట్లు చెప్పుదువు?

భర్త—నీవు కాకున్నను నీరాజ్యాంగసంఘమున నిట్టి దురాచారములు పెక్కులు గలవు. అట్టిసంఘదోషము రాజునకుఁ జెందును. మీ రందఱు రాజ్యాంగమంత్రులు కావున నాదోషము మీ కందఱకు ఘటించును. మీ రందఱు నిట్లు క్రమముగ సంస్కరింపఁ బడఁదగినవారె.

అన్న—అగుఁగాక. ఆదోషము తొలుతచక్రవర్తి ననుసరించుటచే వ్యాప్తమయినది. అయ్యది నాయొక్కనివలన నగునది కాదు. నన్ను బంధించినంతమాత్రమున ఢిల్లీసామ్రాజ్యమున నలముకొని మిక్కిలిలోఁతుగ వేళ్ళు పాఱిన యాదురాచారగుల్మము తెగఁగోయఁబడదు. అట్టివ్యర్థుఁడ

నై నన్ను బాధించిన నీకేమియుఁ బ్రియోజనము లేదు. నీకు శక్తి యున్న ఢిల్లీచక్రవర్తిని నమస్కరింపుము. వ్యర్థముగ నిన్ను విడుచుటకు నీకు శక్తి యున్న నావలన నర్థముగొని విడువుము.

ఛత్ర — నిన్ను విడిచిన నర్థము కాదు. అనర్థము కలుగఁగలదు. (కొంచె మాలోచించి) సరే యట్లయినచో నేమి యిచ్చెదవు." అని పలికెను.

• అన్వ — ఏఁబదివేల రూప్యము లిచ్చెదను

ఛత్ర — వేయిమాట లేల ? ఒకలక్షయు నిరువదివేల రూప్యము లిచ్చిన విడిచెదను. అని చెప్పెను.

అన్వ — అట్లె యిచ్చెద నని హాజీమహమ్మదును పిలిచి "ఓయీ ! వీరికి లక్షయు నిరువదివేలరూప్యములను జెల్లింపుము అనిచెప్పెను వారు మహమ్మదాప్రకారముగాఁ జెల్లించెను గణపతిసింహుడు సొమ్మును సేకరించి వారిని విడువలచేసెను. అన్వరుఖాను హతశేషులయినవారితో నచ్చట నా రాత్రి గడపెను చెను ఛత్రసాలుఁడు వారి కుపహారములను బానీయమును సమృద్ధిగ నర్పించెను. అందఱు నుపహారములఁ గైకొనుచుండ వెనుకనుండి వీరవర్మ కొంతసైన్యముతో వచ్చి నమస్కరించెను.

ఛత్ర ఓయీ ! నీ వింత యాలస్యము సేయుటకుఁ గారణ మేమని యడిగెను.

అంతట వీరవర్మ వినయముతో మహారాజా ! యేమని చెప్పుదును ? మహాశివరాత్రియుత్సవమునకై తమయాజ్ఞాప్ర

కారము పోయి యుంటిని. ఆనాఁటి రేయి నా పుత్రిక యైన చం ద్రిక తల్పము మీఁద శయనించినది. తెల్లవాఱువఱకుఁ దల్ప ములోఁ బుత్రిక మాయమయ్యెను." అని చెప్పి దుఃఖింప సాగెను. ఆమాటచేత ఛత్రసాలుఁడు మూర్ఛవడియెను. నోట మాట రాకపోయెను. మఱి పరిపరివిధములఁ బరువిడఁజొచ్చె ను. చెంచునాయకుఁడా మాటల విని యును ఛత్రసాలుని చే ష్టితముఁ గనుఁగొనఁదలచెను. ఎట్టకేలకు ఛత్రసాలుండు "ఓయీ! యెందయిన వెదకించితివా యని యడిగెను.

వీరవర్మ "దేవా! తెల్లవాఱినది మొదలు వెతకించు చునే యుంటిని. ఎందును గాన్పింపలేదు." అని బదులు చె ప్పెను. ఛత్రసాలుఁడు, "ఆహా, అందఱమును దురదృష్టవం తులము గదా యని పలికెను నన్నుద్దేశించిన ప్రతిసాధ్వియు నేదో యాపద వాటిల్లి యంతరించుచున్న దేమో దైవమా యని మనసున ననుకొనుచుఁ దన్నుఁ దా నిందించుకొనఁజొ చ్చెను. చెంచునాయకుఁ డా పరితాపమును గనిపెట్టి మన మిఁక నాలస్యము సేయ రాదని "స్వామీ! మీరంద ఱింత లోఁ జింతాసముద్రమున మునిఁగియుంటి రేమి కారణ" మని యడిగెను. "ఓయీ, నా పుత్రిక చంద్రిక నెవ్వరో హరించినా" రని వీరవర్మ బదులుచెప్పెను. అపుడు పెద్దయెలుంగుతో "ఓహో తండ్రీ! జడియకుము నా చెల్లెలు చంద్రిక రక్షింపఁబడి నది. నేఁటి యుదయమునఁ గిరాతకుల చేఁ గట్టువడి కొం పోవఁబడు నామెను మేమే రక్షించితిమి. మా పల్లెలో సురక్షి

తముగ నున్నది. దేవరకు సమర్పించుట కవ్వవధి యూటచేత సర్పించక నీయుద్ధమునకు శృంగనాదము వినంబడుతోడనే పరువిడివచ్చితిమి. కాలహరణమునకు క్షమింతురుగాక." అని చెంచునాయకుడు చెప్పెను. అంతట ముఖపద్మములును వికసించెను. "నీవు మెచ్చఁదగినపరాక్రమశాలివి. మా శాత్రవబాధవ్యుఁడ" వని ఛత్రసాలుఁడు సంతోషముతోఁ బలికెను. "మిత్రుఁడా! చెంచునాయకుఁడా! నాకుఁ బుత్రికాదానమును నీవు చేసితివి కాని భగవంతుఁడు సేయులే" దని వీరనర్మ యత్యధిక క్తనిఁ జూపెను. గణపతిసింహాదు లతనియుపకారపరంపరలకు సహస్రవందనములు సేయవలసినవా డని హెచ్చరించిరి. చెంచునాయకుఁడు ఛత్రసాలునకు నమస్కరించి మహారాజా మీ సేవకుండై మిత్రదాసుని చెంత కొకసారి పంపుఁ డని ప్రార్థించెను. అటులే పంపెద నని మహారాజా చందమును దెలిపి యుద్ధమును మఱొకస్థలమున నీయామినిని గడపుద మని నిర్ణయించుకొని యచ్చోటు వాసిరి.

---

## ఇరువదితొమ్మిదవ ప్రకరణము.

---

### చెంచునాయకుఁడు.

వనలక్ష్మి యామకొనుబాంగరమువలె వింధ్యారణ్యభూమియందు శంబరపురమునకు సమీపమున నొకగుట్ట యొ

ప్పారును. జటాజూటగంగాధరుఁడైన గిరీశునిచందంబున నాప ర్వతశిఖరమునుండి యొకప్రవాహము సలసలధ్వనితో సంతత ము ప్రవహించుచుండును. ఆనగోత్తంసము భూమినుండి కొం తవఱకు విశాలముగను బొడవుగను గొంచెము చదునుగను వ్యాపించి తన్మధ్యప్రదేశంబున బొందర మట్టు లోకగుబ్బ పెరిగెను. బొంగరపుములికివలె నొకశిఖరము కలిగియుండెను. ఆశిఖరమునుండి యొక జలపాతము బయలువెడలి యాచదు నైన పర్వతనితంబసీమపైఁ బడుచుండును ఆజలమును దమ కుఁ గావలసినదానిని నిలుపుకొనుటకును మిగిలినదానినిఁ గ్రిం దికి విడుచుటకును దగిన యేర్పాటును జేసికొని తజ్జలాధారము న నాగిరిమధ్యభాగంబున సేద్యమును జేసికొని పంటలు పండిం చుకొనుచు జీవించుచెంచులు మొదలగు నాటవికులు పత్రకుటీ రము లనేకముల గట్టుకొని సర్వవిధసౌఖ్యముల ననుభవించు చుందురు. సంతతజీవనోపాధి కలిగియుండుటచేత నందు లేని ఫలవృక్షములును నందుఁ బండనిపంటయును లేదు. పుష్పజా తు లనేకములు కలవు. ఆయాటవికుల గూడెమునకుఁ జెంచు వాండ్రు విశేషించియుండుటచేత జెంచుగూడెమని వాడుకయై యుండెను. అచ్చటివారు సత్త్వగుణులయి సత్యమార్గగాము లగుటచేతఁ బక్షికులంబులును, సాధుమృగంబులును జనుల తోఁ గలసిమెలసి వర్తించుచుండును. అచ్చటి జలపతనమున కానందించుచు వర్షకాలములనేకాక నెల్లకాలములయందు ను మయూరములు వారిపతనరవంబున కనుగుణంబుగ నృత్య

ము సేయుచుండును. అచ్చటఁ బక్షిప్రాణులు సంచరించు టకుఁ బ్రత్యేకభూభాగమును నిర్ణయింపఁబడెను. అపూర్వపు సమస్తఫలసంపత్తి నొకచోటఁ గాంచినవారు పక్షిగణావాసము ను ద్యజించి యుండు నని పలుకవలయును. వేయేల! అచ్చటివారు వస్త్రములకు వినా పట్టణమునకు రావలసిన యవసరమే లేదు. గోవులు పాలిచ్చువేళకు గోష్ఠమునకు వచ్చి పాలిచ్చి పోవుచుం డును. ఈపర్వతసౌందర్యమును నీసౌఖ్యమును గాంచినవారు స్వర్గమునకు రమ్మని బ్రతిమాలినను బోనని నాందురు. ఆహా! సాయంకాలమున నాజలపాతసప్రదేశమున శిలావేదిక లపైఁ గూరుచుండి యచ్చటి ఫలవృక్షములపై నివసించి పలు సంబులఁ దాల్చి హాయిగ గానము సేయు కోకిలాదులవైభవ మును, ఆమయూర నాట్యమును, అప్రమాదసుగంధసమ్మిళిత వాయుసంచారమును, ఆపుష్పితలతానికుంజములును జెప్పలేక నాకర్ణించి కన్నులారఁ గాంచినవారికి సులభముగఁ గవిత్వము పట్టువనుట కేమియు సందియము లేదు. సమస్తప్రపంచవస్తుత త్వమును క్షణమాత్రమున భావవిశిష్టముగఁ దెలిసికొనవచ్చు ను. అట్టివా రానందరసతరంగడోలికల నుయ్యేల లూఁగుదురు. అట్టిప్రదేశంబున మంచెంచునాయకుఁ డొక్కశిలావేదికపైఁ గూరుచుండి సాయంకాలమున నెన్నిదినములు చూచుచున్నను తనివితీఱని యామహోత్సవమును జూచుచుండెను. అంతట నిద్దఱు చెంచువారం డొకరాజభటునిఁ దోడితెచ్చి "స్వామీ! యీతఁడు రాజభటుఁడు మహీపాలుఁడు మీదర్శనమునకుఁ

బాపెను" అని చెప్పిరి. రాజభటుఁడు ఆచెంచువానిని తెప్పవా ల్పక చూచెను. చెంచుతేఁడు మొగమున గాంభీర్య మొప్పఁ జేసెను. సేవకుఁడు తదేకదృష్టితోఁ జూచిచూచి కన్నులనుండి బాష్పాంబువుల రాల్చెను.

చెంచు—ఓయీ! నీ వేల విచారమునకుఁ జోటి చ్చితివి?

సేవ—(కన్నులఁ దుడిచికొనుచు) చెంచుతేఁడా! నిన్నుఁ జూడఁగనే నాకు దుఃఖము వచ్చుచున్నది.

చెంచు—ఏమి! నే నేమి యపచారమును జేసితిని.

సేవ—నామిత్రునియాకారమును నీవు పుణికిపుచ్చుకొ నుటచేత.

చెంచు—ఏమి నీమిత్రుఁడు జీవించియుండెనా?

సేవ—బ్రతికియుండిన నీపరితాపమేల?

చెంచు—నీమిత్రుని పేరేమి? అతఁ డెచ్చటివాఁడు. ఏకులమువాఁడు

సేవ—వాఁడు నిన్నుఁ బోలినవాఁడే కాని నీకులము మాత్రము కాదు.

చెంచు—(వచ్చినచెంచువాండ్రను బొమ్మని సైగఁ జేయ వారు నిష్క్రమించిరి.) ఓయిరాజసేవకుఁడా! నీమిత్రుఁడు నన్నే పోలినచో నన్ను నీమిత్రునికి బదులు ప్రేమించి యానందఁ జెందరాదా?

సేవ—అదెట్లు పొసఁగును. వజ్రమునకును గిరపరా తికిని భేదము లేదా?

చెంచు—మిత్రుఁడు లేనప్పు డేమిచేసెదవు? కనను నెట్టులో సరిపెట్టుకొనుము.

సేవ—ఆసౌందర్యము నాగుణాలంకారము నాదయా భావము నద్వితీయములు ఉండిన నామిత్రుఁడే యుండవలె ను గాని రెండవవానిని వానిగాఁ దలంచుట బ్రహ్మగ్రుబుట్టను ప్రభాకరునితోఁ బోల్చుట కాదా?

చెంచు—వానిపే రేమి చెప్పెదవా? వినినయెన నా నందించెదను.

సేవ—ఆతని పేరు చెప్పుటకు వలనుపడదు.

చెంచు—అటులయిన నీమిత్రుఁ డాఁడుది కావచ్చును.

సేవ—పోనిమ్ము. నీవట్లే యనుకొనుము. లోకము మూయుటకు మూకు దున్నదా?

చెంచు—అట్లయినఁ బేరేల చెప్పవయితివి?

సేవ—నేను బేరుచెప్పువాఁడను గాను.

చెంచు—పోనిమ్ము వాఁడు మరణించె నని నీ వెట్లె ఱింగితివి?

సేవ—భూమిమీఁదఁ గన్పడకున్న నేమని తలంపవ లయును?

చెంచు—అంతమాత్రముననే నీవు నిస్పృహుఁ జెంద రాదు. ఏపర్వతగుహాల నెచ్చటనైనఁ దపముసేయుచున్న వాఁ డేమో యోచించితివా?

సేవ—ఆయుపకారము నీవలనఁ గావలయును.

చెంచు—అటులే చేసెదను గాని నీపేరయినను జెప్ప వచ్చునా ?

సేవ—నా పేరు మిత్రదాసుఁడు.

చెంచు—ఏమి మిత్రవిందుఁడా ? [అని చిఱునవ్వు నవ్వెను.]

సేవ—(తనలో) ఈతఁడు నాగుట్టుఁ దెలిసికొనెనా యేమి. (పైకి) కాదు మిత్రదాసుఁడు నీకుఁ జెప్పుడా యేమి. మిత్రదాసుఁ డన్న, చిఱునగవుతో ప్రసన్నముఖివై మిత్రవిం దుఁడా యనెదవేమి ?

చెంచు—(తనలో నాగుట్టు బైటపడినది కాఁబోలు) (పైకి) "ప్రసన్నముఖివై" యంటివి. నే నాఁడుదాన నను కొంటివా ?

సేవ—ప్రసన్నముఖుఁడవై యనుటకు బదులు పొర పాటున నట్లంటిని. అయిన నేమి యిందాక "నీమిత్రుఁ డాఁడు ది కావచ్చునని" నీవు పలుకలేదా మగవాఁ డాఁడుదియైన నాఁ డుది మగవాఁడు కావచ్చును.

చెంచు—పోనిమ్ము అట్టి ప్రాణమిత్రునిఁ బాసి నీ వెం దెందు సంచరించుచుంటివో నిజము చెప్పుమా !

సేవ—నేను బేరునకు రాజసేవకుఁడ ననియే కాని నా బ్రతుకెల్లఁ జె కాలమునుండియు నామిత్రు నన్వేషించుటకే సరిపోవుచున్నది.

చెంచు—మీ మహారాజునకుఁ బెండ్లి యెన్నఁడు వసంత మారంభ మగుచున్నదే.

సేవ—నా కాశ్రితుల తలనొప్పి గలిగించును తలఁపింపకుము.

చెంచు—అట్టులయిన రాజద్రోహివా ?

సేవ—నేను ద్రోహిని గాను. మహారాజునకుఁ బెండ్లి యని తలఁచినకన్యకకేదో విఘాతము కలుగుచున్నది తొలుత మామిత్రుని పెండ్లి—కాదు కాదు సోదరిని పెండ్లి చేయఁదలంచిరి. ఆమె తురుష్కరాజపుత్రియై మరణించినది. పిమ్మట వీరవర్మమహీశుని పుత్రికను వివాహము చేసికొను టకుఁ దలంచ నామెను శివరాత్రిమహోత్సవమునందుఁ దస్కరులు కొంపోయినారఁట. మరల నీవే యాతస్కరుల వధించి యామెను రక్షించి మహీశునకుఁ జేర్పించితివఁట. ఇట్టి యంశమున నేమి చెప్పఁగలను ?

చెంచు—ఓహో ! మీ మహారాజుగారిచరిత్ర విచిత్రముగ నున్నదే. సరే కాని తొలుత మీ రాజుగారు పరిణయార్థమై తలంచిన మీమిత్రసోదరి మహారాజున కిష్టమయిన యంశమేనా ? ఒక్కయామెకే యభిప్రాయము మొదటఁ గలిగి వరించినదా?

సేవ—తొలుత నా మిత్రసోదరి కొక్కయతీశ్వరుఁడు హస్తసాముద్రికమును జూచి ఛత్రపాలుని వివాహమాడెదవని చెప్పి యాసఁగొలిపెను. మరల నాయోగియే మహీపా

లునితో సకలసౌందర్యగుణరాశి యైనప్రసన్నముఖిని బరిణయము చేసికొనుమని ప్రబోధించెనఁట.

చెంచు — ఏమేమి? ప్రసన్నముఖనా? మామహారాజు మన స్సాకాంక్షించెనా? లేక యోగిబలాత్కారమా?

సేవ — మిక్కిలి మనఃపూర్వకమైన ప్రేమచేతనే కాంక్షించెను ఆమె నది మొదలు సకలదేశములు వెతకించెను గాని తుదకు నిరాశ యయ్యెను.

చెంచు — అలాగునా? ఆమె కనఁబడినను వ్యర్థమే సుమీ.

సేవ — ఏమీ యెందువలన? నీ వామె నెఱుంగుదువా యేమి?

చెంచు — ఎఱుఁగ కేమి? ఆమె తొలుత నీ మార్గముననే పోయినది. ఆమె చిత్రపుకూలము నంగుళీయకమును నాకు లభించిన వోటచేత వానిని మహారాజునకు నర్పించితిని. తుదకామె యొక యోగిరాజును బరిణయమైనదఁట.

సేవ — ఎక్కడఁ బెండ్లాడినది?

చెంచు — దేవియైన వింధ్యవాసినీ సమక్షముననఁట.

సేవ — ఓయీ! వింధ్యవాసినీసమక్షమున యోగిరాజును బరిణయమైనది చెంచునాయకుఁడు-కాదు కాదు-నాయికకాదా?

చెంచు — (తనలో) నేను పీనిగుట్టు తెలిసికొన్నట్లే నాగుట్టీతనికినిఁ దెలిసియుండవచ్చును. (పైకి) ఓయీ! ఆ

యోగిరా జెవ్వరో నాకుఁ దెలియదుకాని ప్రసన్నముఖినిఁ బెండ్లాడిన యోగిరాజు వేఱు.

సేవ—ఆమెకుఁ బరిణయ మైనట్లు నీవు వింటివా! చూచితివా?

చెంచు—చూడకున్న వినినఁ జాలదా యేమి?

సేవ—ఎవరివలన వింటివి?

చెంచు—చిలుకలవలన?

సేవ—నాతో నిట్టిమాటలు హాస్యములా?

చెంచు—నేను హాస్యమాడ లేదు. నిక్కముగనే వచించితిని. కావలసిన నీచెంతఁ బలికించెదను.

సేవ—ఏదీ పలికింపుము నీ మాటలు వింతలుగ నున్నవే.

చెంచు—ఎటుఁగనివారి కన్నియు వింతలే. ఇదిగో యిపుడే కొన్నిచిలుకలు రాఁగలవు. అంతవఱకు వేచియుండుము. అని చెప్పి యేదో సంజ్ఞానామము నుచ్చరించి పిలిచెను. అంతఁ గొన్నిచిలుకలు వచ్చి చెంత నున్న గున్నమావిపై వ్రాలెను.

చెంచు—చిలుకా! ఒక్కసారి యిటు వచ్చెదవా?

చిలుకయు రివ్వున నెగిరివచ్చి చెంచువాని చేతిమీఁద వ్రాలెను.

సేవకుఁ డాశ్చర్యపడి వింతగఁ జూచుచుండెను.

చెంచు—నీవు ప్రసన్నముఖ నెఱుఁగుదువా?

చిలుక—ఎఱుఁగ కేమి ?

చెంచు—ఆమెకుఁ బెండ్లియైనదా ?

చిలుక—అయినది.

చెంచు—ఆమెభర్త యెవ్వరు ?

చిలుక—యోగిరాజు.

చెంచు—ఆమె యెచ్చట వివాహమాడినది ?

చిలుక—దేవియైన వింధ్యవాసినీ సమక్షమున.

సేవ—ఓశుకరాజమా ! వింధ్యవాసినీసమక్షమున రాజును బెండ్లాడినది చెంచునాయిక కాదా ?

చిలుక—మాటాడలేదు.

చెంచు—ఓయీ మన్త్య నడ్డగట్లు వేయకుము.

సేవ—ఓయీ ! యిపు డామె యెచ్చట నున్నదో యడుగుము.

చెంచు—ఆమె యెచట నున్నదో చెప్పెదవా ?

చిలుక—అది చెప్పుటకు వలనుపడదు.

సేవకునకుఁ జిలుక యిట్లుప్రత్యుత్తరమిచ్చుటచేతఁ బొందినయాశ్చర్యము వ్యక్తము కాక పరితాపమాతని మొగమున వ్యక్తమయ్యెను.

చెంచు—ఏమి; నాకీరసంభాషణము చెవులకు రుచింపలేదా ? పరితాపము సూచించుచున్నావు ?

సేవ—రుచింపకేమి ? నాపరితాపకారణము వేఱు.

చెంచు—నీ వీక్షమును గొంపోయి మహారాజున కర్పింపుము. మాపల్లెయందలి పక్షిజాలములు మనుజులతో సహాసముగ మాటలాడును సకలదేశసంచారముఁ జేసి వార్తల నందిచ్చును.

సేవ—అట్లుతే కొంపోయెదను.

అని యాచిలుకను గైకొని చెంచునాయకునిఁ గాంచి "ఓయి రాజమిత్త్రుఁడా, నీకు మేలు కలుగుఁగాక. నేను బోయెదను. కాని నీవలన వినినమాటలు నన్ను నట్టెట ముంచినవి. [అని వెడలిపోఁబోవును.]

చెంచు—ఓయీ! శ్రమపడి వచ్చితివి యీ ఫలము లను భక్షించి పొమ్మని చెప్పి కొన్నిపండ్లనిచ్చి నీమనఃపరితాపమును నేనే తీర్చెదను.

సేవ—ఎప్పుడో తీర్చెద నననేల! దయయున్న నిప్పుడు నాపరితాప మడఁపరాదా!

చెంచు—"నెచ్చెలీ! మఱచితివిందా! నేనే ప్రసన్నను" అను సంతసో సేవకుఁడు పోయి కౌఁగిలించుకొని "హా! చెలీ! యెన్నాళ్లకుఁ జూచితిని" అనెను.

చెంచు—నెచ్చెలీ! యింక నీరహస్యమును బయలుపఱుపరాదు. నాకొఱకుఁ జెంచులు వచ్చువేళ యగుచున్నది. కావున నీవు భద్రముగఁ బొమ్ము. రహస్యరక్షణమునం దేమఱకుము.

సేవ—మంచిది. అని వెడలిపోయెను. చెంచునాయకుఁడును గుటీరమునకుఁ బోయెను



## ఇరువది తొమ్మిదవ ప్రకరణము.

### దర్బారు.

రవకరువలిచేత రగులుచు నుండుచున్న నంగారకణమ్ముమీఁద నాజ్యము ప్రోసినట్టులఁ దొలుత ఫిదాయిదాఖానునకును దరువాత రణమల్లాఖానునకును మరలఁ దుష్వార్ ఖానునకును బిమ్మట షేకుఅన్వర్ ఖానునకును జరిగిన పరాభవపరంపరలచేత ఢిల్లీచక్రవర్తి యైనయౌరంగజేబుహృదయము తైలవర్తికవలె బగబగ మండుచుండెను. అవతరించిన రౌద్రరసమో యనునట్లు సింహాసనముమీఁదఁ గూరుచుండెను కన్నులనుండి విస్ఫులింగములు రాలుచుండెను. చామరగ్రాహిణు లాచక్రవర్తి రౌద్రమునకు జడిసి గడగడ వడంకుచుండిరి. సభ్యులు సరదారులు తమకంతఱకు నాదినముననే యాయుర్దాయము సరి యని తలంచుచు జీవితములపై నిరాశ చేసికొని నారు. అట్టిసమయంబున నాచక్రవర్తి "యోసరదారులారా" యని గంభీరముగఁ బిలుచుటతోడనే సభవారెల్లరు వక్షోర్ధ్వ

లులకు వెన్నుపోటు సణంచెదను.'' అని గంభీరముగఁ బలికె
ను. ఆసభనుండి మీాజ్ఞాసదరుద్దీనను సరదారు లేచి ,,మహాప్ర
భూ, వానిని సంహరింపఁదగినవీరుఁ డీసభలో లేక పోలేదు.
ఈఛత్రసాలుఁడు రాజ్యాంగతంత్రమున నించుమించు ఛత్ర
పతి శివాజీకోఁ బోల్పఁదగినవాఁడు. ఇప్పుడు రెండవ శివాజీవ
లె నిజప్రతాపమును మధ్యమాంగలమునఁ బ్రకాశింపఁజేయు
చున్నాఁడు. అతని తేజమును దుర్భరమైనది. కనుక నే దేవరకు
వశీకృతులై యున్న సామంత తురుష్క రాజులును ఛత్రసాలు
నకు వశులై యాతనికి ,,చౌతాయి'' యను నాల్గవవంతుపన్ను
సమర్పించి వశవర్తులై మెలఁగుచున్నారు. కాల మొకరీతి
నుండదు. ఇంతకుము న్న నేకయుద్ధములలో జయమును సంపా
దించిన సరదారులే యిప్పుడు సూక్ష్మముగ నోడిపోయి లంచ
మిచ్చి ప్రాణములఁ దక్కించుకొని బ్రతులుపడినారు. కావున
నీరాజును జయించుట సామాన్య మని తలంపరాదు. అయి
నను నాయుక్తి నాచాతుర్యము నాకపటము నాబలము నుప
యోగపఱచి, వాని నేను సాధించెదను. మీరు త్వరపడవలదు.

ఔరం—ఓయీా! అన్వరుఖాను మొదలగువారు నీవ
లెనే చెప్పియున్నారు. తుద కపకీర్తియే కాక యమితద్రవ్య
మునుఁగూడ ఖర్చు పెట్టి యున్నారు. నీకు నిజమయినశక్తి యు
న్న నే పొమ్ము. లేకున్న నీవును స్త్రీవలె నింట నుండుము.
స్త్రీల నసదలుగఁ దలఁపరాదు. వారే యిప్పుడు ప్రతాపాతిశ
యమునఁ బురుషుల మీాఱుచున్నారు. ఒక్క ప్రసన్నముఖి

యిరువదిమంది నవలీలగా వధించి కామాంధు లయినవారికి
న్నుల దుమ్ముగొట్టి పాఱిపోయినవాఁట. ఇన్నిదినములును రా
మసింగు శత్రువులలోనివాఁడని తలంచితిమి. నీవు కాలెంగా రణ
మునకుఁ బోయి ప్రాణముల కాసింపక పోరి మరణము నంద
నవాఁడు. మన మొగలుసర్దారులలో స్త్రీలకంటె నధమాధము
లయినవారలు కొందఱు గలరు. వారివలె నీవును రణవ్యాపా
రానభిజ్ఞుఁడవై పరాభూతుఁడవు కాక లబ్ధజయుఁడవు కమ్ము.
నీకుఁ బోవుటకుఁ దగినశక్తి యున్నదా'' యని యడిగెను.

మీర్జానవరుద్దీను "మహాప్రభూ, నేను తప్పక పోయి
వారిమద మడంచి వచ్చెదను. లేకున్న నేను నాతండ్రిలగితికిఁ
దప్పినవాఁడ నగుదు ననియుఁ జంద్రునితోడనియు శపథముఁ
జేసి యిదిగో నేను ఛత్రిసాలుని తప్పక యోడించివత్తు నని
కంకణముఁ గట్టుచున్నా నని యొకదారమును దీసికొని హస్త
మునకుఁ గట్టుకొనెను. చక్రవర్తి సంతసించి సరే మీ
రందఱు సభను విడిచి పొండు నే నితనితోఁ గొన్నిమాటలు
చెప్పవలె నని యాజ్ఞాపించెను. అందఱును సభనుండి తొలఁ
గిపోయిరి. మీర్జానపిక్ "యిరువదివేల సైన్యము కావలెను''
అని చెప్పెను. చక్రవర్తి యటులే పంపెదము కాని యీమాట
లు వినుము. నీవు పోవుమార్గమును ముందు శత్రువులకుఁ
దెలియునటులఁ గొంత సైన్యము నెదుట నుంచి యట్టహాస
మును జేయింపుము. తక్కినసైన్యమును దోడ్కొని ప్రక్క
త్రోవను బోయి హఠాత్తుగ వెనుకనుండి యుద్ధముఁ జేసి చీ

కాకుపటుపుము. ఇరుకెలంకులనుండియు రణము చేయుటచే హిందువులు జడిసి కొందఱు ప్రక్కలఁ బడి పాఱిపోవుదురు. మిగిలినవారిని దయయు దాక్షిణ్యము లేక కాల్చివేయుఁడు. ప్రాణముతో దొరకిన వాఁ జెఱఁబట్టి తీసికొనిరండు. నీ వక్కడ న్యాయాన్యాయము లనుమాటఁ దలఁపరాదు, నిరాయుధుఁడైన నందినచో వానిని మృత్యుసదనమునకుఁ బంపవలసిన దే" అని ప్రబోధించెను. చిత్తము మహాప్రభూ ! అని మీర్జా పలికెను. "వేయేల వానిని గెల్చి మీర్జానదరుద్దీను మధ్యమండలమున కమీరయ్యె నను ప్రసిద్ధిఁ బొందుము" అని చెప్పి పంపి చక్రవర్తి మందిరాంతరమునకుఁ బోయెను,

## ముప్పదవ ప్రకరణము.

---

### కీర భాషణము.

ప్రసన్నముఖి బ్రతికియున్నదనుటచే సగము ఖేదమును బాసి యామెయునికి చెప్పక పోవుటచేత, నామె యోగిరాజును బరిణయమైన దని చెప్పుటచేతను విచారించుచు ననేక విధుల యోచించుచు నొక్కచిలుకను జేతఁబట్టుకొని పురుషుఁ డొకండు వేగముతో విలాసపురవీథినుండి పోవుచుండెను. పుర జనులు వీఁ డెవ్వఁడురా కొత్తసేవకుఁ డని తలంచి ప్రశ్నింపక యూరకుండిరి. అతఁడే మిత్రదాసుఁడు. తిన్నఁగ సింహద్వార

మును గడచి ఛత్రిసాలమహీపాలుఁ డున్నయుండినమ్యుఁ బ్రవే
శించి మహారాజునకు నమస్కరించి "దేవా! చంద్రమనాయకుఁ
డీకీరమును దమ కిమ్మని పంపించెను" అని సమర్పించెను.
మహీపాలుఁ డేమిరా యీ చిలుకను నాచేతి కిచ్చెదవేల?
పంజరమ్మున బంధింపుమని పలికెను. "మహారాజా యీ కీర
మును బంధింపరాదు. ఇదిమనుష్యులతో సంభాషణచేయునఁట.
వార్తాహారియఁట. సర్వదేశసంచారియఁట. మీరు దీనితో
నొకసారి ప్రసంగించిన సన్నియుఁ దెలుపఁగలదని చెప్పె
ను. అంత నామహారా జానందించి యాకీరమును బట్టుకొని
యిట్లనియెను.

ఛత్రి—ఏమేకీరమా! నాతో మాటలాడెదవా ?

కీర—ఆ! మాటలాడెదను.

ఛత్ర—(ఆశ్చర్యమునంది) ఏమి మాటలాడెదవు ?

కీర—నీ కేమి కావలయును?

ఛత్ర—నాకుఁ గావలసినమాటల నాడెదవా ?

కీర—ఆ.

ఛత్ర—నీయునికి యెచ్చట సీసంచార మెందు?

కీర—నివాసము చెంచుగూడెము. సంచారము సమస్త
పర్వతసీమలలో.

ఛత్రి—అట్లయిన నీ వొద్దెసఁ బ్రసన్నముఖుని గం
టివా ?

కీర—ఆ కాంచితిని.

ఛత్ర—ఇప్పు డెందున్నది?

కీర—ఆమాటమాత్రము నేను చెప్పను.

ఛత్ర—ఎందువలన ?

కీర—నా కిష్టము లేక.

ఛత్ర—కారణ మేమి ?

కీర—మహారాజులు చంచలచిత్తు లగుటచేత.

ఛత్ర—ఆహా యేమి యీ యాశ్చర్యము ? ఈచిలుక మిక్కిలి ప్రౌఢముగ మాటలాడుచున్నదే. ఓసీ! నాస్వభావము చంచల మని నీ కెట్లు దెలియును.

కీర—చంచలము లేదని నీవు నిశ్చయముగఁ జెప్పఁ గలవా?

ఛత్ర—ఆ. చెప్పెదను.

కీర—అటులైన నసత్యమునకుఁ గూడ నవకాశ మొసంగితివి.

ఛత్ర—(ఆశ్చర్యము నంది) తనలో తా నేదియో యోచించి తల పంకించి, సరే శుకరాజమా ! ఆప్రసన్నముఖి జీవించియున్నదికదా ?

కీర—ఆ జీవించియే యున్నది.

ఛత్ర—ఔరా! యెందునను నెవరికినిఁ గనుపడకపో యెనే. ఈ చిలుక మాటలాడుటలో నేను మరలఁ జన్ద్రికను వివాహమాడుటకు సిద్ధమైతినని నన్నుఁ జపలచిత్తుఁడనని యుద్ఘాటనఁ జేసినది.

మిత్ర—స్వామీ! అంతయె కాదు. ఆమె వివాహము మాటను గూడ నడుగుడు.

ఛత్ర—ఓ కీరవతంసమా! ఆ ప్రసన్నముఖికి పెండ్లి యైనదా ?

కీర—ఔ, అయినది.

ఛత్ర—ఎవరిని పెండ్లియాడినది ?

కీర.—యోగిరాజును.

ఛత్ర—ఎచ్చట?

కీర—వింధ్యవాసినీ సమక్షమున.

ఛత్ర—ఔరా యేమిది? నాహృదయము కొట్టుకొనుచున్నదే! యేమి సేయుదును" అని తనలోఁ దా నిట్లు పరితాపము నిందెను. "హా! ప్రసన్నముఖి! యీ దీనుని జన్మము వ్యర్థముగఁ జేసితివా? న న్నేకారణమున నిరాకరించి యోగికిఁ బెండ్లియాడితివి ! పౌరుషవంతుఁడనుగానా? స్వార్థపరుఁడనా? నిర్దయుఁడనా? కుత్సితుఁడనా ? న న్నెందుచేత బహిష్కారముఁ జేసి హీనుని, యోగిని బరిణయమాడితివి ? అక్కటా ! ఆ శ్రీప్రాణనాథుని మాటలన్నియుఁ గల్లలయ్యెనుగదా ? ఇంత వఱకు నెందో యున్న దనియు నన్నుఁ బరిణయ మగుననియుఁ బుట్టెడాశతో నుంటినిగదా? హా! మందభాగ్యుఁడను." అను సమయమున శ్రీప్రాణనాథయోగీంద్రుఁ డరుదెంచెను. ఛత్రసాలుఁ డెదురేగి నమస్కరించెను. "వత్సా! నిన్ను జయలక్ష్మి వరించుఁగాక. ఢిల్లీనుండి యమితమైన సేన బయలుదేరుచున్నది.

ఇదివఱకు జరిగినవి యుద్ధములు కావు. ముందు భయంకరర
ణము జరుగనున్నది ఆవచ్చువాఁడు మీార్జానదరుద్దీను నీశక్తి
నంతయు నుపయోగపఱుపవలయును. ఒకనిమిషమైన నాలస్య
ము చేయరాదు. సమస్తసేనలను సన్నాహపఱుపుము. ఈవ
చ్చువాఁడు కేవలమాయావతారము. బహుజాగ్రతతో సము
రకృత్యము నెఱపుము.

ఛత్ర—చిత్తము. అటులే వర్తించెదను. కాని యీ
చిలుక చెప్పు మాటలను వినవలయును.

శ్రీప్రా—ఏమి చెప్పినది ?

ఛత్ర—ప్రసన్నముఖి యోగిరాజును బరిణయమైనదఁ
ట. జీవించియే యున్నదఁట. ఆమె యునికిఁ జెప్పుమన్నఁ
జెప్పదఁట.

శ్రీప్రా—సరియే కానిమ్ము. దానియర్థము నే నెఱుం
గుదును. సమరానంతరమున నీచిలుక మాటలను విమర్శింతము.

ఛత్ర—కీరమా ! మేము వచ్చువఱకు నీవిందె యుం
డవలయును.

కీర—నే నుండుటకు వలనుపడదు. అవసరమైనఁ బున
స్సందర్శనము సేసెదను నన్ను విడువుము.

శ్రీప్రా—కీరమా ! నీ విప్పు డెందుఁబోయెదవు?

కీర—నానంచారభూమికిఁ బోయెదను.

శ్రీప్రా—నీవుమహారాజున కేమియుపకారము సే
సెదవు ?

కీర——ఏమి కావలయునో దానిని జేసెదను.

శ్రీస్త్రా——నీ నీశక్త్యనుసారముగ బోయి మహలిలో నున్న యూటవిక రాజులను రణమునకు రమ్మని రాజాజ్ఞను దెలుపుము.

కీర——ఆ, ఇపుడే చెప్పివచ్చెదను నన్ను పంపుడు.

ఛత్రసాలుఁడు విడుచును చిలుక నెగిరిపోవును అంతట ధణధణయని రణభేరులు మ్రోగినాగము. యోగీంద్రుడు వెడలిపోయెను. ఛత్రసాలుఁడు శస్త్రాగారమునకుఁ బోయెను.

## ముప్పదియొకటవ ప్రకరణము.

### ఛత్రసాలవిజయము.

పూర్వపశ్చిమదిక్కులను గొలుచుటకు సేపర్వతపంక్తిని మానదండమని వాడితిమో యెయ్యది పేకుల నవ్వరఖానునకుఁ బాఱిపోవుటకు నిరోధమయ్యెనో యేగిరిమాల వహ్నిప్రాకారముపోల్కి జ్వాలామాలినియై ఛత్రసాలమహీపాలునకు విజయలక్ష్మిని జేతి కందిచ్చెనో యట్టికనుమపై నెక్కి వచ్చుచున్న శత్రువులకుఁ గనుపడకుండ నొక సేనాసంఘము డాఁగెను ఆకొండకనుమ యుత్తరభాగంబున నాధారణపుటడవియు,

నచ్చటచ్చటఁ గొద్దిపాటికొండగుట్టలును గలవు. ఎదుటనుండి వచ్చుసేన యరమైలుదూరమునకు వచ్చువఱకును మెట్టలు చాటగుటచేతఁ గనఁబడదు. అప్పటికి జాము ప్రొద్దెక్కినది. తురుష్కసేన లాపర్వతదేశమునకుఁ బ్రవేశించుచుండెను. కాని యాజాడ రాజసైనికులు గనిపెట్టఁజాలరయిరి. రాజసేన లాపర్వతమున నున్నటులు తురుష్కసేనలు గనిపెట్టలేదు. అవి చిన్న గుట్టలప్రక్కనుండి క్రమముగఁ బ్రవాహము వచ్చినట్లు కనుమసమీపమునకు రాఁజొచ్చెను. రాజసేనలో నొకఁడు కనిపెట్టి యందఱకును సైగఁజేసెను అందఱును దుపాకులను గురిసేయుటకు సిద్ధముగ నుండిరి. అంతట నొక శృంగనాదము "ఢాం" మని వినవచ్చెను. ఢమఢమ యని తుపాకులును బ్రేలుట కారంభించెను. అప్పుడు తురుష్కరణదుందుభి ప్రళయకాలభైరవఢక్కవలె మ్రోగుచు రోదసీకుహరమును భేదింపఁజొచ్చెను. అపుడు చైత్రమాసపుభాస్కరుఁడు తీవ్రముగ నెండ కాయుచున్నను దుపాకులనుండి వెడలుపొగచేత నాకసంబు మేఘావరణమై సూర్యకాంతిని మాయించెను. తుపాకులధ్వనులు నిరంతరావిచ్ఛిన్నస్తనితములట్లు భయజనకములయ్యెను. కాని తురుష్కసేనలకు వృక్షస్కంధములును, గొండరాళ్ళును గుండ్ల దెబ్బలు తగులకుండ సహాయము లయ్యెను తురుష్కులగుండ్లబారులు రాజసేనలకుఁ గొండమీఁదనుండుటచేత నిసుమంతయు నష్టమును గలుగఁజేయనయ్యెను. ఇట్లు రెండుజాములవఱకు భయంకరమైనయుద్ధము జరిగెను. పోరు

ఘోరముగా జరుగుచుండెను, గాని యెవ్వరును దీసిపోలేదు. అది మొదలు క్రమముగ వృక్షములన్నియు నేలఁగూలినవి. అటులే తీసిపోక వానిచాటుననుండి పాఱిపోక తురుష్కులు పోరుచునే యుండిరి. అంతట వెనుకనుండి రాజసైనికులమీఁద గుండ్లవర్షము కురియనారంభించెను. తమసైన్యములే శాత్రవసైన్యభ్రాంతిచేతఁ దమ్ముఁగొట్టుచున్నారని భ్రమపడి రాజసైన్యచిహ్నమైనధ్వజమును దురుష్కులచేఁ బడఁగొట్టబడిన దానిని దిరిగి స్థాపించి శృంగనాదముఁ జేసిరి. అయిన నా గుండ్లవర్షము మానదయ్యెను. అప్పు డదేమో మోసమని తెలిసి వెనుకకుఁగూడ గుండ్లబారులు వేయుఁడని పంపిరి ఇట్లు ఇక్కిఁగొత్తరదళలనుండి తురుష్కాగ్ని కురియుచుండ మత్స్యనుండు గణపతిసింహుఁడును, సంగ్రామసింహుఁడును, రామబాహువులు కలవారయ్యు నాసమయమున సహస్రబాహువులట్లు బీసుపోక రణము సలుపుచుండిరి. రాజసైన్యమునకు మందుగుండు సామగ్రి కొంచెముమాత్రముండెను. దానితోడనే పదిగుండ్లకొకగోళమును బ్రయోగించుచు సరిపోయినపిమ్మట గలియఁబడి కత్తులతో యుద్ధము సేయుటకు సంసిద్ధమైయుండె. అంతలో ఛత్రసాలమహీపాలుఁడును వీరవర్మయు సమితమైన సేనతో వచ్చి తా మదివఱకు సేనను నిలిపియుంచిన పర్వతవంకకే కేవలనే యొకసేన యుండుటఁ గాంచి శత్రుసైన్య మని నిశ్చయించి మధ్యను పమసేన నిల్పి యిరుదెసలను దురుష్కసేసలు రణమొనరించుటఁ గాంచి తాము వచ్చితిమనియు భయ

పడవల దనియుఁ దెలుపునట్లు శృంగనాదము లొక్కపెట్టున మ్రోగించి యీవల నున్న తురుష్కసేనమీఁద నగ్నిగోళవర్షమును గురిపింప జొచ్చిరి. అంతకు మున్నటి గణపతిసింహాముఖుల యవస్థయే యీతురుష్కులకును సంప్రాప్తమైనది. అక్కటా ! మనమే మధ్యఁబడి మ్రగ్గుచుంటి మని ప్రతితురుష్కుని మనంబును దిగులొందెను. ఈవిధంబుగఁ బోరుచుండిరి. వెంటనే రింగు మని ధ్వనితో మిణుగురులదండువలె నలుగు ల్లాకనమున బయలుదేఱి తురుష్కశరీరములఁ దూలఁచుచుండెను. వారిపైఁగూడ ఫిరంగిబారు చేయుటకు నాటవికు లెందునుగానరైరి వారు దూరమున నున్నకొండమీఁదనుండి శరవర్షమును గురిపింప నర్జునశరముల ట్లమోఘములై కోలకొక్కని చొప్పునఁ గూల్చుచుండెను. వెనుక నున్నతురుష్కసేన యయిదువేలు. మధ్యచిక్కువడిన మొగలుసేన పదియేనువేలు. ఇచ్చట మీర్జానసరుద్దీను తనప్రతాపముఁ జూప నారంభించెను. గాని యాటవికశరబాధచేతఁ జాలమంది మడిసిరి. కాని యామీర్జా వెనుదీయక యుభయులకుఁ దగినటుల సమాధానముఁ జెప్పనారంభించెను. పోరున కంతము లేకుండెను. ఇట్లుండఁ దురుష్కసైనికులప్రతాప మస్తమించు ననుసూచన చేయుచుండెనో యనునట్లులఁ బ్రభాకరుఁ డస్తమించెను. కాని వెంటనే సుధాకరుఁ డుదయించి గగనభాగ మలంకరించెను ఆదినము శుక్లైకాదశి యగుటచేత వెన్నెల వెంటనే వచ్చెను. పోరు సంపూర్తి కాలేదు. విడుచుటకు నుభయులకు

ను వీలు లేకుండెను. మందుగుండ్లపరికరములు ప్రాజ్యము కా జొచ్చెను. ఉభయసేలును మధ్యనే చిక్కువడినవి. ఇంక నే మి సేయుటకును దోచక కరవాలముల ధరించి కలియఁబడుట యే మేలని యెంచునంతలో మీర్జానదరుద్దీను వెనుకటిసేనలో నున్నటులగ్రహించి గణపతిసింహ సంగ్రామసింహులు తమ ముందిట నున్న సేనలు బజారుమూఁక యని విడిచి, తమదృ ష్టి వెనుకకే ప్రసరింపఁజేసి కొండదిగుట కారంభించిరి. వీరు పాఱిపోవుచున్నారని తలంచి వెనుక నున్న సేన క్రమముగఁ గొండనెక్కి తామును దిగిరి. ఛత్రసాలుఁడు మొదలగువారు ను గోళికాప్రయోగములను మాని ఖడ్గధారులై మీర్జానద రుద్దీనుమీఁదికిఁ గలయఁబడిరి. అప్పుడు రాజసేనాతురుష్కుల సేనలుఁ కలసి ఖడ్గయుద్ధము సేయ నారంభించిరి. ఆటవికులు తమయలుగులు రాత్రియగుటచేతను కలయఁబడుటచేతను దమసేనలకే తగులు నని భయంబున గొనయమును సడలిం చి యూరక చూచుచుండిరి చెంచునాయకుఁడుమాత్రము ఖడ్గమును ధరించి తనయపూర్వబాహుపరాక్రమమును జూపఁ దొడంగెను. గణపతిసింహుఁడు హసనల్లీఖానుతోడను సంగ్రా మసింహుఁడు మీర్జానదరుద్దీనుతోడను వీరవర్మ దావుద్ఖా నుతోడను యుద్ధము సేయుచుండ, ఛత్రసాలమహీపాలుఁ డావీరకృత్యమును జూచుచుండ వెనుకనుండి ఫీదాయీఖాను వచ్చి ఛత్రసాలునిమీఁదఁ దనఖడ్గము నెత్తెను. వెనుకనుండి చెంచునాయకుఁడు వచ్చి వానిబాహువును నఱకెను. మఱి

యొకతురుష్క సరదారుఁడు వచ్చి చెంచునాయకునిఁ దలపడె ను. ఆసమయమునఁ జెంచునాయకుఁడు సలిపిన వీరవిహారము ను గన్నులారఁ జూచిన నభిమన్యుఁడు తలఁపునకు రాకమా నఁడు. ఇట్లిరువది వేల సేనలో మూఁడువంతులు మడిసి యయిదు వేలుమాత్రము మిగిలినది. తురుష్క యోధులందఱు రణభూ మిని సోలిరి. ఉన్నవారితో రణము సేయుటకు నుంతయు శక్తి లేక పోయెను. ఒకనిమిషమైన వెన్నార్చికొనుటకు సమయము లేదు. చక్రవర్తి మెప్పు దేవుఁ డెఱుఁగు నని యద్ధైర్యము దోఁచెను. కాని పాఱిపోవుటకుఁ గూడ సమయము దొరకద య్యె. ఇంతలోఁ దురుష్క ప్రతాపముతోఁ బాటు చంద్రుఁడు కూడ నస్తమించెను. చీకటి క్రమముగ వ్యాప్తము కాఁజొ చ్చెను. ఆతిమిరసహాయమున నెమ్మదిగ మీర్జా చాటుచాటు నకుఁ బోయి మార్గము ననుసరింపక తాను బశ్చిమాభిము ఖుఁడై కొండలమార్గము ననుసరించెను. అది గాంచి తురు ష్కులందఱును మీర్జామార్గమునే యనుసరించిరి. ఎందుఁ గాంచినను దమసేనయే కాని యొక్క తురుష్కుఁడును గనఁబ డఁడయ్యెను. అంతటఁ బోరు శాంతిల్లెను. తెల్లవాఱునంతకు నచ్చటనే యుండి ఛత్రసాలాదులు శ్రమ నపనయించుకొనిరి.



## ముప్పది రెండవ ప్రకరణము.

### కల్యాణము.

అప్పటికే సూర్యోదయ మగుచుండెను. అందఱు శంబర పుర కేళికాభవనమునకుఁ దెల్లవాఱకమున్న రావలయునని చాటించిరి. "నాయారాటముకొలఁది నేను వచ్చివేచియుంటి నింక నెవ్వరును రారైరి. యేమిచెప్పనూ!" అని యొకచోటఁ మిత్రదాసుఁడు కూరుచుండి యాలోచించుచుండఁగనే యనేకులు వచ్చి సభాభవనమునఁ గూరుచుండిరి. ఛత్రసాలమహీపాలుఁడును గణపతిసింహ సంగ్రామసింహ వీరవర్మాదులును జెంచు నాయకుఁడు మొదలగు నాటవికవర్గమును శ్రీప్రాణనాథయోగీంద్రుఁడును శివరాత్రినాఁడు భటులు తెచ్చిన యోగీంద్రుఁడును, దక్కినసామంతరాజులును వచ్చి వారివారికిఁ దగిన యాసనముల నాసీనులైరి.

శ్రీ—మిత్రదాసుఁడా! చిలుక వచ్చినదా?

మిత్ర—స్వామీ వచ్చియున్నది. అని చెంచునాయకుని చెంత నున్న చిలుకను దెచ్చి యోగీంద్రున కర్పించెను.

శ్రీప్రా—ఓశుకరాజమా! నీవు ప్రసన్నముఖి నెఱుంగుదువా?

చిలుక—ఎఱుఁగుదును.

శ్రీ—ఆమెకు వివాహమైనదా?

చిలుక—అయినది.

శ్రీత—ఎవరిని వివాహమాడినది?

చిలుక—యోగిరాజును.

శ్రీప్రా—ఎచ్చట.

చిలుక—దేవియైన వింధ్యవాసినీసముఖమున.

శ్రీప్రా—ఆసమయమున నే నున్నవాఁడనుగదా?

చిలుక—ఆ! మీరును గలరు.

శ్రీప్రా—ఆయోగిరాజు నిక్కడకుఁ దోడి తెచ్చిన. మీ ప్రసన్న నిక్కడఁ బ్రసన్నురాలిగఁ జేసెదవా?

చిలుక—ఆ. అటులే యని చెంచురాజు చేతిమీఁదికిఁ బోయి వ్రాలెను ఆచెంచురాజు తిన్నగ వచ్చి మిత్రదాసుని చేయిఁ బట్టుకొనెను ఇద్దఱును గలసి యభ్యంతరసీమకుఁ బోయిరి.

శ్రీప్రాణనాథయోగియు ఛత్రసాలుసహస్తముఁ బట్టుకొని మందిరాంతరమునకుఁ బోయెను పట్టుఁవడినబైరాగి వింతగఁ జూచుచుండెను. అందఱు నిదేమివింత యని యాలోచించుచుండఁగనే శ్రీప్రాణనాథుఁడును యోగివేషముతో ఛత్రసాలమహీపాలుఁడును బ్రవేశించిరి. కొంతసేపటికి భువనమోహనలక్ష్మియో యన నొకచెలికత్తె భుజమునఁ జేయి వైచికొని ప్రసన్నముఖి ప్రవేశించి యోగివేషమున నున్న ఛత్రసాలునకు నమస్కరించి యెడమవైపున నిలిచెను. భటులకుఁ బట్టువడినయోగి „అమ్మా! ప్రసన్నా! బ్రతికియుంటివా" అని కన్నీళ్ళు విడుచుచు వచ్చి కాళ్ళు పట్టుకొని ముద్దుపెట్టుకొనెను. „ఓసీ మిత్రవిందా, యిన్నాళ్ళవఱకు నెక్కడ నుంటి

వే" యని యానందబాష్పముల నొలికించి గద్గదకంఠుc డయ్యెను.

చెలికత్తె—ఇంతవఱకు మిత్రదాసుc డను నామము తో మహారాజునకుc బ్రసన్నయొద్దనుండి లేఖను దెచ్చియిచ్చి రాజసేవ సేయుచుంటిని. నేనే మిత్రవిందను.

శ్రీప్ర—ఓయీ వీరవర్మా ! నీపుత్రికను జంద్రికను రప్పింపు మని చెప్పెను. వీరవర్మ స్వామీ! అటులే రప్పించెద నని పిలిపించెను. చంద్రికయు మందహాసవదనారవిందయై యాశ్చర్యముతోc జనుదెంచి తండ్రిచెంత నిలిచెను.

శ్రీప్ర—అమ్మా ! చంద్రికాదేవీ, వింధ్యవాసినీసమ క్షమున నీవు దేవిని బూజించుచుండ నాసమక్షమున నున్న యోగీంద్రుc డీయనయేనా ?

చంద్రి—స్వామీ ! చిత్తము.

శ్రీప్రా—ఆసమయమున దేవీపూజార్థమై వచ్చి నీకం టె ముందు దూరమున నుండియే దేవిని బూజించి ప్రత్యక్ష ప్రసాదమును గైకొని యీయోగీంద్రున కర్ఘ్య మిచ్చి పూ జించి పుష్పహారమును వేసినసాధ్వి యామెయేనా ?

చంద్రి—స్వామీ. అపుడు చెంచుదానివేషముగc గనcబడినది కాని. ఆమెయే యీామె యని చెప్పుటకు సంది యము లేదు.

శ్రీప్రా—"ఓయోగిపుంగవా! నిన్ను యోగివేషము నుండి మార్చుచున్నా నని జటామకుటమును కాషాయోత్తరీ

యమును దీసి నవరత్నకిరీటమును మహాళి నమర్చి కాంచనాం ముసు గప్పి ,,సభాసదులారా! చూచితిరికదా? యీమహా రాజనకుఁ దగినకన్యక ప్రసన్నముఖీదేవి యని నేన నిర్ణయిం చితిని. దైవికముగ నామె కనఁబడకపోవుటచేతఁ దురుసు రాభవమునకు జడిసి యాత్మహత్యఁ జేసికొనె నని తల ద్రికాదేవిని మరల రాజమహిషిగాఁ దలంచి యామెను టకై వింధ్యవాసినీపూజకుఁ జంద్రిక వచ్చు ననియు రాజేంద్రు డప్పుడు చూచు ననియు దలంచి యీమహారాజునకు యోగి షము వేసి యీదేవిసన్నిధిని నాచెంత నుంచుకొంటిని. అ లో నీప్రసన్నముఖీదేవి చెంచునాయకుఁ డని ప్రసిద్ధిఁ గాం యుండుటచేతఁ జెంచువనితవలె వచ్చి దేవీపూజ గావిం పిమ్మట నీకపటయోగి యైనరాజేంద్రున కర్ఘ్య మిచ్చి పుష్ప మాలిక కంఠమున వేసి ప్రదక్షిణనమస్కారం బాచరిం చనెను. అందుచేత మహారాజునకుఁ బ్రథమభార్య ప్రసన్నము ఖీదేవి రెండవభార్య చంద్రికాదేవి" యని చెప్పి వరవధూ యమునకు శిరమున నక్షతలఁ జల్లి యీదంపతులను బరమే రుఁడు స్వదేశోద్ధారకబిరుదము నొసంగి రక్షించుగాక యు ను. ప్రసన్నయుఁ జంద్రికయు రాజునకు నమస్కరించి సభా దుల కొకనమస్కారముఁ జేసిరి. అందఱును నానందః ముదమొందిరి.

శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.

సంపూర్ణము.



